# పోయినమూ-పొందనమూ

ఆ వేళ సాయంత్రం అక్కయ్యవంక మిడుతూ మిడుతూ చూస్తూ కూర్చున్నాను. ఆమె నావంక ఉలుకూ ఉలుకూ చూస్తూ ఉన్నది. మాకు కొంత ఎడంగా కూర్చుని వొత్తులు చేసుకొంటున్న నాయనమ్మ మా యిద్దరివంకా నిరాశగా, నిర్వేదంగా—చూస్తూ పనిచేసుకుంటున్నది.

ఆ సాయంత్రం—హృదయాంతర భావాలు, కోపతాపాలు, రాగ విరాగాలు-కన్నులలో, చూపులలో—విసిరి కొట్టుకుంటూ ఉండిన మా ముగ్గురినీ—ఎవరైనా క్రొత్తవారు వచ్చి చూచి ఉండినట్లయితే-బహుశా నిర్ఘాంతపోయి ఉందురు.

కాని మా ముగ్గురికీ-అట్టి భావ ప్రకోపనము క్రొత్తకానీ, ఆశ్చర్య జనకం కానీ—కాదు. ఆదివరకు చాలాసార్లు—అదే విషయంమీద అక్కయ్యకూ, నాకూ-కీచులాట జరగటమూ—నాయనమ్మ కొంత సర్ది చెప్పటానికి ప్రయత్నించిన మీదట విఫలురాలై ఇద్దరినీ చివాట్లు వేయటమూ—ఆ తర్వాత చాలా సేపటివరకూ ముగ్గురమూ దృగ్బాణాలను ఒకరివంక ఒకరము ప్రసారం చేసుకోవటమూ—మాకు బాగా అలవాటే.

నాకు పదమూడేళ్ళు అక్కయ్యకు పదహారోయేడు. పదమూడేళ్ల వయసులో ఉన్న ఏ ఆడపిల్లకు చెవులకు పోగులూ, రకరకాల దుద్దులూ పెట్టుకోవాలని కోరిక ఉండదు! నేను చేసిందికూడా ఇంతే. నా ఈ న్యాయమైన కోరిక తీరకుండా-ఇకముందు యేనాటికీ తీరకుండా-చేసిన అక్కయ్యమీద నాకు కోపం ఉండటం కూడా న్యాయమే. ఇది ఉచితం కాదని ఎవరూ-ఆఖరుకు మా యిద్దరి మధ్యా తగవులుతీర్చే అనధికార న్యాయమూర్తి నాయనమ్మ కూడా-అనటానికి సాహసించలేరు!

నాయనమ్మ సందర్భం వచ్చినప్పుడల్లా ఆ కథ ఇల్లా వల్లెవేస్తుంటుంది-

'అప్పుడు పెద్దమ్మాయికి నాలుగేళ్ళు. చిన్నది ఏడాది పిల్ల. శ్రావణమాసంలో ఒక మంచి రోజు చూసి ఇద్దరికీ చెవులు కుట్టించి జూంకీలు తగిలించాము. ఆ ఒక్కరోజేనమ్మా ఆ ముచ్చట. ఆ మర్నాటినుంచీ చిన్నదానికి పోగులు పెట్టుకునే యోగం లేకుండా పోయింది!'

ఇల్లా కథ మంచి రసవత్తరఘట్టంలో నిలిపివేసి నాయనమ్మ ఓ దీర్ఘనిశ్వాసం విడుస్తుంది. ఆ వింటున్నవారు ఇక ఆ సస్పెన్సు భరించలేక 'ఏం, ఏమయింది?'-అంటూ తర్వాతి కథకోసం ఉబ్బటలూగిపోతారు. వాళ్ళచేత కొంతసేపు అట్లా బ్రతిమాలించుకుంటే కాని నాయనమ్మకు కథ నడిపించటానికి తగిన ఉత్సాహం కలగదు. ఇట్లా ఆ శ్రోతలలో తగినంత సంచలనం కలిగిన తర్వాత ఆవిడ తాపీగా మొదలుపెడుతుంది.

'మేడమీద మాకు ఒక ఉయ్యాలబల్ల తగలబడింది కాదూ! మర్నాడు పొద్దుట మేం అందరం క్రింద పనిపాటుల్లో మునిగి ఉండగా, పెద్దపిల్ల చిన్నదాన్ని చంక నేసుకుని ఎట్లా వెళ్ళిందో ఏమో—మేడ మీదకు వెళ్ళి ఆ ఉయ్యాలబల్లమీద కూర్చో

## వేదవతీదేవి

పెట్టింది పక్కను తానూ కూర్చుంది. ఉయ్యాల ఊగుతూ ఉన్నారు-బాగుందా-పెద్దమ్మాయికి హఠాత్తుగా చిన్నది ముద్దు వచ్చింది. దక్కా ముందుకి వంగి పసిదాని బుగ్గలు ముద్దులు పెట్టుకుంటూ ఉంది. అంతే, ఆ సందుపాళీలో ఇద్దరి జూంకీలూ పెనవేసుకుపోయినాయి కామోసమ్మా. పెద్దది వదిలించుకుందామని తంటాలుపడింది కానీ-ఆ బ్రహ్మముళ్లు ఒకపట్టాన ఊడిరాలేదు. చిన్న మేళాం కాదూ, తొందరగా విడదీసుకోవాలని పెద్దపిల్ల ఒక్క లాగులాగింది!'

'చ్చ..చ్చ..చ్చ!'-ఆ వింటున్నవారు ఈ తుదిముక్క వినేసరికి సానుభూతిగా ఇట్లా అంటారు.

అట్టి సమయాలలో నాకు వొళ్లు జలదరించినంత పనై-పై పెచ్చు వారి సానుభూతి 'చ్చ...చ్చ'లు అగ్నిలో ఆజ్యం పోసినట్లు కాగా- అక్కయ్య వంక కసిగా, కోపంగా చూస్తాను నేను. అంతే—అంతటితో నాంది ప్రస్తావన ఆరంభమవుతుంది మా కీచులాటకు.

సరి, నాయనమ్మ కథానులాపము ఇంకా పూర్తికాలేదు. శ్రోతల 'చ్చ...చ్చ'లు—ఆవిడ కథాసంవిధానాన్ని మరికొంత పురికొల్పగా మళ్ళీ ప్రారంభిస్తుంది.

'ఇంకేముంది తల్లీ, పసిదాని చెవులు తెగవి కూడానా, ఆ ఊపులో దాని లోలక్కులతో సహా చెవి తమ్మెలో కొంత భాగం ఊడి వచ్చేసింది! మేం క్రిందనుంచి పరిగెత్తుకు వెళ్ళేసరికి ఇదీ సంగతి! ఒక నెల రోజులకు కాని ఆ గాయం మానలేదు! రెండవ చెవి బంగారంలా బాగానే ఉందనుకొంటే ఆ రోజే ఆ చెవి జూంకీ కూడా కత్తిరింపించి తీయించి వేశాము. ఏమి చేస్తాము!'

నా కుడి చెవి తమ్మెలో అరంగుళం మేర కత్తిరించి వేసినట్లు కనపడే సదర్నమే—నాయనమ్మ కథకు ప్రబల సాక్ష్యం. కాని, అక్కయ్య ఆనాడు చేసిన ఘనకార్యానికి పర్యవసానంగా—ఆమె కూడా ఇటువంటి నష్టమే పొంది ఉంటే—మా ఇద్దరి మధ్యా ఈ కీచులాటకు బహుశా స్థానం ఉండేది కాదు. కాని, ఈ విషయంలో పూర్తిగా నష్టపడింది నేను. అక్కయ్య జూంకీలూ, పోగులు పెట్టుకుని తిరుగుతూనే ఉన్నది. బోసి చెవులు వేసుకుని, వట్టి ముఖం వేసుకుని—ఉండవలసి వచ్చింది మాత్రం నేను!

అక్కయ్య చెవులని జూంకీలు అందంగా కదిలినప్పుడల్లా, ఆమె చెవులని పుష్యరాగాల దుద్దులు తళతళ మెరిసినప్పుడల్లా నాలో ఆవిరివలె ద్వేషం పొంగి వచ్చేది. ఏదో ఒక కారణం, సందర్భం లేకపోయినా—తెచ్చుకుని అక్కయ్యని నేను దెప్పటమూ-ఆమె కోపంతేనా తెచ్చుకోకుండా-నా స్థితికి సలకంతైనా జాలి పడకుండా—ఏదో సమాధానం విసిరి కొట్టటమూ-మాకు దినచర్య క్రిందే లెక్క అయిపోయింది.

'నా సైన్సు పుస్తకం చూచావుటే?'

'ఏమో, నీ జూంకీల నడుగు!'

'ఇప్పుడు నా జూంకీల గొడవెందుకు నీకు?'

'జూంకీల గొడవ కాకపోతే మరేమిటి కావాలి నాకు? మహా అందంగా ఉన్నావులే రెండు చెవులనీ వగ లేసుకుని!'

'నా అందం సంగతి నీ కేమీ పొగడక్కరలేదు. నీకంటే బాగానే ఉన్నానులే!'

'నేను ఎంత బాగా ఉండకపోతే నీకంత

కుద్దు వచ్చాను? అసలు నువ్వు నన్ను కావాలని ముద్దుపెట్టుకుని లోలక్కులు ముడి వేశావు!'

'చూడవే అమ్మా!'

'చూడవే నాయనమ్మా!'

ఇంత నిష్కారణంగా బయలు దేరిన మా తగవు చివరకు మా అనధికార న్యాయాధికారిణి నాయనమ్మ దగ్గరకు వెళ్ళి చేరేది.

'ఎందుకే అయినదానికీ కానిదానికీ దాని మీద పోట్లాటకు వెడతావు? అది తెలిసి చేసిందాయేమిటి? అప్పుడది చాలు గోళ్ళపిల్ల! నీ ప్రారబ్ధం చొప్పున ఇట్లా అయింది కానీ!...' అని నన్నూ,

'నీవు మరీ చిన్నపిల్లవయిపోతున్నావు పెద్దమ్మాయ్. అది చిన్నదీ, పోగులు పెట్టుకుంటానికి వీలుకాకుండాపోయిందని దానికి మాత్రం బాధగా ఉండదూ? చిన్నతనంలో తెలియక చేసినా తప్పు తప్పే! అది యేమన్నా నీవు మాట్లాడకూడదు!......' అని అక్కయ్యనూ - కూకలేసి - ఆఖరుకు సాధారణంగా ఒక పదజాలంతో - తన తీర్పును ముగించివేసేది.

'పిల్లలు పెద్దవాళ్ళవుతున్నారు కాని బొత్తిగా పోయినమూ పోందనమూ లేదమ్మా'-అని.

ఇంతా అయినాక నాయనమ్మ మా యిద్దరిలో ఎవరిపక్షాన డిక్రీవచ్చిందో-మాకు బుర్ర బద్దలు కొట్టుకున్నా అర్థమయ్యేది కాదు. కాగా, నాకు ఒక సందేహం మాత్రం తెరటంలా ముంచుకు వచ్చేది.

నాయనమ్మ వాడినపదజాలంలో 'పోయినము' అంటే అందరికీ తెలిసిన విషయమే. అంటే 'పైనము' - అంటే 'వివరము' అన్న మాట. కాని ఆ 'పోందనము' దగ్గరే వచ్చేది చిక్కు. ఆ 'పోందనం' అనే పదాన్ని ఆవిడ ఏ అర్థంలో ఉపయోగించిందో ఎన్ని సార్లు అడిగినా ఆమె నాకు చెప్పలేదు సరికదా - మళ్లా ఆ పదాల పవిత్రమైన కూర్పునే నాపైని అనర్గళంగా విసిరి కొట్టేది!

కాని ఈ వ్యవహారం ఇల్లా ఆట్టేకాలం సాగలేదు. కొన్నాళ్ళ నుంచీ, నాయనమ్మకు అత్యంత ప్రీతికరమైన ఈ పదజాలాన్ని నేను ఒక్కర్తినే భరించవల్సి వచ్చింది. కాగా, నాయనమ్మ దృష్టిలో అక్కయ్య ఒక్కసారిగా ఉత్తమురాలై కూర్చుంది! అది ఇల్లా జరిగింది.

ఆవ్వేళ ఆదివారం. బడికి శెలవు కావటం మూలాన్ని మధ్యాహ్నం వేళ మేం ఇద్దరం అలవోకగా ఇంట్లో పచారు కొడుతున్నాము. ఇంతట్లోకి మా పక్కవాటాలో ఈ మధ్యనే క్రొత్తగా దిగిన పిన్నిగారు ఊసుపోక మాయింట్లోకి వచ్చి కూర్చుంది. ఆవిడగారు మాకు ఇంచుమించు నిత్య చర్య అయిన కాలొడ్డెములకల భాషణములు ఇంకా వినలేదు.

ఇక, కొంతసేపు పోయాక ఆమె నాచెవి వంక చూచి అదేమని ప్రశ్నవేయడమూ, నాయనమ్మ కథా క్రమానికి ఉపక్రమించడమూ యథాతథంగా జరిగాయి.

నేను అక్కయ్యవంక చాటుగా చూచాను. ఇటువంటి సమావేశం జరిగాక- అవతల వాళ్ళు ఇంకా ఇంట్లో ఉండగానూ - మరి కొన్నిసార్లు వాళ్ళు గడపదాటుతూ ఉండగానూ- మా మధ్య కయ్యం ప్రారంభం కావడం సాధారణంగా అలవాటు. ఈ సంగతి నాకూ, అక్కయ్యకూ, నాయనమ్మకూ, కూడా బాగా తెలుసు.

కాని అక్కయ్య మనస్సులో ఏముందో కానీ, ఈసారి నాచూపుకు తగిన ప్రతిచూపు విసరలేదు! నాయనమ్మ ముఖతః ప్రసారమవుతున్న కథను తానూ అప్పుడే క్రొత్తగా వింటున్నట్లు కళ్లు వప్పజెప్పి కూర్చున్నది!

"చ్ఛ...చ్ఛ...చ్ఛ!"



# వొయినము వొందనము



కథ పూర్తయింది. నాకు ఊపిరితీసుకునే సమయం కూడా ఇవ్వకుండానే అక్కయ్య చప్పున అందుకుంది.

"మరేనండి పిన్నిగారూ, అప్పుడు నాకు యుక్తాయుక్తం తెలియని రోజులే అయినా ఆ విషయం గురించి నేను బాధపడని రోజు లేదనుకోండి. దాని చెవుల వంక చూసినప్పుడల్లా నా మనస్సు చెరువులా అయిపోతుంది. అమ్మావాళ్ళు కొప్పడతారని కానీ, లేకపోతే నేను చెవులకు దుద్దులు పెట్టుకోకనే పోదును! ఉండి, ఉండి ఎప్పుడో తీసివేస్తాను సుమండీ! దానివి బోసిగా ఉంచి నా చెవులని పోగులు పెట్టుకుంటానికి నాకు ఎల్లా మనస్కరిస్తుంది చెప్పండి!"

నా చెవులను నేనే నమ్మలేనట్లు అక్కయ్య వంక చూసింది నేను ఒక్కరినే కాదు. నాయనమ్మ కూడానూ. పక్కింటి పిన్నిగారు కొన్ని సానుభూతి వాక్యాలు ఉచ్చరించి వెళ్లిపోయినాక, నాయనమ్మ అక్కయ్య తల రెండు చేతులతోనూ నిమిరి, తన తలకు వేళ్ళు విరుచుకుని ఇల్లా అంది—

"మా అమ్మే ఎంత వొయినం వొచ్చిందే మా తల్లికి! బంగారం లాగా, ఎంత వొందనంగా మాట్లాడావే మా అమ్మా!-అన్నది!

అక్కయ్య ముసి ముసి నవ్వు నవ్వుతూ నా వంక వోరగా చూసింది. నాకు ఏమి అనాలో, ఏమి చేయాలో—తోచింది కాదు. ఆ సమయంలో వెఱ్ఱిబాగుల దానివలె నుంచుండి పోయాను.

అక్కయ్య ఆ ప్రొద్దుట కూడా ఈ విషయంమీదనే నాతో జగడం ఆడింది! ఇంతలో ఆమెకు అంత వయినమూ, వందనమూ ఎట్లా వచ్చిపడిందో నాకు అర్థం కాని విషయంగానే ఉండి పోయింది.

దుద్దులూ, జుంకీలూ—తగిలించుకు తిరుగుతున్న అక్కయ్య బాగానే ఉంది. ఇంతకూ పోగులు పెట్టుకునే ప్రాప్తి లేకుండా చెవి మొటికి పోగొట్టించుకున్నదానిని నేనే అయినాను! వయినమూ, వందనమూ లేని దాన్ని నేనే అయినాను!

ఆ వేళ మాయిద్దరి మధ్యా జగడం జరగలేదు. అక్కయ్య అన్నమాటల్లో ఆట్టే నిజాయితీ ఉందని నేనైతే నమ్మలేదు కాని ఎంచాతనో అక్కయ్య ముఖతః ఆమాటలు విన్నాక, వెంటనే ఆరోజు పోట్లాడటానికి నా మనస్సు ఒప్పలేదు.

అక్కయ్య నాయనమ్మ దృష్టిలో మంచితనం తెచ్చుకోవాలని ఈ కొత్త టెక్నిక్కు కనిపెట్టింది! సందేహంలేదు! అక్కయ్య అవలంబించిన ఈ కొత్త వైఖరి నాలో ఉడుకుమోతుతనమే కలిగించింది కాని- నన్ను మరో కోరిక కూడా ఆరోజునుంచే జలగలా పట్టుకుని వేధించ సాగింది. నాయనమ్మచేత ఎట్లాగయినా నేనుకూడా వయినమూ, వందనమూ - కలదాన్నని అనిపించుకోవాలె!

అందుకు తగిన సమయం కనీసం కనిపెట్టుకుని కూర్చున్నాను. వేచి ఉండగా, ఉండగా - ఒక నెలరోజుల తర్వాత ఆ తరుణం వచ్చింది.

నాయనమ్మకు ఎంతో దూరపు బంధువులు - ఒక వృద్ధ దంపతులు - శ్రీశైలం యాత్రకు వెడుతూ, దారిలో ఆగి నాయనమ్మని పలకరించి పోదామని ఆ రోజు దిగారు. ఆరోజు నా పుట్టినరోజు కావడాన్ని పట్టు పరికిణీ వేసుకుని, కొత్తవోణీ వేసుగుని - అటూ యిటూ తిరుగుతున్న నన్ను చూచేసరికి, ఆ ముత్తయిదువకి పోగులులేని నా చెవులు బోసి వచ్చాయి. కాబోసు - అడగవల్సిన ప్రశ్న రానే వచ్చింది: నాయనమ్మగొంతు సవరించుకుని కథాకథనం కూడా ఎప్పటిలా పూర్తిచేసింది-

'చ్చు...చ్చు...చ్చు...'

తటాలున ఉపక్రమించాను నేను—

'కానీయండి మామ్మగారూ, ఎవరికర్మకు ఎవరు కర్తలు?' అక్కయ్య చేయాలని చేసిందా యేమిటి? నా చెవి అల్లా మొటికి పోవల్సిందని బ్రహ్మదేవుడు వ్రాసిఉంటే ఎవరు తప్పించగలరు? పోనీ, దాని చెవులైనా బావున్నాయి. అంతమట్టుకు మనం సంతోషించాలె?'

వచ్చిన బంధువులు ఆ రాత్రి శ్రీశైలం వెళ్ళిపోయారు. వాళ్లు అటు బండిఎక్కారో లేదో, నాయనమ్మ నా దగ్గరకు వచ్చి, చెంపలు నిమిరి, వేళ్లు తనతలకు విరుచుకుని,

'చిన్నదానికి కూడా ఎంతవొయినం వొచ్చిందే? ఆ వొచ్చినవాళ్ళు ముక్కుమీద వేలువేసుకు నేటట్లు ఎంత వొందనంగా అన్నావే బంగారుతల్లీ!'—అన్నది.

చాలు, అక్కయ్యతోపాటు నేనూ వొయినమూ, వొందనమూ కలదాన్ని అయినాను. ఇంకేమికావాలి!

ఆరోజుకూడా నేను అక్కయ్యతో పోట్లాడలేదు; కాని పరిహాసంగా, ఎగతాళిగా—అక్కయ్య ప్రారంభించిన ఆ 'టెక్నిక్కు'మాత్రం మాలో క్రమంగా ఒక విచిత్రమైన మార్పు తెచ్చింది!

మనఃస్ఫూర్తిగా కాకపోయినా, యాంత్రికంగా, నాటకంగా—మేంఇద్దరం పరస్పరం తెలుపుకున్న ఆ సానుభూతి వాక్యాలు—మాకు తెలియకుండానే—మా మనస్సులలో చొరవ చేసుకుని—దినదినమూ గాఢతరంగా నాటుకుపోసాగాయి! ఈవిధంగా అంతవరకూ వజ్రసదృశంగాఉండిన మా మనస్సులు క్రమంగా సరసములై, సున్నితములై, ఆర్ద్రములై—చివరకు ఒక్కసారిగా పరస్పరం స్నేహపూరితములై పోయినవి!

నాయనమ్మ అక్కయ్యకూ, నాకూ, మెప్పుకోలు బహుమతులు ఇచ్చినరోజున కాదు కాని—ఇప్పుడుమాత్రం మా ఇద్దరికీ నిజంగానే వొయినమూ — వొందనమూ, వొచ్చింది!






# దివినుండి భువికి దిగివచ్చిన దయామయి

రెడ్‌క్రాస్ దినోత్సవాలు ప్రపంచంలో నలుమూలలా జయప్రదంగా జరుపబడినాయి. క్షతగాత్రులకు, బాధితులకు, ఆపన్నులకు చేతనైనంత సహాయం చేసి, వారిని ఆదుకోవాలనే ఉత్తమ ఆశయాన్ని అందరూ మన్నించి ఆచరించాలని పెద్దలు అందరూ ప్రబోధించారు.

సేవానిరతిని గురించి చెప్పుకున్నప్పుడు, ఫ్లారెన్స్ నైటింగేల్ పేరు తప్పక స్మరిస్తాము.

పరమ పావనమైన మానవసేవకు సర్వస్వం త్యాగంచేసినవారిలో ఫ్లారెన్స్ నైటింగేలు ప్రప్రథమురాలని చెప్పవచ్చు 'నర్స్' అనే పదమునకు స్వచ్ఛందమైన తన సేవద్వారా చక్కని నిర్వచనము నిచ్చిన ఆదర్శవనిత. దీనమానవ సేవలో ముందడుగు వేసి దయామయమైన తమ చల్లని చూపును రోగపీడితుల దెస ప్రసరింపజేసిన వారిలో అగ్రగణ్యురాలు.

ఈ ప్రపంచంలో దయ, కనికరం, ఆపన్నులయెడల సానుభూతినిలచియున్నంత కాలమూ ఫ్లారెన్సు కన్య పేరు చిరస్థాయిగా ఉంటుంది.

విక్టోరియా మహారాణి ఇంగ్లాండు పరిపాలించే రోజులలో 1820 లో ఇంగ్లండులోని పల్లెగ్రామమైన హేంప్‌షైర్‌లో ఫ్లారెన్సు నైటింగేల్ పుట్టింది. ఆ తర్వాత ప్రపంచమంతా ఆమెను ఎలుగెత్తి పిలిచిన పిలుపు "దివ్వెను ధరించిన దేవి" యని.

ఫ్లారెన్సు జమీందారీ స్థాయికి చెందిన కుటుంబంలో జన్మించి, చీకూ చింతా లేని వాతావరణంలో పెరిగింది. పసితనంనుండి కూడా ఆ చిన్న హృదయంలో ఏవేవో ఉన్నతమైన ఆశయాలు పరవళ్లు తొక్కుతూండేవి. రోగుల కంటినీరు తుడవాలని— వారికి చేతనైనంత సేవ చేయాలనే ఆరాటం ఆమెను ఉక్కిరిబిక్కిరి చేస్తుండేది. తక్కిన ఆడపిల్లలాడే నృత్యగానాలు, విందు వినోదాలు ఆమె నాకర్షించినా—అలాంటి సంతోషకరమైన సమయాల్లో కూడ ఆమె మెత్తని మనసులో రోగులకు అనాథులకు తానెటువంటి సేవ చేయగలదనే ఆలోచన, చేయాలన్న కోరిక, ప్రబలమవుతూండేది.

## పూవు పుట్టగానే....

ఆటపాటల్లో చిన్నారిచెల్లెలు బొమ్మల్ని చించి పారేస్తూంటే కూడా ఆమె నొచ్చుకునేదట. ఎంతో ఓపిగ్గా విరిగిపోయిన ఆ ముక్కలన్నీ పోగుచేసి అతికి యథారూపంలోకి తెచ్చేందుకు ప్రయత్నంచేసి, ఆ ప్రయత్నంలో విజయం సాధించినపుడు బ్రహ్మానందభరితురాలవుతుండేది. ఆవిధముగా తన హృదయములోని కోరికను బాల్యంనుండీ కూడ చేతుల్లో చూపెడుతుండేది. ఆమె వయసుతోపాటు మంచి ఊహలు, గొప్ప భావాలూ పెరిగాయి. పెద్దదైన ఫ్లారెన్సు కన్య తాను నర్సుగా పని చేయవలెనన్న కోరికను తలిదండ్రులకు తెలియజేసింది. కుమార్తె కోరికను విన్న తల్లిదండ్రులు ఆశ్చర్యపడ్డారు. తీవ్రంగా నిరసించారు. మందలించారు. ఆ రోజులలో నర్సుగా పని చేయడమనేది నీచమయినదిగా, గౌరవహీనమయినదిగా ఎన్నబడుతూండేది.

సంపన్నులైన తమకడుపున పుట్టి అతిసుకుమారంగా పెరిగిన, కుమార్తె హాస్పిటల్ గోడలమధ్యకు పోయి నానావిధ రోగుల నడుమ ఆ మురికి వాతావరణంలో జీవించడం వారికెంత మాత్రం ఇష్టంలేక పోయింది ఎన్నో విధాల కుమార్తెకు నచ్చచెప్పారు. కాని ఫ్లారెన్సు హృదయంలో దృఢంగా నాటుకుపోయిన ఆ స్థిర నిశ్చయాన్ని వారు సడలించలేకపోయారు. నర్సింగులో తగినంత అనుభవం, విజ్ఞానం పొందడానికి ఆమె రకరకాల వైద్యశాలలు, నర్సింగు హోములు సందర్శించుతూ ఎన్నో క్రొత్త విషయాలు నేర్చుకొంది. 1854వ సంవత్సరంలో ఆమె చిరవాంఛితం నెరవేర్చుకొనగలిగే తరుణం వచ్చింది రష్యాతో పోరాడుతున్న టర్కీతో చేతులు కలిపి యుద్ధరంగంలోకి దిగింది బ్రిటన్ రక్తం గడ్డకట్టుకు పోయే శీతకాలం యుద్ధంలో దారుణంగా గాయపడి, దిక్కూ మొక్కూ లేక యమయాతన అనుభవిస్తూన్న క్షతగాత్రులు - రకరకాల వ్యాధులకు గురిఅయి మంచాలనంటుకు పోయివున్న రోగపీడితుల ఆక్రందనాలు మిన్నుముట్టుతున్నాయి. ఆనాటి మిలటరీ వైద్యశాలల్లో డాక్టరే తప్ప నర్సులు మచ్చుకైనా లేరు! ఇక ఆ నిర్భాగ్యులను కరుణించేదెవరు? శుచీ, శుభ్రతా లేకుండా, గబ్బుకంపు కొడుతూన్న, ఆ మురికి వాతావరణంలో చికిత్సచేస్తే బ్రతికే అవకాశం ఉన్నా ఆ పాటి దిక్కులేక, చనిపోయేవారి సంఖ్య కంతంలేదు. యుద్ధరంగంలోని, ఆ క్రందనాలు ఫ్లారెన్సు కన్య చెవుల్లో పడినాయి. ఆమె నవనీత హృదయం మంచులాగ కరిగిపోయింది. వెంటనే గవర్నమెంటువారి అనుమతిని పొంది మరో నలభైమంది నర్సులు తోడురాగా ధైర్యంతో ఆ విషాదవాతావరణంలో అడుగునుంచింది.

హాస్పటల్ పేరుతో ఆ మురికి గోడల మధ్య చీకటి తెరలలో చిందులాడుతున్న ఆ మురికి వాతావరణం ప్రత్యక్షంగా చూసిన ఫ్లారెన్సు కన్య హృదయం విరాళితో క్రుంగిపోయింది. అయినప్పటికి ఆమె ధైర్యం గోల్పోవలేదు తోటి నర్సుల సహకారంతో అహోరాత్రాలు కృషిచేసి, శ్రమించి ప్రత్యక్షనరకంగా వుంటూన్న ఆ వైద్యశాలలను భూతల స్వర్గంగా మార్చివేయగలిగింది. ఒక నిమిషమయినా బద్ధకించి కూర్చోకుండా, చకచకా ఆ రోగులమధ్య

బి. ప్రేమలీల

# తమ్ముడి 

#  స్నేహితుడు!

ఈ మధ్య (హైదరాబాదులో) మా స్నేహితురాలింటికి ఒక దొంగవచ్చేడు. ఆవిడభర్త కాలేజీలో లెక్చరరుగా పనిచేస్తున్నారు. ఆమెకు ఒక్కడే తమ్ముడు. అతను హైదరాబాదుకు వందమైళ్ళ దూరములో ఒక వూరులో ఎలెక్ట్రికల్ సూపర్ వైజరుగా పని చేస్తున్నాడు. ఒకరోజున మధ్యాహ్నం 12 గంటలవేళ వాళ్ల ఇంటికి ఒక పెద్దమనిషి వచ్చేడు. ఆయన మంచి సూటూ బూటూ వేసుకొని దర్జాగానున్నాడు. ఫలానా లెక్చరర్ గారి ఇల్లు ఇదేనా అని ఆయన పేరుకూడ చెప్పి అడిగేడు. ఆవిడ ఎవరో పెద్దమనిషిలా వుంది అనుకొని కుర్చీ చూపించి కూర్చోమని సంగతేమిటని అడుగగా, "మీ తమ్ముడు నాకు చాలా ప్రాణస్నేహితుడు. అతనికి రెండురోజుల క్రితం చాలా జబ్బుచేసింది. నిన్నరాత్రి చాలా ప్రమాదస్థితికి వచ్చింది. డాక్టరుకూడా ఒక రోజుకన్నా బ్రతకడని చెప్పేడు. మిమ్మల్ని చూడాలని వుందిట. ప్రాణం పోయేలోగా మిమ్మల్ని అర్జంటుగా తీసుకురమ్మని నన్ను పంపించేడు. కనుక మీరు జాగ్రత్తగా తీసుకువెడతాను రండి. ఇంకోగంటలో రైలు బయలుదేరుతుంది" అన్నాడుట. ఆవిడ గుండెలు బాదుకుని ఏడుస్తూ "మావారితో చెప్పకుండా ఎలాగ వెళ్లడం. ఇప్పుడు కాలేజీకి ఖబురుచేద్దామన్నా ఇక్కడ ఎవరూ లేరు కనుక మీరు వెళ్ళి చెప్పిరండి. ఆయనవెళ్లమంటే వస్తాను" అందిట. "ఇటువంటి సమయంలో చెప్పకుండా వెడితే ఆయన ఎందుకు కోప్పడు

వారణాసి సుబ్బలక్ష్మి

తారు. రైలుఖర్చులకు డబ్బు నాదగరుంది. ఇప్పుడు కాలేజీకి వెళ్లి చెప్పడానికి టైము లేదు. ఆలస్యముచేస్తే రైలు దాటిపోతుంది. అక్కడ నేను అర్జంటు పనులు వదులుకుని మిమ్మల్ని తీసుకు వెళ్లడానికి వచ్చేను కనుక నేను తొందరగా వెళ్ళాలి. మీరు ఏమీ ఆలోచించ నక్కరలేదు వెంటనే బయలుదేరండి" అని గట్టిగా నచ్చచెప్ప చూచాడు ఆయన. అయినా ఆవిడకు అది నచ్చలేదు. ౮ గంటలవరకూ ఉంటే భర్తనడిగి వస్తానని చెప్పిందిట.

"మీ తమ్ముడ్ని బ్రతికి వుండగా చూడదల్చుకుంటే నాతోరండి లేకపోతే లేదు. నాకు ౮ గంటలవరకూ వుండడానికి వీలు లేదు" అన్నాడు ఆ పెద్దమనిషి.

"పోనీ ఎల్లా జరుగనుంటే అల్లా జరుగుతుంది. మీరు వెళ్లండి" అందిట ఆమె. చివరికి అతనికి విసుగెత్తి లేచి 'కొంచెము మంచినీళ్ళు ఇవ్వం'డని అడిగేడుట. ఆవిడ తెచ్చియిచ్చింది. మంచినీళ్ళు త్రాగి ఇంకోసారి గట్టిగా అడిగి వెళ్ళిపోయాడుట. సాయంత్రము ౮ గంటలైన తరువాత భర్త రాగానే సంగతంతా చెప్పింది. అప్పటికప్పుడు భార్యాభర్త ఇద్దరు పిల్లలతో సహా బయలుదేరి అర్ధరాత్రికి ఆవూరు చేరుకున్నారుట. తీరా ఇంటికివెళ్లి తలుపు కొట్టేసరికి ఆవిడ తమ్ముడే తలుపు తీసేడుట! అతన్ని చూసి వీళ్లు కొంత సేపటివరకూ తెల్లబోయి చూస్తూ నిల్చుండి పోయారుట. అతరువాత సంగతంతా తెలుసుకుని వాడు ఒక దొంగ అని తెలుసుకున్నారు. మర్నాడు తిరిగి వాళ్లు హైదరాబాదు వచ్చేశారు. అప్పుడు చూసుకుంటే ఆరోజు వాడికి ఫలహారం పెట్టిఇచ్చిన వెండిప్లేటూ,బల్లమీద పార్కర్ పెన్నూ పోయినట్లు తేలింది! అంతేకాక,అనవసరంగా రైలు ఖర్చులకు డబ్బుకూడా వదిలింది. అక్కడకు వాళ్లు చాలా అదృష్టవంతులనే చెప్పాలి. ఆవిడ వంటిమీద ఎప్పుడూ కొంచెము నగలువుండేవి. బహుశా ఆదొంగ,

(38-వ పేజీ చూడండి)

# దివినుండి భువికి దిగివచ్చిన దయామయి

తిరుగుతూ తన చల్లని చూపుతో దయామయమైన తన సేవాశుశ్రూషలతో వారిని పునర్జీవితులను చేస్తుంటే దా కరుణామయి ఆమె ముఖంలో వెలిగిపోతున్న వింత తేజస్సును రోగులంతా విప్పారిన నేత్రాలతో చూస్తుండేవారు. తన ఆశయాల్ని, స్థిర సంకల్పాన్ని తారుమారు చేసే సంఘటనలు జీవితప్రయాణంలో ఎన్నో తారసిల్లినా, ఆత్మనిగ్రహంతో వాటినన్నిటిని జయించుకుంటూ, తన ఏకైక లక్ష్యంవైపు పరుగు సాగించింది. కాని ముప్పయ్యో యేట ఆమె జీవిత ఉద్దేశాలన్నీ పూర్తిగా మార్చివేసే సంఘటన ఒకటి ధనవంతుడు, విద్యావంతుడయిన ఒక సుందర యువకుని రూపంలో ఆమె ముందు సాక్షాత్కరించింది. అతడెంతో అనురాగంతో ఆమె ప్రేమను అర్థించాడు. ఫ్లారెన్సునైటింగేలు మనస్సు క్షణకాలం పాటు ఊగిసలాడింది. వివాహం చేసికొని సంసార జీవితంలో ప్రవేశించి తనహృదయ మందిరంలో విప్పారిన ప్రేమకుసుమాలను ఒకే వ్యక్తికోసం, ఒకే కుటుంబంకోసం పరిమితం చేయడమా! లేక వందలకొలదీ-వేల కొలదీ అనాథులకు-రోగపీడితులకు సేవచేసి, వారినీ వారి కుటుంబాలనూ సంతోషపెట్టడమా. ఆమె ఎటూ తేల్చుకోలేకపోయింది. ఆ యువకుడామెను మరల అర్థించాడు. ఫ్లారెన్సు కన్య హృదయం తామరాకుపై బడ్డ నీటిబిందువులా చలించిపోయింది. ఈ ప్రాపంచిక సుఖాలవైపు కామె మనస్సు క్షణంసేపు మొగ్గింది. కాని అంతలోనే తెప్పరిల్లింది. మనస్సు త్రిప్పుకుంది ఉదాత్తమైన ఆమె ఆశయం ముందు ఆ కోరిక వోడిపోయింది. ఆఖరుసారిగా ఈ ప్రాపంచిక-సంసారిక సుఖాలకు తుది నమస్కారం చేసి ఆ జన్మాంతం రోగినారాయణ సేవలోనే తన జీవితాన్ని వినియోగించడానికి స్థిరనిశ్చయం చేసుకుంది.

మరణశయ్యమీద మృత్యువుతో పోరాడుతున్నవారికి కామె అపర సంజీవిని, రోగులపాలిటి చల్లనితల్లి. రాత్రిసమయంలో ప్రకృతి ప్రశాంతముగా ఉన్న వేళ, ప్రపంచమంతా నిదురిస్తున్న సమయంలో కూడ, చేత దివ్వెను ధరించి ఆమె వార్డుల నడుమ రోగులను పరీక్షించుచుతూ పోతూంటే 'దివి నుండి భువి కరుదెంచిన దేవదూతలా' కనిపించేది. ఒక్క వైద్యశాలల్లోనే కాకుండా ప్రపంచంలో ఎక్కడ దుఃఖం, బాధ, వేదన, చీకటి, వున్నాయో అలాంటి అంధకార ప్రదేశాల్లో కూడ ఆమె వెలుగు కిరణాలు వెదజల్లింది ఇటువంటి త్యాగస్వరూపిణులు ఏ దేశానికి సంబంధించినవారైనా సర్వత్రా పూజనీయులు, సమస్త సుఖాల్నీ-సంపదల్నీ-పీడిత ప్రజలకొరకు త్యాగంచేసి-ఈనాటికీ కీర్తిమండలంలో దేదీప్యమానంగా ప్రకాశించుచున్న ఫ్లారెన్సునైటింగేలు కన్య ప్రపంచ మహిళామణులందరికీ చిరస్మరణీయురాలు. ఆమె పవిత్ర స్మృతి కివే జోహారులు!! 



# రేగిపళ్లతో...

★

—యన్. సుశీల—

రేగిపళ్ల కాలము వచ్చినది. బజారులో రేగి పళ్లు దొరుకుచున్నవి. అందువలన రేగి పళ్లతో పచ్చళ్లు చెప్పుచున్నాను.

## రేగిపళ్ల ఊరగాయ

కావలసిన వస్తువులు: రేగిపళ్లు పుల్లనివి 100, ఎండు మిరపకాయలు 1/8 సేరు, ఆవాలు అర్ధపావు, ఉప్పు అర్ధపావు, సెనగలు తగుమాత్రం, పసుపుపొడి, నువ్వులనూనె పావుసేరు.

చేసేవిధానము: ఈ రేగిపళ్లలో 2 రకములు దొరుకును. 1 కాకిరేగిపళ్లు 2 మంచి రేగిపళ్లు. వీనిలో మంచిరేగిపళ్లు పుల్లనివి పెద్దవి ఏరుకొని తెచ్చుకోవాలి. తియ్యనివి పనికిరావు. ఎక్కువ పండినవి పనికిరావు. పక్వానికి వచ్చినవి కావాలి. రేపు పెట్టాలంటే ఈ దినమూ ఆవాలు బాగుచేసుకొని మెత్తగా కొట్టుకొని జల్లించుకోవాలి. మిరపకాయలు తొడిమలు తీసుకొని అదికూడా కొట్టుకొని జల్లించుకోవాలి. ఉప్పు ఆ మాదిరిగనే చేసుకోవాలి. సెనగలు రాళ్లులేకుండా ఏరుకోవాలి. మరునాటిదినమున కాయలు తెచ్చుకొని తొడిమలు తీసివేసి తడిబట్టతో ఆ కాయలన్నీ తుడుచుకోవాలి. తరువాత ఈ కాయ లన్నిటినీ ఒకచాకుతో మామిడి కాయ మాదిరిగా తోలుతోనే చెంపలు ఈ వైపు ఆ వైపు కోసుకొని పిక్కలు తీసి వేయాలి. ఆ ముక్కలన్నీ ఒకచేటలో పోసుకొని అప్పుడు అర్ధపావు ఆవపొడి అర్ధపావు మిరపపొడి అర్ధపావు ఉప్పు సమానముగా కొలుచుకొని దానిలో పొయ్యాలి. ఈ సెనగలు పసుపు ఈ పావుసేరు నువ్వులనూనె అందులో పోసుకొని అంతటను బాగాకలిపి ఒకజాడిలో పెట్టుకోవాలి. ఇట్లా మూడు దినములు తరువాత నాల్గవదినమున ఒక గరిటెతో బాగా కలిపి అన్నములో వేసుకున్న చాలా బాగావుండును. చేతులు పెటరాదు. చెంచాతో తీసుకోవలెను. 8 నెలలు మాత్రమే వుంటుంది. నీళ్లుపోసిన చెడిపోవును.

## రేగిపళ్లతో పచ్చడి

కావలసిన వస్తువులు: బాగా పండిన రేగిపళ్లు పుల్లనివి, పచ్చిమిరపకాయలు, ఉప్పు, చింతపండు, కొత్తిమిరి, ఇంగువ, పసుపు, ఆవాలు.

చేసేవిధానము: ఈ రేగిపళ్లన్నీ తొడిమలు

(48- వ పేజీ చూడండి)





టేబుల్ క్లాత్ మీదకు

—డి. జయలక్ష్మి.



“నాట్య భంగిమ”

[కోట్లపైడి అప్పలస్వామి — విజయనగరం]

# తమ్ముడి ★ ★ ★ ★ స్నేహితుడు!

(36 వ పేజీ తరువాయి)

నగలకోసమే అన్ని వివరాలూ తెలుసుకొని వచ్చివుంటాడు. ఇంతకూ ఆవిడ అదృష్టము బాగుండబట్టి వాడితో వెళ్ళలేదు. లేకపోతే బ్రతికి బయటపడేది కాదేమో అనిపిస్తుంది. ఖరీదుగల మాటా బూటా వేసుకొని వాళ్ల పేర్లే కాకుండా ఊళ్లపేర్లూ ఉద్యోగాల పేర్లూకూడా చెప్తూవుంటే అబద్ధమని ఎవరనుకుంటారు చెప్పండి-, ఇదివరకు లేమను రోజులలో ఒకసారి మాచుట్టాలింటికి ఇలాగే ఒకడు వచ్చి అయ్యగారు పంచదార గోధుమలు తీసుకురమన్నారు డబ్బు ఇవ్వండి అని అడిగేడుట. నిజమేననుకొని. 10రూపాయిల నోటిచ్చి ఎందుకైనా మంచిదని 12 ఏళ్ల పిల్లవాడ్ని కూడా పంపించేరుట. కొంచెము దూరము వెళ్ళినతరువాత, నేను ఇప్పుడే వస్తాను నీవు ఇక్కడే వుండు అని ఆ అబ్బాయితో చెప్పి అంతక్రితమే ఏ చెట్టు వెనకాలో దాచుకున్న సైకిలుమీద వాడు పారిపోయాడుట. ఇటువంటి దొంగతనాలు ఈ మధ్య చాలా జరుగుతున్నాయి. మధ్యాహ్నంపూట స్త్రీలు సాధారణంగా ఒంటరిగా వుంటూవుంటారు. ఎవరైనా వచ్చినా వేషం చూసి మోసపోకూడదు. ఎవరి మాటలూ నమ్మకూడదు. పైవాళ్ల మాటలే కాదు. చుట్టాలైనా సరే. స్నేహితులైనా సరే పనివాళ్లయినా సరే చాలావరకూ ఈ రోజులలో ఎవరిమాటలూ నమ్మకూడదు. కొంతమందిని చెప్పేమాటలు వేరు చేసే పనులు వేరునూ. మాటలుమాత్రం కోటలు దాటుతూవుంటాయి. ఉపకార బుద్ధిమాత్రం ఎకోశానా వుండదు. ఒకవేళ ఎవరైనా ఏదైనా ఉపకారము మనకు చేస్తున్నా నిజంగా మనమీద ప్రేమకొద్దీ చేస్తున్నారా లేక మరేదైనా ఎత్తు ఆలోచించుకొని చేస్తూవుంటున్నారా అని అనుమానించవలసి వస్తోంది. ఎందుచేతనంటే ఈ రోజుల్లో చుట్టాలు స్నేహితులూ కూడా అంతమాత్రంగానే వుంటున్నారు. (అంటే మంచివాళ్లు లేరనికాదు) కాని, ‘మంచి’ అనేది వయసులలోనే కాకుండా ఇప్పటి మనుష్యులలో కూడా చాలా తక్కువగానే వుంటోంది. మంచిచెడ్డలను గురించి తొందరగా తెలుసుకోలేము కాబట్టి ఎవరైనా సరే తొందరపడి ఎవరిమాటలూనమ్మకూడదు. నిదానంగా ఆలోచించి చేయడం మంచిది ఏపనైనా.

★

# శుభలక్షణ, శుభమంగళ

భారవీ కల్యాణి

"మాసానాం మార్గశీర్షో" అన్న గీతా వాక్యంప్రకారం అన్ని మాసాల్లోనూ ఉత్తమ మయింది మార్గశిరమాసము. అందుకే ఈ మార్గశిరమాసంలో మహాలక్ష్మిపూజ చేసుకుంటారు. మగువలకి మంగళగౌరిపూజ ఎంత ముఖ్యమయినదో మహాలక్ష్మి పూజకూడా అంతే ముఖ్యమయినది. కనుకనే మార్గశిర మాసంలో ప్రతి లక్ష్మీవారము (గురువారము) ఈపూజ చేసుకుంటారు. దీనికి ఇన్నేళ్లు అన్న నియమం లేదు. పెళ్ళి అయినదిమొదలు ప్రతి సంవత్సరం సువాసినులు ఈపూజ చేసుకుంటారు. మార్గశిర లక్ష్మీవారంనాడు లక్క అడ కొయ్యఅడతో పాటు పసుపుఅడకూడా చేసి ఆ 'ఆడలు' మహాలక్ష్మిపీఠంలో పెట్టి పుష్పాక్షతలతో పూజచేసుకుంటారు. అయితే శ్రావణ మంగళవారాలు, వరలక్ష్మి వ్రతంలాగ ఈపూజ చేసుకున్నప్పుడు నగలూ, నాణాలు కొనులు గానీ, పట్టుబట్టలు గానీ, కొత్తవి కొని ఇవ్వాలన్న నియమంలేదు. 'విత్తంకొద్దీ వైభవం' అని కలవారు వుంటే పెట్టుకోవచ్చు, తప్పితే, విధిగాపాటించే ఆచారం అంటూ లేదు. మార్గశిర మహాలక్ష్మిని కొల్చుకుందికి అన్ని లక్ష్మీవారాలూ పూజా నైవేద్యాలయేక ఈకథ చెప్పుకుని అక్షతలు వేసుకుంటారు.

అనగా అనగా ఒక వూర్లో సోమయాజుల వారి సోదమ్మ అని ఒకావిడ వుంటూండేది. ఆవిడ అష్టయిశ్వర్యాలతో ఇష్టభోగాలు అనుభవిస్తూ-అద్దాల రవిక, పద్మాల పట్టుచీర కట్టుకుని ఏడువారాలనగలూ పెట్టుకుని బంగారు తూగుటుయ్యాలలో వూగుతూ చిద్విలాసంగా వుంది. ఆవిడకి శుభలక్షణ, శుభమంగళ అని ఇద్దరు ఆడపిల్లలు. కవలపిల్లలలాగ వుండి పెళ్ళీడుగా పెరిగిన ఆ ఇద్దరుపిల్లలు బొమ్మరిల్లు పెట్టుకుని ఆడుకుంటున్నారు.

ఆసమయంలో 'ఇంతటి సిరిసంపదలతో తులతూగుతున్న ఈ సోదమ్మకి నేను ఎంత మాత్రం గుర్తున్నానో పరీక్షించుదా'మని మార్గశిర మహాలక్ష్మి ఒక ముసలి అవ్వరూపంతో ఆవీధికి వచ్చి "అడలోయమ్మా! ఆడలూ" అంటూ ఆ ఇంటిముందుకి వచ్చి ఆగింది. తూగుటుయ్యాలలో ఊగుతున్న సోమయాజుల సోదమ్మ "ఏమాడలే అమ్మీ" అని అడిగింది. అందుకు ఆ అవ్వరూపంలోవున్న మహాలక్ష్మి "అమ్మా! లక్కఆడలు, కొయ్య ఆడలు ఏవి కావలస్తే అవేవున్నాయి. కొనుక్కుని పూజ చేసుకోండి" అని బదులు చెప్పింది. అప్పుడు సోదమ్మ నీపూజ బుగ్గిగాను. లక్కవీ కొయ్యవీ పెట్టిపూజచేసుకోడమేమిటి? భాగ్యవంతులంకనుక బంగారానివే పెటి పూజచేసుకోవాలిగాని. అదీకాక ఇప్పుడు పూజలూ అవీ చేసేందికి తీరికెవరికుంది? మాకే ఆడలూ వద్దు" అని కసిరిపొమ్మంది.

ఇవన్నీ వింటూన్న శుభలక్షణ శుభమంగళ పెరటిదోవగుండా వీధిలోకొచ్చి "ఏం అడలే అమ్మీ! వాటితో ఏంచేస్తారు?" అని అడిగేరు "అమ్మా! లక్కఆడలు, కొయ్య ఆడలూను. ఇవి కొనుక్కుని మహాలక్ష్మి పీఠంలో పెట్టుకుని పూజచేసుకుంటారు. ఇవాళ మార్గశిర లక్ష్మీవారం తొలివారం. ఈవారం పూజచేసుకుని పులగం,పరమాన్నం మహాలక్ష్మికి నైవేద్యం పెడ్తారు" అని ఆ అవ్వ సమాధానం చెప్పింది. అందుకా అక్కచెల్లెళ్ళిద్దరూ 'ఆడ' ఖరీదంతని అడిగేరు. "అమ్మా! కూడిచ్చికొంటారు, చేసిచ్చికొంటారు; కలిగినవాళ్ళు కలిగినట్టూ, లేనివాళ్లు లేనట్టూ—ఖరీదుమాట లెక్కమిటి—ఏళ్ళకీ లేనివాళ్లు పిడికెడు బియ్యం పెట్టి కొనుక్కుంటారు" అని అవ్వ బదులు చెప్పింది. వెంటనే శుభలక్షణ, శుభమంగళ చెరొక మూడ యిచ్చి చెరొక 'ఆడ' కొనుక్కుని బొమ్మరింట్లో పెట్టుకుని అవ్వ చెప్పిన ప్రకారం పూజచేసుకున్నారు.

మళ్ళా రెండో లక్ష్మీవారంనాడుకూడా మార్గశిర మహాలక్ష్మి ముసలిఅవ్వ రూపంలో ఆడలమ్ముతూ వచ్చింది. ఇది చూసిన సోదమ్మ "క్రిందటివారం వద్దంటే మళ్ళీ ఈవారం వచ్చేవా? తిన్నగా పోయావా సరేసరి, లేకపోతే బంట్రోతులచేత మెడమీద చెయ్యివేసి గెంటించుతాను" అని కోపగించుకొని పొమ్మంది. యథాప్రకారం శుభలక్షణ, శుభమంగళ పెరటిదోవగుండా వచ్చి 'ఏమే అమ్మీ! ఈవారంకూడా పూజచేసుకుంటారా? అలాఅయితే యీ వారం ఏం చేసుకుంటారు?" అని అడిగేరు. "అమ్మా ఇవాళ మార్గశిర లక్ష్మీవారం రెండోవారం ఈవారం పూజచేసుకుని 'కలగూడు, చిత్రాలు' నైవేద్యంపెడ్తారు" అని చెప్పింది 'కలగూడు, చిత్రాలు' అంటే ఏమిటి అనిఅడిగేరు ఆ అక్కచెల్లెళ్ళు. 'కలగూడు'అంటే పులిహోర, 'చిత్రాలు' అంటే అట్లు. చిన్నచిన్నవిగాపోసే అట్లని చిత్రాలంటారు అని అవ్వ బదులుచెప్పింది. సరేనని మళ్ళీఇద్దరూ చెరొక 'ఆడ' కొనుక్కుని ఇదివరకులాగే పూజ చేసుకున్నారు.

ఇదేప్రకారంగా మూడు నాల్గు వారాలు కూడా ఆడలమ్మే అవ్వరూపంతో మార్గశిర మహాలక్ష్మి రావడం సోమయాజుల సోదమ్మ కసరి తగిలెయ్యడం జరిగింది. ఎప్పటిలాగనే శుభలక్షణ శుభమంగళలు పెరటిదోవనివచ్చి అడగా 'అమ్మా! ఈ వారం మూడో వారం, పూజచేసి 'అప్పాలు' నైవేద్యం పెడ్తారు. ఈవారం నాలుగోవారం గారెలు నైవేద్యం పెడ్తారు వచ్చేవారం 'పుష్యమాసపు వారం' అంటే పుష్యమాసంలో మొదటి లక్ష్మీవారం. ఆరోజు బూరెలు నైవేద్యం పెడ్తారు' అని అవ్వచెప్పింది, ఆపిల్లలిద్దరూ ఆ మోస్తరుగా పూజచేసుకోవడం కూడా జరిగింది.

ఇలా మారశిరమాసంలో పూజచేసుకున్న ఆపిల్ల లిదరూ మాఘమాసంలో పెళ్ళిళ్ళు కావడంతో అత్తవారింటికి వెళ్ళిపోయేరు. ఒకయింట్లో ఒకే అన్నదమ్ముల పెళ్ళాడి అత్తింటికి వెళ్ళే ఆ అక్కచెల్లెళ్ళిద్దరూ తమతోకూడా వాళ్ళ బొమ్మరింటి సామాను, వాళ్లు పూజచేసుకున్న 'ఆడలు' తీసుకుని వెళ్ళిపోయేరు అంతతో మహాలక్ష్మి కూడా వాళ్ళతో వెళ్ళిపోయింది. అందువల్ల మిట్టమధ్యాహ్నం వేళ దండాన్నున్న కోకలు తగులబడిపోయి, అర్ధరాత్రి వేళ దొంగలు చొరబడి దోచుకోగా మిగిలినది అప్పుల వాళ్ళొచ్చి తప్పుడు లెక్కలు చూపించి పట్టుకపోగా సోమయాజుల సోదమ్మ, ఆమె పెనిమిటి నిలవనీడలేక ఒక చిన్న పూరి గుడిసె కట్టుకుని ఉంటున్నారు.

ఇలా వుంటూవుండగా ఒకనాడు సోదమ్మ తమ పరిస్థితి నంతా తలపోసుకుని చింతిస్తూ కూతుళ్ళదగ్గరికి వెళ్ళితే వాళ్ళేమైనా సహాయం చేస్తారేమోనని చెప్పి పెనిమిటిని వాళ్ళదగ్గరికి వెళ్ళమని పంపించింది. సరేనని అతగాడు బయలుదేరాడు. ఇంటికి వచ్చిన తండ్రిని చూసి శుభలక్షణ, శుభమంగళ "నాన్నా! వచ్చావా?" అంటూ కెవ్వున కేక వేసి, గప్పున కౌగలించుకుని ఆదరణతో ఇంట్లోకి తీసికెళ్ళి అన్ని సంగతులూ అడిగేరు తండ్రిచెప్పిన సంగతంతా విని ఆ అక్కచెల్లెళ్ళిద్దరూ ఎంతో దుఃఖించారు. కొన్నిరోజులకి "అమ్మీ! ఇంటిదగ్గర మీఅమ్మ ఒంటిగావుంది. అంచేత ఇక నేను వెళ్ళిపోతానని తండ్రి కూతుళ్ళతో చెప్పేడు

అప్పుడు శుభలక్షణ, శుభమంగళ తండ్రికి

(42-వ పేజీ చూడండి)




శ్రీమతి పాలువాయి భానుమతి వ్రాసిన "అత్తగారూ-ఆచారాలు" అను వ్యాసం బాగుంది. మన పూర్వులు ఆచారం అని పెట్టిన ప్రతిదానికీ ఒక అర్థం వుంది. ఎక్కడనవాటికి వెళ్ళితే అనారోగ్యం రావచ్చుగాని మన కనుగుణంగా వుండేవి. సాగేవి పాటించినచో చాలును. అంతేగాని ఎత్తిఎత్తి ఆఖరుకి ఎంగిలాకులమీద కాలువేసినట్లు మరీ చాదస్తం, మొండిపట్టుదల తగవు.

ఆవకాయదగ్గర "మడి" అని పెట్టింది కొన్ని నియమాలు పాటించడానికి. అది సంవత్సరం పొడుగునా వుండాల్సిన ఆహారదినుసు. తడి, చెమ్మ, గాలి తగులకుండా వేరే ఒక చిన్న గదిలో వుంచుతారు. కొంతమంది పిల్లలకు రోజూ ఆవకాయ కావాలి. రోజూతింటే ఆరోగ్యం పాడవుతుందని వాళ్ళకు తెలియదు. అలాంటప్పుడు పిల్లలతో "ఆవకాయ మడిలో వుంది. ఇప్పుడు రాదు. ఈరోజుకు వచ్చెడి సంజాకు తినెయ్యాలి" అనేస్తే గుప్‌చుప్‌గా తినేవారు. ఈ కాలం పిలల సంగతి అలాకాదు. అంతా క్రాస్ పరీక్ష చేస్తారు. సరే ఆ ఇంట్లో ఆచారం లేదనుకుందాం "అబ్బబ్బ! నన్ను విసిగించక పెట్టింది తినిపొండి" అని ఇల్లాలు విసుకుంటే "పోనీలే! నేను వెళ్ళితీసుకుంటా" అని పిల్లవాడు అంటాడు. సరే ఏదో అయిపోయిందిగదా అని ఆ యిల్లాలు వూరుకుంటే కొన్నాళ్ళకా ఆవకాయ బూజు!

అందుచేత మన పెద్దవారు సాధ్యమైనంతవరకు మూఢాచారాలు వదులుకొని తాము యిబ్బంది పడకుండా, ఇతరులకు బాధ కలిగించకుండా వుంటారని ఆశిద్దాం.

రత్నం అవసరాలవంతులు
నైహాటీ (పశ్చిమబెంగాలు)

* * *

## మామగారుకూడా

ఇక్కడకు 10 మైళ్ళ దూరంలోనున్న గ్రామానికి భూమి సర్వేపనిమీద వెళ్లాం. ఆ గ్రామపట్వారీ (ఆంధ్రలో కరణంగారంటారు)కూడా మావెంట వున్నారు, సర్వేనంబర్లు చూపుటకు-సర్వే చేస్తూ, చేస్తూ గ్రామందాటి 2½ మైళ్ళు వెళ్లవలసివచ్చినది. అడివిప్రాంతం మిట్టమధ్యాహ్నం - మండుటెండ దగ్గరలో ఒకలంబాడ తాండ మాత్రంవుంది. పట్వారీగారు ఆచార పరాయణులూ, పరమభాగవతులున్నూ. ఉదయం బయల్దేరు నపుడు యింటివద్ద యేమిటిఫిన్ తీసుకొనే అలవాటు లేదట (సంధ్య పూజా పునస్కారాలన్నీ అయిన తర్వాతనే భోజనం!) పాపం! వారికి దారిలో విపరీతంగా దాహం వేసినది. మా వద్దనున్న వాటర్ బాటిల్ లో నీరు అప్పటికే ప్రక్కలంబాడీ తాండనుండి తెప్పించినవి వున్నాయి. దాహంతీరడానికి అవి త్రాగమని అయ్యాబాబూ అని బ్రతిమాలినా ఆయన ససేమిరా ముట్టలేదు. కళ్లు తిరుగుచున్నవని వూరివైపుకు బయల్దేరి 1 ఫర్లాంగు వెళ్ళారో లేదో కండ్లు తిరుగుట యొక్కటై దారిలో పడిపోయారు! ప్రక్కన చేలోనున్న లంబాడీ అతడు అది చూచి వెంటనే రెండుచేతులతో యెత్తుకొని చెట్టుక్రిందకు చేర్చుతూ మమ్మల్ని గావు కేకలు పెట్టగా పొయ్యనూ, నేను, పరివారం అంతా అక్కడికి పరిగెత్తుకు వెళ్ళడం, పట్వారీ గారి ముఖంమీద వాటర్ బాటిల్ నీళ్లు చిలకరించడం, ఆయన యెట్టకేలకు తెప్పరిల్లడం జరిగినది.

చూశారా, యీ మహానుభావుడు అత్యాచారానికి పాలుబడి యెంతటి అఘాయిత్యానికి లోనయ్యాడో! అత్తగార్లే కాదు, అత్యాచారాలు జరిపే మామగార్లూ యెంతోమంది కలరనడానికిది నిదర్శనం కావచ్చును. ఇది జరిగి సరిగ్గా మూడువారాలు అయినది.

"అత్తగారూ, ఆచారాలూ" వ్యాసం చదవగానే ఇది వ్రాయబుద్ధి వేసింది.

శ్రీమతి పి. భానుమతి గార్కి "ఆంధ్రపత్రిక" ద్వారా మా అభినందనము లందచేయగలరు.

వీరవనేని రాంబాబు
(మిర్యాలగూడెం, నల్గొండజిల్లా)

* * *

"అత్తగారూ-ఆచారాలు" అనే వ్యాసం చాల చక్కగా ఉంది. ఆచారం అనే ముసుగు తగిలించుకొని వనకాల అనాచార భాగవతం ఆడేవారూ, పేరు ప్రతిష్ఠల కోసం వస్తులుండి వళ్లుపాడుచేసుకొనేవారూ యీ విధంగా రకరకాల తరహాలన్నీ కళ్ళకు కట్టినట్లు చిత్రించారీ వ్యాసంలో. ఆంధ్ర వారపత్రికలో ఈవిధమైన వ్యాసాలు భానుమతిగారు వ్రాస్తూ ఉండవలయునని కోరుతున్నాను.

శివరావు మన్నె, (వుయ్యూరు)

* * *

'అత్తగారు ఆచారాలు' అన్న వ్యాసం నన్నెంతో ఆకర్షించినది. శ్రీమతి భానుమతి గారు చాలబాగుగా రచించారు. ఆవిడ గారు చెప్పినట్లు ఆచారాలన్నీ సమయానుకూలంగా మారేవి.

ఫాతిమా సుల్తానా, కాకినాడ.

## విమర్శలు

ఈ వారం (13-11-57) వాణిలో ప్రచురించిన ఎల్. వెంకట్రమణగారి విమర్శ కక్కసంగా వుంది. అతని విమర్శ క్రిందే, వై. అనార్కలిగారు అదే వ్యాసంపై విమర్శించారు. ఈ రెండు విమర్శలకు చాల తేడావుంది. శ్రీమతి కామేశ్వరిగారి వ్యాసంలో కొన్ని విషయాలు నచ్చకపోవచ్చుగాని విమర్శించడంలో ఈ మధ్య సోదరి పవని నిర్మల ప్రభావతిగారు వ్రాసినట్లు ఛళిన చెంపపెట్టులా వుంటే బావుండదు. ప్రతిది కొందరికి నచ్చుతుంది, కొందరికి నచ్చనే నచ్చదు. అందరికీ నచ్చాలంటే సాధ్యంకాదుగా!

విమర్శించడంలో ఫలానా వ్యాసంలో ఫలాని విషయం యిలాగ వుంటే బాగుంటుందని ఎదుటివారిని నొప్పించక సాధ్యమైనంత మున్నితంగానే చెప్పాలి.

బి. ఆర్. కృష్ణన్ (వాయల్పాడు)

* * *

## ఇంకో రకం

డి. పూర్ణరాధగారు వ్రాసిన మిరపకాయ బజ్జీలు చెయ్యటం చదివాను. నాకు ఇంకొక పద్ధతి తెలుసును. వాము, తగినంత ఉప్పు రోటో వేసి మెత్తగా నూరాలి నీళ్లు చల్లకూడదు ఆ నూరిన మిశ్రమాన్ని పచ్చిమిరపకాయగీరి అందులో పట్టినంత కూరాలి.

వస్తాయి లావుగా, పొడుగా వున్న వాటికే బాగుంటుంది. పెద్దా, చిన్నా ఉంటుంది కనుక కొలత సరిగా చెప్పలేదు. ఎవరికి వారు కాయల్ని బట్టి వాము, వుప్పు మారుతుంటే బాగుంటుంది. కాయలన్నిటిలోను అలా కూరి పెట్టుకున్నాక శనగ పిండిలో తగినంత వుప్పు, కారం, చిటికెడు సోడా వేసి బజ్జీల పిండిలా కలపాలి. మిగతా అంతా ఆమె వ్రాసినట్లే చెయ్యాలి. యిది టిఫిన్ చేసేటందు కాయలో కూరవచ్చు. మెంతుగా చెయ్యక్కరలేదు.

వి. లక్ష్మీకాంత, (తెనాలి).

* * *

## మన కెందుకు?

6-11-57 న, లేడీ వారపత్రికలో ప్రచురింపబడిన 'ఇంటి శుభ్రత' వ్యాసం చక్కగా వ్రాసేరు. ఇంట్లో ఉన్న వారందరూ, 'మన కెందుకు శ్రమ' అని అనుకుంటూ తప్పించుకుంటే ఎలాగ? అందరూ ఐకమత్యముతో ఉంటేనే ఏపనైనా పూర్తిగా సాధించగలము.

సుందరనీడి సుగుణమణి,
(కాట్రేనిపాడు)

* * *

## ఎక్కువమంది కోసం

గ్రంథాలయాలపై చర్చలో, 'ఉత్తమ గ్రంథాలు చదవ బుద్ధికాదు. ఈ భాగ్యానికి స్త్రీలకు ప్రత్యేక గ్రంథాలయాలు కావాలంటారు' అని వ్రాశారు. అంటే పురుషులలో అందరూ ఉత్తమ గ్రంథాలు చదువుతారనేనా... కాదు. కొందరు ఉత్తమ రచనలు చదువుతారు. కొందరు నవలలు చదువుతారు. ఈపాటి భాగ్యానికి పురుషులకు గ్రంథాలయాలు లేవా? అలాగే స్త్రీలకు కూడాను.

'సెక్రెటరీయన్సైన లేనిపోని అభాండాలు వెయ్యడంవల్ల ప్రయోజనంలేదు' అని వ్రాశారు. లేనిపోని అభాండాలు వెయ్యడానికి సెక్రెటరియన్స్ మనకేమైనా శత్రువులా? సంగతిలా వుందని వున్నదున్నట్లు వ్రాశాను. అంతే!

స్త్రీలకు ప్రత్యేక కళాశాలలు వుండవచ్చు. అలాగే ప్రత్యేక గ్రంథాలయాలు అక్కరలేదా?

'పఠనాలయాలకు వెళ్ళి స్వేచ్ఛగా, నిర్భయంగా చదువుకోవచ్చు' అని వ్రాశారు. అందరూ వారిలాంటివారయితే ఇక ప్రత్యేక గ్రంథాలయాలు కావాలని కోరవలసిన ... కోరడానికి? స్వేచ్ఛగా చదవడానికి వీలులేదు గనుకనే ప్రత్యేక గ్రంథాలయాలు కావాలని కోరడం.

'సినిమాలకు మొగవారు లేకపోయినా భయం విడియంలేక వెళ్తాం' అని వ్రాశారు. కాని, ఇప్పటికీ కూడ సినిమాలకు వత్తేనైన మగవారికి ఆడవారికి కలసి కుర్చీలు ఉంటాయని క్రింది తరగతులకు పోయేవారు కూడ వున్నారు. మా వూళ్ళో మా యింటి ప్రక్కనే ఒకావిడవుంది. బాగా డబ్బు వుంది. కాని సినిమాలకు వెళ్ళితే చిన్న తరగతిలోనే కూచుంటుంది. పాల్కనీకి ఎందుకు వెళ్ళరని అడిగితే, 'అంతమంది మగవారిలో కూచోడానికి సిగ్గవుతుంది' అని అంటుంది. క్రిందయితే స్త్రీలకు ప్రత్యేక స్థలం వుంటుంది. భయం లేదని ఆమె అంటుంది.

చాలామంది స్త్రీలు పురుషులతో కలసి చదువుకుని అరమరిక లేకుండా తిరగడానికి సిగ్గుపడ్తారు. అందుకే స్త్రీలకు ప్రత్యేక గ్రంథాలయాలుంటే ఎక్కువమంది స్త్రీలకు అనుకూలంగా వుంటుంది.

మంగళాకందూర్,
(విశాఖపట్టణం)

* * *

## 'మిగత ముక్కాలే'గురించి

భర్తను అవసర పరిస్థితులలో తను అవసరాల నిమిత్తమైతే నేమి, గృహావసరాల నిమిత్తమైతే నేమి డబ్బు అడుగుటను దేబిరించుటగానూ, యాచించుటగానూ భావించడం తప్పు. భర్తనుఅడిగి తీసుకొనుటలోనే ఆత్మాభిమానమునకు తలవంపులుగా భావిస్తే, అభిమానంగల భర్తలు తమ భార్యలతో గృహవిషయాలను సంప్రదించడం కూడా తలవంపులుగా భావిస్తారు. కాబట్టి సామాన్యసంసారాలలోనైనా, ఆర్థికంగా గొప్పవైన సంసారాలలోనైనా భార్యాభర్తల మధ్య, ఆత్మాభిమానమనేది అభినందనీయమైనది కాదు. సంసారాలలో పరిస్థితులను బట్టి భర్త కనుగుణంగా నడచుకొనేటువంటి భార్యలు అభినందింప తగ్గవారు. సామాన్యసంసారాలలో సాధారణంగా భార్యలు వారి భర్తల, పరిస్థితులను అర్థం చేసుకొని, అభిరుచులకు అనుగుణంగా ప్రవర్తించుకుంటారు. ఇలా ప్రవర్తించుకొనే భార్యలకు అవిధంగా నడచుకుంటే కలిగే ఆనందానికి సాటి వేరొకటిలేదు.

భార్యాభర్త లిరువురిమధ్య ఏ విధమైన భిన్నాభిప్రాయాలకు ఆత్మాభిమానాలకు తావు ఉండరాదు. పరిస్థితులను అర్థం చేసుకొని భార్యాభర్తలు ఒండొరులు పరస్పర సహకారంతో సంసారాన్ని సాగిస్తే ఆ సంసారం నిజంగా స్వర్గమే కదా!

గోనెళ్ల మల్లికార్జునరావు,
అనంతపురం.

* * *

కామేశ్వరిగారు, "మిగతా ముక్కాలే, ఏం చేశావ్?" అను వ్యాసము ద్వారా నిజముగా కొన్ని కుటుంబములలో గృహిణులు ఆర్థికముగా యెదుర్కొను చిక్కులను వివరించినందుకు అనేక అభినందనములు. నిజముగా కొంతమంది భర్తలు చేతుల్లో డబ్బుండో లేదో తెలియనివ్వరు. ఒక్కొక్కప్పుడు ఇంటికి ఎవరైనా అతిథులు వచ్చినప్పుడు గృహిణి, వంటచేయడం ఎలాగా అని, ఎంతైనా ఆలోచించవలసివస్తుంది. అటువంటప్పుడు అప్పైనాచేసి అతిథిమర్యాద చేయవలసివస్తుంది. అప్పుచేసిందని ఆడదానినే తిట్టడటం అన్యాయం. ఇలాంటి మగవారితో సర్దుకోవటం చాలా కష్టం. గృహబాధ్యతలు ఇద్దరూ సమంగా నిర్వర్తించినప్పుడు ఏ ఇబ్బంది కలుగదని నా నమ్మకం.

వల్లూరు హైమవతి
(మల్లెపల్లి—హైద్రాబాద్)

* * *

## ఒక సూచన

ఆంధ్రపత్రిక 9-10-57 సంచికలో శ్రీమతి ఎస్. అనంతలక్ష్మిగారు వ్రాసిన "స్ప్రేవర్క్" వ్యాసం చూచాను. ఇంకో సూచన చేయదలచుకున్నాను. అసలు స్ప్రేవర్క్ లోకంతా కష్టతరమైనదని బట్ట అంతటా సమానంగా ఒకేవిధమైన చుక్కలు పడేటట్లు చేయటం. అలా చేయటానికి ఏదైనా బ్రష్ తీసుకొని చల్లినట్లయితే యిక పెద్ద పెద్ద చుక్కలు పడి అసహ్యమైపోతుంది. కాబట్టి చేయదలచినవారు పాత బ్రష్ (కుంచెలు సరిగా వుంటేవి) తీసికొని యిండియన్ యింక్‌లో కొద్దిగా ముంచి భద్రంగా గుడ్డపైకి తెచ్చి దువ్వెనతోగాని, స్కేలులాంటిదాంతోగాని బ్రష్‌ను దువ్వితే చుక్కలు చుక్కలుగా పడ్తాయి. మొదటిసారి దువ్వగా పడ్డవి పెద్దచుక్కలుగా వుంటాయి. అందుకని వేరే కాగితంమీద మొదటిసారి దువ్వి, చుక్కలు పెద్దవిపడ్డాక తర్వాత అసలు డిజైన్ కావలసిన గుడ్డమీద స్ప్రే చెయ్యాలి.

బజారులో అమ్మే యిండియన్ యింక్ సీసాలో వేస్తే చాకలికి వెడితే చుక్కలు చెదరిపోయి పాతగుడ్డలాగయి చూడటానికి బాగుండదు. బజార్లో యిండియన్ యింక్ పలుకులను తీసుకొని ద్రవరూపంగా కలుపుకోవాలి. ఒక గుడ్డమీద చుక్కలు వచ్చేలాగున చేస్తే యెప్పుడైతే "చెదర"కుండా చుక్క, కాటుక నలుపురంగులో గుడ్డలో యింకుతుందో అప్పుడు మనం సరైన యింకును తయారుచేసినట్లే. ప్రప్రథమంగా చేసేవాళ్ళకిది కొంచెం కష్టంగా వుంటుంది. కాబట్టి మొదలు ఒక చిన్న టేబిల్ క్లాత్ కో లేక దిండు గలీబుకో వేసుకున్నాక కర్టెన్స్ మొదలైనవి చేయవచ్చు.

కె. దేవి, (ఆదవాని).★



# శుభలక్షణ, శుభమంగళ



(39-వ పేజీ తరువాయి)

కడుపునిండా అన్నం పెట్టి, కొత్తబట్టలు కట్టబెట్టి, ఒక అనబతుంబ దొలిచి అందులో కాసులు, రత్నాలు అన్నీ పోసి తండ్రిచేతికిచ్చి "నాన్నా! ఇదెక్కడా క్రింద పెట్టకుండా జాగ్రత్తగా ఇంటికి తీసికెళ్లు" అని చెప్పిఇచ్చారు. సరేనని ఆబ్రాహ్మడు దాన్ని పట్టుకొని వస్తూండగా సంధ్యపడేసరికి సంధ్యావందనం చేసుకోడానికి ఏటి ఒడ్డున ఆ అనబతుంబ పెట్టి ఏట్లోకి దిగాడు. అతనలా ఏట్లోకి దిగేదిగడంతో ఒక గ్రద్ద వచ్చి ఈ అనబతుంబని తన్నుకునిపోయింది. ఆ బ్రాహ్మడు పాపం విచారిస్తూ చేసేదేమీలేక చింతిస్తూ ఇంటికొచ్చి భార్యతో జరిగిన సంగతిచెప్పేడు. ఆ గ్రద్ద అలా తన్నుకుపోయిన అనబతుంబని తిన్నగా తీసుకెళ్ళి ఆ అక్కచెల్లెళ్ళింట్లో పెరట్లో పడేసింది. గ్రద్ద పడేసిన అనబతుంబని చూసి శుభలక్షణ శుభమంగళలు "అయ్యో మననాన్న ఎంత దురదృష్టవంతు" డనుకుంటూ ఆ సొమ్మని కళ్ళకద్దుకుని పాలా నేతా కడుక్కుని ఇంట్లోకి తీసికెళ్ళి భద్రపరచుకున్నారు.

కొన్నాళ్ళకి మళ్ళా సోమయాజుల సోదెమ్మ కోరుకున్నట్టుగా ఆమె పెనిమిటి కూతుళ్ళదగ్గరికి మళ్ళా వచ్చాడు. వెనకటిలాగనే కూతుళ్ళిద్దరూ కొంతకాలం తండ్రిని అట్టేపెట్టుకుని ఒక వెదురుబొంగులో కాసులు, రత్నాలూ పోసి తండ్రికిచ్చి ఎక్కడా పెట్టకుండా పట్టుకెళ్లమన్నారు. ఇదివరకులాగనే ముసలాయన సంధ్యవార్చుకోబోగా గ్రద్ద తన్నుకొనివచ్చి ఆ వెదురుబొంగు ఈ పిల్లలింట్లో పడేసింది. వాళ్లు పాపం, తండ్రి దురదృష్టానికి చింతిస్తూ ఆ సొమ్మును ఇంట్లోకితీసికెళ్ళి దాచుకున్నారు. ఈ ముసలాయన ఇంటికొచ్చి మళ్ళీజరిగిన సంగతంతా భార్యతో చెప్పేసరికి ఆవిడ కోపగించుకుని "ఇంత అజాగ్రత్తయితేఎలాగు ఈసారి నేనే వెళ్తా" నని బయల్దేరివెళ్లింది.

సోదెమ్మరాకకి శుభలక్షణ శుభమంగళ ఎంతో సంబరపడ్డారు. అప్పుడు మార్గశిర మాసము. తొలి లక్ష్మివారంనాడు పూజకి అన్నీ సిద్ధంచేసుకుని "అమ్మా! ఇవాళ మార్గశిర లక్ష్మివారం. పూజ చేసుకుందాం రా" అని కూతుళ్ళు తల్లిని పిలిచేరు. "ప్రొద్దుట పిల్లలకి తలలు దువ్వుతూ ఆ నూనెచెయ్యి తలకి రాసేసుకున్నాను. ఇప్పుడు మళ్ళీ జిడ్డుతలమీద స్నానం చెయ్యాలేనేఅమ్మా" అని తల్లి సమాధానం చెప్పింది. కూతుళ్లిద్దరూ పూజ చేసుకున్నారు. మళ్లా రెండోవారం తల్లిని పూజకి పిలిచేరు. "పిల్లలకి చద్దన్నం పెడుతూ వాళ్లు తినకుండా వుంచేసిన చద్దన్నం వెన్నెలలా కనిపిస్తే పారెయ్యడానికిమనసొప్పక తినేశాను" అని తల్లి చెప్పింది. మూడోవారం ఇలాకాదనుకుని ఆ అక్కచెల్లెళ్లిద్దరూ తల్లిని పాతరగోతిలో కూర్చోబెట్టి పన్లు చక్కబెట్టుకుందికి వెళ్లేరు. ఈలోగా మనమల్ని పిల్చి వాళ్ళు తింటున్న వెలగపండు ఇమ్మని సోదెమ్మ అడిగింది. వాళ్లు గుజ్జంతా తినేసి వుత్తచిప్పలు విసిరేస్తే ఆవిడ ఆ చిప్పల్నే పళ్ళతోగోరుతూ కూర్చుంది. పనిపాట్లు చక్కబెట్టుకుంటూ ఇది చూసిన కూతుళ్లు తల్లి తెలివితక్కువతనానికి చింతించి వాళ్ళే పూజచేసుకున్నారు. నాలుగోవారంనాడు ఇక లాభం లేదని ఆలోచించి ఆ కూతుళ్లిద్దరూ తల్లిని చెంగూచెంగూ ముడేసుకుని వెంట తిప్పుకుంటూ చెరోకపనీ చక్కబెట్టుకుని అన్నీ సిద్ధంచేసుకుని పూజకి కూర్చున్నారు.

అలా ముగ్గురూ పూజకి కూర్చుని పూజ చేయబోయే సమయానికి మహాలక్ష్మీపీఠం కదిలి వెనవెనక్కి జరిగిపోతోంది. అప్పుడు శుభలక్షణ శుభమంగళ లిద్దరూ మహాలక్ష్మికి సాష్టాంగపడి "తల్లీ! మేంచేసిన అపరాధమేమిటి? అని వేడుకున్నారు. అందుకు మహాలక్ష్మి అశరీరవాణిగా "మీరు చేసిన అపరాధమేమీ లేదుగాని, నన్ను మీ అమ్మ ఉల్లంఘించింది. కనుక మీరు మీ అమ్మని అవమానించినటయితే నేనుమిమ్మల్ని పొంది పూజార్హత నిస్తా"నని బదులు చెప్పింది. "సరే ఏం చేయా"లని అడిగేరు అక్కచెల్లెళ్లు.

అప్పుడు మహాలక్ష్మి ఇలా చెప్పింది: "మీ అమ్మకి తలనిండా నూనెరాసి తల దువ్వి, కళ్లనిండా కాటుక పెట్టి, మురికదైన ముళ్ళచీర కట్టబెట్టి, ఎక్కువగా వుప్పువేసి కడుపునిండా పులగం పెట్టి, చిల్లిగంపలో ఉప్పూ వడ్లూ గుచ్చెత్తిపోసి, దానిమీద పట్టెడు వెన్నముద్ద, ఇంత పసుపు పెట్టి ఆ గంప నెత్తికెత్తి, కొత్త చీపురుకట్టతో 'పోతావా, పోవా' అని తన్ని తగలేయడం మీ అమ్మని అవమానించడం."

ఈ ప్రకారంగా మహాలక్ష్మి చెప్పేసరికి సరేనని కూతుళ్లిద్దరూ భక్తిశ్రద్ధలు కలవారు కనుక అలాగే చేశారు. మధ్యాహ్నం ఎండకి నెత్తిమీదనున్న వెన్న కరిగి, దాంట్లో వుప్పు కరిగి, పసుపు కలిసి, వడ్లుతోకూడా మొఖం మీదికి కారుతురాగా కంట్లోపడి సోదెమ్మకి కళ్ళు మంటలు పుట్టసాగాయి. భుక్తాయాసంవల్ల తొందరగా అడుగుపడక ఉప్పు ఎక్కువ వేసుకుని తినడంవల్ల దాహంతో పీకార్చుకునిపోగా కళ్లమంటలు ఎక్కువయేసరికి సోదెమ్మకి దారీ తెన్నూ కానరాక అక్కడున్న చీకునూతిలో పడిపోయింది. అలా పడడంతోనే నెత్తిమీద వున్న వడ్లు ఒలికిపోయి, ఆ వడ్లూ, కొత్త చీరకి అంటుకున్న పూలికలు గుచ్చుకొంటూ ఒకయాల బాధగావుంటే ఇంకొకయాల ఆ చీకునూతిలో వున్న ముళ్లూ డొంకలూ గుచ్చుకోసాగాయి. సరికదా ఆ నూతిలో వున్న కండచీమలు, తేళ్లూ, జెర్రిలు అందొచ్చిన చోటునల్లా కరవడం మొదలు పెట్టేయి. దానికితోడు కళ్ళ మంటలతో చెప్పశక్యంకానంతగా నానాహింసా పడుతోంది. ఆసమయంలో ఆనూతిలోనుండి పైకి రావడంకోసమని ఆ సోమయాజుల సోదెమ్మ హీరా, వారా, అని ఎంత అరిచినా ఎవరూ వచ్చి సహాయం చేయలేదు. చివరికి ఆవిడికి అణుచుకోలేని దుఃఖం పొర్లుకురాగా ఇక భగవంతుడే దిక్కు అనే భావంతో "నా పాలిట మార్గశిర మహాలక్ష్మీ! ఎక్కడున్నా వనేసరికి "ఇదిగో, ఇక్కడే వున్నా" నంటూ మార్గశిర మహాలక్ష్మి ఘల్లుమనే కంకణాల చేత్తో పద్మాల పట్టుచీర చెంగు నూతిలోకి జారవిడిచింది. అప్పుడు చీర చెంగుతో కళ్లొత్తుకోగా కళ్లమంటలుపోయి, చీరచెంగుమీదుగా నూతిలోనుండి పైకి వచ్చింది. మహాలక్ష్మిస్పర్శతో సోమయాజుల సోదెమ్మకి బాధలన్నీ పోవడమే కాకుండా చీనీచీనాంబరాలతో, ఏడువారాల నగలతో వళ్ళంతా సిరులొలుకుతూవుంది. అప్పుడు సోదెమ్మ తనఅపరాధాన్ని గుర్తించి చెంపలు వేసుకుని నాటినుంచీ శ్రద్ధాభక్తులతో మహాలక్ష్మిని కొల్చుకుంటూ వుండేది.

'సోమయాజుల సోదెమ్మ చేసిన పూజ అందరూ చేసేరు. అందరూ చేసిన పూజ మనమూ చేసేము' అంటూ ఈ కథ చెప్పుకుని అక్షతలు వేసుకుంటారు.

అందుకే ఈ మార్గశిర లక్ష్మివారంనాడు ప్రొద్దుటే పిల్లలకి చద్దన్నం పెట్టరు, తలకి నూనెరాసి తలలు దువ్వరు, పాతబట్టలు కట్టరు సరికదా శుభలక్షణ, శుభమంగళ లిద్దరూ. బొమ్మలింటి సామానుతోబాటు పూజచేసుకున్న 'అడ'లు తీసికెళ్ళడం వల్లనే సోమయాజుల సోదెమ్మ భాగ్యం పోయిందన్న భావంతో, ఆ రోజున,పుట్టింటి ఆడపిల్లల్ని దేవుడిపీఠం తాకనివ్వరు; దేవుడిగదిలోకికూడా రానివ్వరు. మార్గశిర లక్ష్మివారంనాడు మన ఇళ్లలో సువాసినులు ముఖ్యంగా పాటించే ఆచారం ఇది. ఈ పూజ ముఖ్యంగా విశాఖనుండి బరంపురం వరకూ చేస్తూవుంటారు. అంతేకాకుండా విశాఖపట్నంలో ఈ మార్గశిర లక్ష్మివారం నాడు 'కనక మహాలక్ష్మి' అమ్మవారికి ఉత్సవాలు కూడా చేస్తూ ఆ నెలరోజులూ అమ్మవారి సముఖంలో హరికథలుకూడా చెప్పించుతూ వుంటారు. ఏదేమైనా దేశాచారం కులాధర్మం.






# ★ వింతకథ ★

విన్నారా! వింతకథను -
కన్నారా! కాలగతిని!
అడవి యొకటిగలదు పూర్వ -
మందు చాల పెద్దదియై,
అందమైనగ పూలు బూచి -
యలరుచుండె నొకబూరుగు॥వి॥

ఆ బూరుగుపూలలోని -
యందచందములను జూచి,
అంతులేని సంతసమున -
గంతులైచె నొక్క చిలుక॥ వి॥

ఇంత పెద్ద మంచిపువ్వు -
ఎంత పెద్ద పండ్లగునో,
అరెరె! నా భాగ్యమంచు -
మురిసిపోయె నా చిలుక॥ వి॥

అనుదినమును పూలకడకు -
జరిగి చూచుచుండెనది,
తనభాగ్యము పండుటకై -
తరుణమైనదనుకొనెనది॥ వి॥

కాలవశంబున పూవులు -
కనులముందె ఫలములుగా,
మారుచుండ నా చిలుకయు -
మతిమతిఉత్సాహముందె॥వి॥

తీరాపండిన పిమ్మట -
తేటి పొరజూడ నచట,
దూదిదప్ప నేమిగలదు -
బూదియాయె చిలుకకోర్కె॥వి॥

తుదికదియును గాలిలోన -
దూసిపోయె నయ్యయ్యో,
చిలుక వెతకు నగచెదమా!-
కాలగతి! వెలుచెదమా! వి॥

ఎన్నిదినమ్ముల తపములు -
ఎన్నిదినమ్ముల జపములు,
ఎన్ని దినమ్ముల కోర్కెలు -
ఏమగునో కాలగతిని॥ వి॥

[భల్లటుని "విశాలం శాల్మల్యా" అను శ్లోకం ఆధారంగా]

(సముద్రాల లక్ష్మణయ్య)

# విచిత్ర నిజాయితీ

ప్రొఫెసర్ అయ్యర్‌గారు దసరా సెలవల్లో కాశీయాత్ర తలపెట్టేరు. తలపెట్టడ మేమిటి వెంటనే తగిన సరంజామా అంతా కూర్చుకొని తన అరడజను ఆడపిల్లలను, రెండు పుంజీల మగపిల్లలను, భార్యామణిని తీసుకొని స్టేషనుకు వెళ్ళేరు. సామాను ప్లాటుఫారం మీద పడేసి పెద్ద పిల్లవాడితో జాగ్రత్తగా చూడమని చెప్పి పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ బుక్కింగు ఆఫీసు దగ్గరకు వెళ్ళి కావలసిన నిండు టిక్కట్లు అరటిక్కట్లు అన్నీ కొని తిరిగి తన పెద్ద పెట్టెమీద ఆసీను డయ్యేరు.

స్టేషను అంతా గోలగా వుంది. ఆ గోలలోనుండి స్పష్టమైన ధ్వని "ఈవేళ జనతా గంటన్నర లేటు" అనే మాటలు తరచు వినబడుతున్నాయి. అయ్యరుగారి పెద్ద పిల్లవాడు బుక్ స్టాలుకు వెళ్లి ఏదో చదువుతున్నాడు. భార్యామణి చిన్నపిల్లాడికి పాలిస్తోంది. మిగతా కుర్రకుంకలందరూ అల్లరిలో నిమగ్నులయ్యేరు. కాలేజీలో తత్త్వశాస్త్రం చెప్పే ప్రొఫెసరు అయ్యరుగారి దృష్టిలో ఈ జనంతో కిటకిటలాడే ప్లాటుఫారం ఏ విధంగా కనబడిందో కాని చిన్న చిరునవ్వు ఆయన ముఖంలో తాండవించింది. అంత గొడవ జరుగుతూన్నా ఆయన ఆలోచనా ప్రవాహానికి అంతు కనబడటంలేదు. తన పూర్వ జీవితపు విశేషాలన్నీ హాయిగా జ్ఞాపక పథంలో మెరుస్తూ తన గొప్పతనాన్ని స్తుతిస్తున్నాయి. ఆహా! తానెంత గొప్పవాడు... సత్యహరిశ్చంద్రుడు సత్యంలో ఎంత గొప్పవాడో తాను న్యాయపాలనలో అంతటి గొప్పవాడు. ఈ ఏభై మూడేళ్ళ జీవితంలోనూ తాను ఎన్నడూ అన్యాయం ఏ జీవికీ చేయలేదు. తాను అన్యాయం అంటే ఏమిటో ఎఱుగడు. తనను న్యాయస్థానాలకి ఆహ్వానించలేదు కాని ఆహ్వానిస్తే శుద్ధన్యాయాన్ని అక్కడ శాశ్వతంగా ప్రతిష్ఠించి ఉండేవాడు...! తనలాంటి న్యాయ చరిత్రులు ఉండడంవలననే ఈ నాడు ఈ పాపాల ప్రపంచంలో భారతదేశం నిలవగలుగుతోంది. లేకపోతే ఏనాడో నశించిపోయి వుండేది. ఇది పరమసత్యం. వెఱ్ఱి ప్రజలు ఇది గ్రహించ లేరు. తనలాంటి నిత్య న్యాయపాలనాదీక్షితుడుండబట్టే పాకిస్థానువాళ్లు అమెరికావాళ్లిచ్చిన ఆటంబాంబును మనమీద పడవేయటంలేదు...కాని ప్రజలు కృష్ణమీనన్నీ నెహ్రూనీ స్తుతిస్తారు. తనని... కాదు...ఔను...న్యాయానికివి రోజులు కావు కదా!...

"ఏమైనాసరే! ప్రజలు నా న్యాయమహిమను గుర్తించినాసరే లేకపోయినాసరే! నేను న్యాయమే చేస్తాను. నాగతచరిత్రలోనే నెన్నడూ ఎవరికీ అన్యాయం చేయలేదు...ఇకమీద కూడా ఎప్పుడూ ఎవరికీ అన్యాయం చేయను. ఇదే... నా...దృఢ ప్రతిజ్ఞ!" అనుకున్నాడు న్యాయపరిపాలనా దీక్షితుడు ప్రొఫెసర్ అయ్యర్. తన న్యాయపాలనాని కెన్ని ఉదాహరణలున్నాయి! ప్రొద్దున పోస్టాఫీసువాడు ఒక నయాపైస ఎక్కువ ఇస్తే పొరబాటున, వాడు మళ్లీ అడగ్గానే ఇవ్వలేదూ...? మరొకడైతే ఆ నయాపైస పట్టుకుపోయి మళ్లీ కనబడతాడూ?

'ఇంకఎన్నడూ న్యాయంతప్పను' అనుకున్నాడు ప్రొఫెసర్ అయ్యర్.

ఇంతలోకే బొబ్బలు పెట్టుకుంటూ రైలు స్టేషనులోనికివచ్చింది. అయ్యరుగారి కుటుంబమంతా ఒక పెట్టెలోనికి ఎక్కేరు. రైలు చాలా ఖాళీగా వుంది. ఆ పెట్టెలో ఇంకెవరూ లేరు. రైలు అయిదు నిముషాలాగి మళ్ళీ గర్జించి కదలిపోయింది.

* * * *

జనతా ఎక్స్‌ప్రెస్ అతివేగంగా అరణ్యగర్భంలోంచి దూసుకపోతోంది. అర్ధరాత్రి. కటిక చీకటిలో శబ్దం చేసుకుంటూ కూత కూస్తూ నల్లగా రాకసిలాగ ఎగిరిపోతోంది. అసలే గంటన్నర లేటవడంవలన జనతా ఆ లేటును భర్తీ చేయడం కోసం అదనపు వేగంతో పోతోంది. రైల్లో అంతా నిద్రలో మునిగిపోయారు.

గౌతమశ్రీ

అంతలోనే అంత అమిత వేగం తోనూ పోతూన్న జనతా ఎక్స్‌ప్రెస్ ఒకచోట దభీమని ఆగింది. అంత అకస్మాత్‌గా ఆగడంవలన నిద్రపోతూన్న జను లంతా లేచి కూర్చున్నారు. ఏదైనా స్టేషనేమో నని కొందరు కిటికీలలోంచి తొంగి చూసేరు. అబ్బే, ఇక్కడ స్టేష నేమిటి మహారణ్య మధ్యం! ఎవ డైనా రైలు క్రింద పడ్డాడేమోనని అనుకున్నారు. ఇంతలో ఎవరో చైను లాగేరని అందువలన రైలు ఆగిందనీ వర్తమానం వచ్చింది. ఆ కీచురాళ్ల ధ్వనిలో, నిద్రకళ్లు నులు ముకుంటూ ఇద్దరు ముగ్గుర్ని వెంట పెట్టుకొని రైల్వేలైటు, జండా పట్టు కొని గార్డు అన్ని పెట్టెలూ చూసు కొంటూ వెళ్లి ఒక పెట్టెదగ్గిరగాడు.

ఏమిటో చూద్దామని అతి కుతూ హలంతో అందరూ ఆపెట్టెముందు పోగయ్యేరు.

ఆ పెట్టెలో ఉన్నది మరెవరో కాదు. మన ప్రొఫెసర్ అయ్యర్ గారు–ఆయన కుటుంబం...!అయ్యర్ గారు ప్రజలనిచూసి కంగారుపడ్డాడు.

గార్డు దగ్గరకువెళ్లి "అయ్యాతమ కేం జరిగిందో చెప్పండి...భయపడ కండి ఎవడైనా పెట్లో దూరేడా? వాడ్ని ముక్కముక్కలు చేసేస్తాం... చెప్పండి సార్ మీకు జరిగినది" అన్నాడు అభయహస్తమిస్తూ.

ప్రొఫెసర్ గారు ఉగ్గపెట్టుకొని...

"ఈ అన్యాయాన్ని సహించ లేను గార్డుగారూ..." అన్నారు.

ఏమిటా అన్యాయం మేం తీరుస్తాం...భయపడక చెప్పండి. ఎవ డైనా పిక్‌పాకెట్టు చేసేడా?' గార్డు అన్నాడు.

ప్రొఫెసర్ గారు చిన్న దగ్గు దగ్గేడు.

ఆయన భార్య కంగారు పడు తోంది...

పిల్లలు అయోమయంగా చూస్తు న్నారు కళ్లు నులుపుకొంటూ పెద్ద అబ్బాయి కేంచేయాలో తెలియడం లేదు.

"ఊ చెప్పండి" అన్నాడు గార్డు ప్రజల కుతూహలం రెట్టింపైంది...

అప్పుడు ప్రొఫెసర్ గారు కంఠం సవరించుకొని అన్నాడు...వణికే కంఠంతో...

"అయ్యా! చూడండి...ఆ... అబ్బాయి. మానాలుగోఅబ్బాయి... చూడండి" పై బెర్తు మీద గాఢ నిద్రలో ఉన్నకుర్రాణ్ణిచూపిస్తూ...

గార్డు, ప్రజలు అంతా అతగాడి కేసి చూసేరు ఆత్రుతతో. గార్డు ఆ అబ్బాయిని తడుతూ...ఈఅబ్బాయి కేమైంది?" అని అడిగేడు.

మళ్లీ ప్రొఫెసర్ అయ్యర్‌గారు కంగారుపడుతూ...

"అబ్బే ఆఅబ్బాయికీ ఈవేళతో

# లోకజ్ఞానం

[illegible]

ఈకథ ఎప్పటిదో తెలియదు; ఎక్కడ జరిగిందో కూడా తెలియదు. కాని ఈనాడుకూడ అరవదేశంలో ఈకథను చెప్పుకొని చాల మంది ఆనందిస్తూ వుంటారు.

అనగనగా ఒక ఊరు. ఆ ఊళ్లో ఒక వీధిబడి, ఆ బడిలో ఒకే ఒక పంతులుగారు ఉండేవారు. ఆయనే అందరికీ అన్ని పాఠాలు విసుగూ విరామం లేకుండా చెప్పేవాడు, పొద్దు పొడిచింది మొదలు, పొద్దు వాలేవరకు ఎవరికో ఒకరికి ఏదో ఒకటి చెపుతూవుండేవాడు. రాత్రి సమయాలలో ఆ ఊరి మునసబు, కరణం మరికొందరు పెద్దల్ని సమావేశపరచి వారికి భాగవతకథలు విని పించేవాడు. ఆయన నోరు మూత పడేది కాదు! పైగా ఆయన చాలా మంచివాడు కూడా. అందువల్ల ఆ ఊళ్లోనే కాక ఆచుట్టుపక్కల ఊళ్లల్లో కూడా ఆయనంటే అందరికీ ఎంతో గౌరవం. ఆయన చక్కగా చదువు కొన్నవాడే, చాలా మంచివాడే, కాని ఆయనకు లోకజ్ఞానం అణు మాత్రమైనా లేదు. ఇదొక్కటే ఆయనలో ఉన్న పెద్దలోపం. కాని ఈలోపంకూడా ఆయన విషయంలో ఒక సుగుణంగానే రూపొందింది. వట్టి వెర్రిబాగులవాడనీ, కల్లాకపటం తెలియనివాడనీ ఆయన అందరి ప్రశంసలు అందుకున్నాడు. ఇంతకూ ఆయన పేరేమో చెప్పడం మరచి పోయాను. ఆయన పేరు కుప్పసామి. కాని అందరూ కుప్పయ్య అని పిలిచే వాళ్లు.

ఒకానొకనాడు ఏదో పనిమీద కుప్పయ్య ఒక గ్రామానికి వెళ్లాడు. ఆగ్రామంలోని వారందరూ తెలుగు మాట్లాడేవాళ్ళే. పొట్ట పొడిచినా కుప్పయ్య కేమో ఒక్క తెలుగు మాటకూడా రాదు. ఆ గ్రామస్థులకా అరవం తెలియదు. తానేమో పనిమీద ఆ గ్రామానికి వచ్చాడు. తన పని ఎలా నెరవేరుతుందా అని ఆలోచనలో మునిగిపోయాడు కుప్పయ్య. అతని కేమీ పాలుపో లేదు. అలా ఆలోచిస్తూ పోయి పోయి ఒకసత్రం చేరుకున్నాడు. సత్రంలో ఎన్నో మతాలవారూ, ఎన్నో భాషలవారూ ఉంటారని అతని నమ్మకం.

కుప్పయ్య సత్రం అరుగుమీద కూర్చున్నాడు. వచ్చేపొయ్యేజనంతో సత్రంబిలబిలలాడుతూవున్నది. ఆ జనాన్ని చూస్తూ కూర్చున్నాడు కుప్పయ్య. ఆయన ఎవరినీ పలుకరించలేదు; ఎవ్వరూ ఆయన్ని పలుకరించలేదు. అలా కొంతసేపు గడిచి పోయింది. ఆ తర్వాత ఒక యువకుడు కుప్పయ్యకు దగ్గరగా సత్రం అరుగుమీద కూర్చున్నాడు. అతను "అయ్యా! మందేఊరు?" అని ఎంతో ఆదరంగా కుప్పయ్యను అడిగాడు. అందుకు ఆయన అరవంలోనే ఏదో సమాధానం ఇచ్చాడు. అది ఆ యువకునికి అర్థం కాలేదు.

ఇంతలో సత్రంవాకిట ఒకగుజ్జం

---

పదకొండు ఏళ్లునిండి పన్నెండుఏళ్లు వస్తాయి. నేను...

"ఊ...మీరు?"

"నేను ఇందాక టిక్కెట్టు కొనే ముందీ విషయం మరచిపోయాను."

"ఐతే"?

"మామూలుగా అర టిక్కెట్టే కొన్నాను మరచిపోయి. పన్నెండేళ్ళ కుర్రవాడికి అరటిక్కెట్టు కొనడం అన్యాయం కాదా?" "నాజన్మలో ఎన్నడూ అన్యాయం చేయలేదు. ఇకముందు చెయ్యను...! 'అందువలన ఇదిగో ఈఅరటిక్కెట్టు తీసుకొని నిండు టిక్కెట్టు ఇవ్వండి... ఎంత డబ్బు ఎక్కువైతే అంతా ఇచ్చేస్తాను. నా కీ సంగతి ఇప్పుడు నిద్రరాక గత చరిత్ర స్మరిస్తూంటే జ్ఞప్తికి వచ్చింది...న్యాయశీలుణ్ణికనక వైను లాగేను వెంటనే."

"..........."

"ఊ చూస్తారేం! ఈ టిక్కెట్టు తీసుకొని నిండు టిక్కెట్టు ఇవ్వండి"

"..........."



ఎక్కడినుంచో వచ్చి ఆగింది. దాన్ని వేలితో చూపిస్తూ కుప్పయ్య ఆ యువకుడిని "గుఱ్ఱాన్ని తెలుగులో ఏమంటారు?" అనే అర్థం వచ్చేటట్లుగా అరవంలోనే అడిగాడు. "గుఱ్ఱం" అన్నాడు యువకుడు. అంతే; కుప్పయ్యకు అంతులేని సంతోషం కలిగింది. 'ఓస్! తెలుగంటే ఇదేనా?' అనే భావం అతని కళ్లల్లో కనబడింది. "కుదిరైక్కు-గుఱ్ఱం - కుదిరైక్కు- గుఱ్ఱం..." అని వల్లెవేయసాగాడు. కుదిరై అంటే అరవంలో గుఱ్ఱం అని అర్థం. తెలుగులో జంతువుల మాటల చివర 'ఱ్ఱం' ఉంటుందనుకొని తనలోనే ఈ విధంగా అనుకొనడం మొదలు పెట్టాడు. "కుదిరైక్కు- గుఱ్ఱం, యానైక్కు- యఱ్ఱం, పూనైక్కు- పుఱ్ఱం..." అని. తెలుగు భాష తన సొమ్మయినట్లుగా తలచి కుప్పయ్య ఎంతో సంతోషించాడు. కుప్పయ్య సంతోషానికి కారణమేమిటో తెలియక ఆ యువకుడు కన్నార్పకుండా ఆయనవైపే చూస్తూ కూర్చున్నాడు.

'కుదిరైక్కు గుఱ్ఱం' అని కుప్పయ్య మననం చేస్తూ వుండగా ఆ దోవనే నోట్లో ఎలుకపిల్లను కరుచుకొని ఒక పిల్లి లోపల్నుంచి బయటికి వెళ్లింది. దాన్ని చూడగానే ఎక్కడలేని సంతోషంతో "అదో - పుఱ్ఱం - పుఱ్ఱం..." అని కేకలు వేశాడు. తెలుగులో మాట్లాడాలని కొండంత ఆశ కుప్పయ్యకు! ఆ కేకలూ, ఆవాలకం చూచి కుప్పయ్య పిచ్చివాడని అనుకున్నాడు ఆ యువకుడు. అంతలో అక్కడ ఉన్న నలుగురూ ఆయన చుట్టుచేరి "ఏమిటి! ఏమిటి!" అన్నారు. కుప్పయ్య "పుఱ్ఱం - పుఱ్ఱం" అని సమాధానం ఇచ్చాడు.

ఆ చేరినవాళ్లలో అరవం తెలిసిన ఒక వృద్ధుడు ఉన్నాడు. ఆయన కుప్పయ్యను అరవంలో "ఏమిటీ రభస?", అని ప్రశ్నించాడు. కుప్పయ్య ఏదో చెప్పబోతుండగా ఒకపిల్లి మళ్ళీ ఆ దోవనే వచ్చింది. దాన్ని చూచి "అదో పుఱ్ఱం" అన్నాడు. ఆ వృద్ధుడు తనలో తాను నవ్వుకొని "అది పుఱ్ఱం కాదయ్యా-పిల్లి" అన్నాడు.

అక్కడ చేరినజనం గొల్లుమని నవ్వింది. కుప్పయ్యకు కోపం వచ్చింది. "కుదిరైక్కు- గుఱ్ఱం - పూనైక్కు- పుఱ్ఱం" అన్నాడు

ఆ వృద్ధుడు నవ్వు ఆపుకోలేకపోయాడు. "కుదిరైక్కు- గుఱ్ఱమే కాని పూనైక్కు- పుఱ్ఱం కాదు పిల్లి-" అని చెప్పాడు.

కుప్పయ్య పిచ్చివాడని అనుకున్నారు కొందరు.

"ఏదో ఒకమాటను పట్టుకొని అన్ని మాటలూ అలాగే ఉంటాయనుకోవడం వెఱ్ఱి కాకపోతే మరేమిటి?" అని ఒకవృద్ధుడు అన్నాడు.

"ఇంతకూ......లోకజ్ఞానం ఉండాలి." అన్నాడు మరొకడు.

నలుగురూ నాలుగువిధాలుగా అనడం చూచి కుప్పయ్య సిగ్గుపడ్డాడు. కాని ఏం చేయగలడు? కథ కంచికి. మన మింటికి. ★

## ★ విక్రమార్కుడి మార్కు సింహాసనం ★

(12-వ పేజీ తరువాయి)

అన్నాడు రాజు.

"సంగతీ, చాలా విషాదకరమైనది పెద్ద ట్రాజిడీ థీము. దీనికి తర్టీసిక్స్ వయొలిన్లతో నాదనామక్రియలో ప్యూర్ కర్ణాటిక్ మ్యూజిక్ బాక్ గ్రౌండు కావాలి"

"మేష్టారూ మీరు తొరగా తెమల్చక పోతే లాభంలేదు. ఇక్కడ చోటు అయిపోతోంది. నలిగిపోతున్నాను నేను" అన్నాడు రాజు విసుగ్గా

"చోటైపోతే పక్క పేజీలో కథరాసిన మేష్టార్ని కాస్త అడుగుదాం. సంగతేమిటంటే ఇది పెద్ద ట్రాజిడీ. ఈ జుట్టంతా సంగీత కళారాధకు లది."

"నిజంగా? ఎవరన్నా డెకేశారా. లేపోతే, మొక్కుబడుందా" అన్నాడు రాజు.

"ఆరెండూ కాదు. వాళ్ళ జుట్టువాళ్ళే పీక్కున్నారు."

"ఏం? ఎంచేత?...ఇంకోటి మేష్టారూ మీబుద్ధి పోనిచ్చుకున్నారు కాదు. మీరు ఇలా ముక్కలు ముక్కలుగా చెప్పి, ముక్క ముక్కకీ పోజుపెట్టి, తెలుగు సినిమాలా సాగిపోవడం బాగులేదు. మీగ్గాదు చెప్పేది?"

"సర్లే విను - ఇక్కడ కోట్ల కొద్దీపాటలు రికార్డు అయ్యాయిగదా. బాక్సాఫీసు సూత్రాలు అని ఉంటాయిమ్మాకు. అవి ఓగిం చేవారు జనానికి వాటికోసం అని' వాటి మూలంగా, ఇంగ్లీషు, స్పానిషు ఇటాలియన్, ఇండియన్, ఇంకావేవో బోల్డు దేశాలున్నాయి. ఆ రకరకాల సంగీతాన్ని తెచ్చి మనదాంతో కలిపి కాచి గిరగిర తిప్పి పాగదిసేవాళ్ళు. ఇలా చేస్తేనే పాటలు హిట్ లు అవుతాయిగదా మరి. అయినా, కొందరు సంగీతంవచ్చినవాళ్ళు ముందర ఒద్దు మొర్రో అని తేలిగ్గా మొత్తుకున్నారు. అనక, భరించలేక జుటుపీక్కుని కుప్పలు పోశారు. ఆ పాటలుకట్టినవాళ్లు కూడా అంతే అనుకో. ఇష్టంలేకపోయినా, ఆ పని చేసేసి, ఆనక, జుట్టు పీక్కుని కుప్పలుపోసి పోయేవాళ్ళు. కొందరు శంకర సంగీతానికి అంకిత మిచ్చారు కొందరు అప్రుతులికి అంకితం ఇచ్చారు తరవాత మానేశారనుకో. అలవాటైపోయి. ఇదే అది.—దీనిలో కొంత ప్రేక్షకుల విరాళం...బంగీలో పంపిస్తారు. తెలిసినవాళ్ళు తెచ్చిపడేశారు. అంతేగాని ఇవి మేకపురూము తోలూకు విగులూ, గడ్డాలూ కావు. తెలిసిందా" అన్నాడు కొలంబస్.

తెలిసిందండి అన్నాడు రాజు

"ఔనుగాని బ్రదరూ ఒక్క సందేహం. ఇందాక నువ్వేదో అడగబోయావు. నీకీ కథ చెప్పాను. ఏమిటదీ నీకూ ఈ సందేహమే వచ్చిందా. నీకూ ఈ విగ్గులు కనబడ్డాయా? అన్నాడు కొలంబస్.

"ఔనండి"...అన్నాడు రాజు సిగ్గుపడుతూ.

"యూజ్-లెస్-అయితే నువ్వు పనికిరావు. ఇలాటివి నీకు కనబడకూడదు. కనబడితే నువ్వు బాక్సాఫీస్ కి ఆమడదూరాన ఉన్నావన్నమాట. ఇందులో చేరలేవు చేరినా, ఫ్రెంచి గవర్నమెంటు ఉన్నంతసేపు కూడా నిలబడలేవు" అన్నాడు కొలంబస్. ★

(వచ్చే వారం మరోకథ.)

# ★ స్కూలులో స్వపరిపాలన ★

(19 వ పేజీ తరువాయి)

ఒంటరిగా కూర్చుంటే మనిషికి ఎన్నో ఆలోచనలు వస్తాయి. అట్లాగే నా బుర్రగూడా ఆలోచనలతో నిండిపోయింది. సూర్యం మీద నేరం జ్ఞప్తికి వచ్చింది సూర్యం ఈ పనిచేసాడా అని ఆలోచిస్తూనడుస్తున్నాను. ఇంతలోనే కొన్ని కాగితం ముక్కలు మీద నుండి ఎగురుతూ నా మీద పడ్డాయి. కుతూహలంతో మీదికి చూశాను ఆ కాగితాలు చింతామణి గదిలోనుండి వచ్చాయి. ఆ కాగితం ముక్కలన్నీ ఏరాను వాట్ల మీద ఏవో అక్షరాలు కనిపించాయి. అతికష్టం మీద ఆ కాగితాలన్నీ జాగ్రత్తగాపేర్చాను. అందులో రాత చాల అస్పష్టంగాయుంది. మొదట సుబ్బారాయుడు ద-అని ఆపేసి కొట్టేసి ఉంది అంటే ఈ కాగితం మీద వ్రాసిన ఆసామీ ఎవరిదో దస్తూరి అనుకరిద్దామని ప్రయత్నించి సగం వ్రాసి అసంతుష్టి చెంది, మళ్ళీ కొట్టేసినట్లుగా స్పష్టమవుతున్నది. అట్లానే "ద"అనేపదము చాలా సార్లు అనుకరించబడింది సూర్యం వ్రాసే "ద"లవంటి "ద"లు ఎన్నో ఆ కాగితంలో వున్నాయి!

"ఇంక చాలు. అవు నేనే ఈ పని చేశాను" అన్నాడు గట్టిగా అరుస్తూ చింతామణి అతని ముఖం కోపంతో ఎఱ్ఱబడింది. పెదిమలు, కాళ్ళూ, చేతులూ వణక నారంభించాయి. సిగ్గుతో, అవమానంతో తలదించెసుకొన్నాడు చింతామణి.

"ఓరి చవటా! ఎంత పని చేశావు? నువ్వేనా ఈ పని చేస్తి?" అన్నాడు ఆశ్చర్యం, క్రోధం, అసహ్యం మిళిత మయిన సర్వంతో కామేశం.

"ఆపండి మీ విమర్శలు. ముందతను పారిపోకుండా చూడండి శిక్ష విధిద్దాం" అన్నాడు న్యాయాధిపతి సుబ్బారావు.

"మన స్కూలు కాంపౌండు చుట్టూ రెంగుసార్లు పరిగెత్తిరావడమే చింతామణికి మనం విధించే శిక్ష" అంది జ్యూరీ ఏకగ్రీవంగా.

కుర్రాళ్ళంతా తమ చేతి రుమాళ్ళు కలిపి తాడుగాచేసి చింతామణినికట్టేశారు. కుర్రాళ్ళంతా కాంపౌండులో నిలుచున్నారు చింతామణికట్లు వదులుచేశారు. చింతామణిని నిల్చుండబెట్టి ఒక త్రాడుతో గట్టిగా కొట్టాడు సుబ్బారావు. చింతామణి పరుగు తీశాడు వరుసగా రెండుసార్లు పరుగెట్టాడు కాంపౌండు చుట్టూ. అతనిని అంతా కలసి హెడ్మాష్టరుగారి వద్దకు తీసుకపోయారు. అతను చేసిన నేరం తాము విధించిన శిక్ష మొదలైన యావద్విషయములు ఆయనకు విన్నవించారు.

హెడ్మాష్టరుగార్ని చూడగానే చింతామణి బావురుమనిఏడుస్తూ ఆయన కాళ్లు చుట్టేశాడు "క్షమించండి మాష్టారూ, నన్నేంచేయకండి. నాకు బుద్ధొచ్చిందండి' అంటూ కంటికి మింటికి ఏకధారగా ఏడ్చాడు.

హెడ్మాష్టరుగారి హృదయము ద్రవించిపోయింది. కోపం పటాపంచలయింది. ఆయన కళ్లు చెమ్మగిల్లాయి. తోడి పిల్లకాయల కండ్లలోకూడ నీటిబిందువులునిల్చాయి. హెడ్మాష్టరుగారు అతన్ని లేవనెత్తారు. అతనివీపు నిమురుతూ అప్యాయంగా దగ్గరికి తీసుకున్నారు. ఆయన పై కండువాతో అతని కండ్లనీరు తుడిచారు గద్గదకంఠముతో 'నాయినా, దీనికింతగా ఏడ్వాలా" హృదయంలో కలిగిన పశ్చాత్తాపము సర్వపాపాలను కడిగివేస్తుంది చిన్నతనం తెలియకచేశావు' దాన్ని గూర్చి విచారించకు ఇంకముందు ఇట్టి పనులు చేయకు. నిన్ను శిక్షించడంలో నా ఉద్దేశం నిన్ను బాధించాలని కాదు. నీ మనసు కష్టపెట్టాలనికాదు ఇటువంటితప్పు పనులు నువు ముందు ముందు జీవితంలో చేయకుండా నేను తీసుకున్న జాగ్రత్త మాత్రమే! అని మిగతా కుఱ్ఱవాళ్ళవంక చూసి 'ఈ హితబోధ చింతామణి కొక్కడికే గాదు మీ అందరికి వర్తిస్తుంది. రేపటి నుంచి మీకు చింతామణి ఆదర్శ విద్యార్థి అవాలని వాంఛిస్తున్నాను. అంతా వెళ్ళి జాగ్రత్తగా నడుచుకుని స్కూలుకి, రాష్ట్రానికి, దేశానికి కీర్తి ప్రతిష్ఠలు తీసుకరండి' అన్నారు హెడ్మాష్టరుగారు.

చింతామణి హెడ్మాష్టరుగారికి సమస్కరించి సూర్యంవద్దకొచ్చి అతని చేతులుపట్టుకుని అతని ముఖంలో ముఖంపెట్టి అశ్రుపూరిత నయనాలతో, 'క్షమించవూ సూర్యం?' అన్నాడు.

సూర్యానికి దుఃఖం ఉప్పెనలా ముంచుకొచ్చింది, చెమ్మగిల్లిన కన్నులతో 'క్షమించాను మణీ. నేనప్పుడే ఈ సంగతి మర్చిపోయాను. ఎప్పటిలాగే మనం స్నేహితులుగా ఉందాం' అన్నాడు సూర్యం.

తోటిపిల్లలు ఆనందంతో, 'సూర్యానికి జై! న్యాయమే గెలుస్తుంది! ప్రజా స్వామ్యం వర్ధిల్లాలి' అని నినాదాలు చేసుకుంటూ హెడ్మాష్టరుగారి దగ్గర సెలవు తీసుకొని బయల్దేరారు.

హెడ్మాష్టరుగారు చిరునవ్వు నవ్వుతూ వాత్సల్యంతో ఆపిల్లలు వెళ్ళినవైపే చూస్తూ నిల్చుండిపోయాడు.

[ఆంగ్లకథ ఆధారంగా].



## రేగిపళ్లతో

(37-వ పేజీ తరువాయి)

తీసి రోటిలోవేసి బండతో దంచుకోవాలి. మెల్లిగా దంచుకొంటే పిక్కలన్నీ బయటకు వస్తాయి అవన్నీ తీసివేసి అదంతా ఒక జాడికి ఎత్తుకొని వుంచుకోవాలి తదుపరి పచ్చిమిరపకాయిలు తొడిమలు తీసుకొని చింతపండు, ఉప్పు ఇంగువ పసుపు ఇవన్నియు రోటిలో వేసుకొని మెత్తగానూరి ఈ జాడికి ఎత్తుకున్నదానిని, రేగిపళ్లముద్దను రోటిలోవేసి అప్పుడు కొత్తిమిరి వేయాలి. ఈ మూడు కలిసినట్లు బండతో మెల్లిగా ఒకసారి నూరి తీసివేయవలెను తదుపరి పొయ్యిమీద ఇనపగరిటె పెట్టి అందులో కొద్దిగా నూనెవేసి అందులో నూనె కాగగానె ఈ ఆవాలు తగుమాత్రము వేసి చిటపటలాడగానె క్రిందకుదించి ఈ పచ్చడిలో కలపవలెను ఈ పచ్చడి ఒక్క దినముకన్నా ఎక్కువ నిలవ వుండదు. నేను చెప్పిన సామానులన్నియు పళ్లు చూచుకొని దానికి సరిపడినట్లు వేసుకోవలెను. ఈ పచ్చడి చేసుకున్న దోశల లోనికి, ఇడ్లీకి అన్నములోనికి అన్నిటికి పనికి వచ్చును.





## (నిష్క్ర) రణం!

సోవియట్ రష్యా 'రెండవ స్పుత్నిక్'ను ఎగరేసిన రెండో రోజున ఆ గోళం మూలంగా బొంబాయి శ్రీ సౌండ్ స్టుడియోలో చిన్న సైజు గంద్రగోళం జరిగింది ఆ రోజున సెట్ మీద దాక్షిణాత్య నాట్యతార పద్మిని నృత్యం 'షూట్' చేస్తున్నారు అంతలో ఒకానొక మహానీయుడికి, ఆకాశమార్గాన రాకెట్లాంటి దోటి కనబడింది అది నిశ్చలంగా పోతోంది దాని వెనక తెల్లటి పొడుగు పాటి తోక అమడ పొడుగున్నట్టుంది ఓ నిముషం స్వంతంగా ఆలోచించి, చురుగ్గా నిర్ణయంచేసేసి, తక్షణం "అయ్య బాబోయ్" అన్న మాటకు హిందీ తర్జుమాను గార్తిగా ఏకు చించుకొని ప్రపంచించాడు

## బొంబాయి లేఖ

చాలా హడావుడిగా అతనిచుట్టూ మహాసభ జరిగింది అందరూ ఆకాశం కేసి చూసి, మొదటి పెద్దమనిషి వరవడిని శిరసావహించి అదేరకం ప్రకటనలు చేశారు ఆ సభాధ్యక్షుడు ఎవరోగాని, 'అది రష్యన్ రాకెట్' అన్నాడు

'ఇంకేముంది' అన్నారు చాలామంది గందరగోళం చెలరేగింది అంతలోకి పద్మిని సెట్ మీదనుంచి ఇవతలికివచ్చి పైకిచూసి, పకపకనవ్వి, అది రాకెట్ కాదు స్పుత్నిక్ అంతకన్నా కాదు జెట్ విమానం మనకే తెలీటంలేదా" అంది అప్పుడందరు స్థిమితపడి చూచి,—

అంతే ఆకథ అయిపోయింది కట్టుకథ అని మాత్రం అనుకోకండి

### "స్పుత్నిక్ 1957"

అలాంటిదే, రెండో స్పుత్నిక్ కథ ఒకటి చెరామణిలో ఉంది అంటే రెండో స్పుత్నిక్ గురించినదికాదు స్పుత్నిక్ గురించిన రెండో కథ

ఐదారుగురు పెద్దమనుషులు ఆదరాబాదరా ఊరంతా గాలించి, హడావుడిగా అశోక్ కుమార్ ఇంటికొచ్చి "దొరకలేదు" అన్నారు

"ఏమిటది?" అన్నాడు అశోక్ కుమార్.

"అదే ఆ స్పుత్నిక్ కారు ఊళ్లో కార్ల దుకాణాలన్నీ గాలించాం ఎక్కడా లేదు ఎక్కడడిగినా నేను కనలేదు వినలేదు అని ఆశ్చర్యపోతున్నాడు. వెర్రి వెధవలు...ఎందుకు. కార్ల వ్యాపారం చేస్తున్నవాళ్లకి, లేటెస్ట్ మాడల్ కారు గురించి తెలీపోతే ఎలా?" అన్నారు వాళ్ళు.

అశోక్ కుమార్ వాళ్లమాటలు సాంతం శాంతంగా విని, గంభీరంగా పైపు ముట్టించి "రైటే. వాళ్లు చెప్పింది రైటే. నేనూ ఎక్కడా వినలేదు "స్పుత్నిక్" అనే కారు ఉందని" అన్నాడు.

"మరి మీరే చెప్పారుగా!" అన్నారు ఆ వచ్చిన వాళ్ళు ఆశ్చర్యపడిలేచి...

అశోక్ కుమార్ కొంటెగా నవ్వాడని ఈ కథకి చివర రాయొచ్చుగాని, దొరల భాషలో అది కుంటిగా ఉంటుంది—అంటే 'లేమ్ ఎండింగ్' అవుతుంది.

## ఆఫ్రికాలో గోపీకృష్ణ

ప్రసిద్ధ కథక్ నర్తకుడు గోపీకృష్ణ (ఝనక్ ఝనక్ పాయల్ బాజే) తూర్పు ఆఫ్రికాలో పర్యటనకై గతవారం బయలుదేరి వెళ్లాడు. ఆయనతోపాటు వాద్యబృందం, నర్తకులూ కూడా వెళ్లారు. ముఖ్య



'నాగ్ మణి' చిత్రంలో నిరూపరాయ్



నరసరాజు & కంపెనివారి "తలవంచని వీరుడు" చిత్రంలో దేవసుందరి (సావిత్రి), చిత్రసేన (శివాజిగణేశన్)

## బొంబాయి సినిమా లేఖ

వరకే మోహిని ఈ బృందం అక్కడ మూడుమాసాలు పర్యటించి, మొత్తం 60 ప్రదర్శన లిస్తుంది

## అమెరికా ఆహ్వానం

'అమెరికన్ మోషన్ పిక్చర్ అకాడమీ' ఏటా విదేశీయచిత్రాలలో ఒకదానిని ఎన్నికచేసి, బహుమతిని ఇవ్వడం విదితమే ఈ ఏడాది, మనదేశాన్ని కూడా ఆపోటీలో పాల్గొనవలసిందిగా వారు ఆహ్వానించారు గత డిసెంబరునుండి ఈ డిసెంబరులోగా విడుదల అయ్యే చిత్రాలను మాత్రమే పోటీకి అర్హంగా పరిగణిస్తారు బహుమతీ ప్రదానం మార్చి నెలలో జరుగుతుంది కాగా, బహుమతిని చిత్రంపేరిటనే ఇస్తారు తప్ప, వ్యక్తులకు కాదు

## చిన్న సన్మానం

నర్గిస్‌కు అత్యంత ఆప్తులైన కొద్దిమంది బంధుమిత్రులు శ్రేయోభిలాషులు మొన్న చిన్న సన్మానంలాంటిది చేశారు "మదర్ ఇండియా చిత్రంలో అంతబాగా నటించినందుకు ఎంతగా మెచ్చుకోవాలో మాకు తెలీటంలేదు" అంటూ వాళ్ళంతా కలసి ఒకచక్కని దీపపు సెమ్మెను ఆమెకు కానుకగా ఇచ్చారు ఆర్భాటం లేకుండా, ఆవిందు సభ జరిగిపోయింది

## నయా(ర్) బేటీ

సంగీత దర్శకుడు ఓ. పి. నయార్ ఒక పందెంలో ఓడిపోయాడు మొన్న మొన్నటి వరకూ, 'ఈసారి నాకు కొడుకు పుడతాడు' అని మిత్రులతో దాటీగా చెబుతూవచ్చాడు అందరూ, 'ఔనుమరే, కొడుకే పుట్టాలి' అని అన్నా, గాయని ఆశా భోంస్లే 'కాదు కూతురే పుడుతుంది' అని వాదించి పందెం కట్టింది చివరకి ఆమె నెగ్గింది నయార్‌కు మళ్ళీ కూతురే పుట్టింది నాన్నకి టోకరా ఇచ్చిన ఈ 'నయా బేటీ', నయార్‌కు మూడవకూతురు

* * *

బొంబాయి చిత్రసీమలో ఫిలిం నటీనటులతోపాటు వారి పిలల పుట్టిన రోజులుగూడా ఘూమ్మని, 'గ్లామర్ స్' అనిపించుకునేలా జరుగుతున్నాయి మొన్న, గాయకుడు, (నటుడు) తలత్ మహమూద్ కుమారుడు ఖలీఫ్‌కు నాలుగో పుట్టినరోజు పండుగ వైభవంగా జరిగింది అగ్రశ్రేణి నటీనటులందరూ విందుకువచ్చి ఖలీఫ్‌ను ఆశీర్వదించి, కానుకలిచ్చారు అంతక్రితం సంగీతదర్శకుడు మదనమోహన కుమారుడు సంజీవ్ పుట్టినరోజు పండుగ చేసుకున్నాడు

## నవ్‌రంగ్

రాజ్ కమల్ కళామందిర్ పేరిట దర్శక నిర్మాత శాంతారాం ఈసారి హిందితో పాటు తెలుగులోకూడా ఒకచిత్రం నిర్మించ నిశ్చయించారు హిందీచిత్రానికి 'నవ్‌రంగ్' అని పేరుపెట్టారు

రెండు చిత్రాలలోనూ నాయిక భూమిక సంధ్య నిర్వహిస్తుంది

* * *

బ్రిటన్‌లో సినిమా యజమానులంతా ఇటీవల సమావేశమై ప్రవేశ రుసుము పెంచాలని నిశ్చయించారు

* * *

వీడాదివాడు, అమెరికన్ నటి అవా (భవానీ జంక్షన్) గార్డ్నర్ ఈ ఊరొచ్చింది అప్పుడావిడ, తనకూడా పెట్టే

బిడాత్తోపాటు, ఒకజత 'ఇనప తెరలు' తెచ్చుకుంది ఈమాట అందరూ అన్నారు తలోట్లో ఈ "ఇనపతెరలు" అమెరికా ఒప్పయారయ్యాయి కాబోలన్నారు పెట కారణంగా కొందరు కారణం అవా గార్డ్నర్ వాలకం ఆమె అప్పుడు 'భవానీ జంక్షన్' చిత్రం షూటింగులో పాల్గొన డానికై కరాచీ వెళ్తూ, బొంబాయిలో రెండు గంటల సేపు ఆగింది పత్రికా విలేఖరులు, ఫోటోగ్రాఫర్లు, ఎంతో ఉత్సాహంతో ఆ ప్రఖ్యాత అమెరికన్ నటిని పలకరించ బోయారు తీరా చూస్తే ఆవిడ పెద్ద నల్ల కళ్ళజోడు తగిలించుకుని చిర్రూ బుర్రూ మంటూ కనపడింది ఆప్యా యంగా, ఎంతో గౌరవంగా విలేఖరులు అడగబోయిన ప్రశ్నలకు జవాబు ఇవ్వలేదు సుహృద్భావం పెంచే లక్షణాలకు బదులు, ఇదేమి వైఖరీ అని అంతా విస్తుబోయారు కొందరు నొచ్చుకున్నారు

ఆ రోజున, ఎవరూ పడమటవేపుకి తిరిగి 'వన్స్‌మోర్' అని అనలేదు కాని, మొన్న నవంబరు 7న మరొక అమెరికన్ నటి జెనిఫర్ (పోర్ట్రెయిట్ ఆఫ్ జెన్నీ, లవ్ ఈజె మెనీ స్ప్లెండర్డ్ థింగ్) జోన్స్ అదే వైఖరిని పునః ప్రదర్శించింది ఈమె, ఆమెను మించిపోయిందనిపించింది చిరచిర లాడటంలో ఈమె వసుందని తెలిసి విలేఖరులూ, ఫోటోగ్రాఫర్లూ శాంతాక్రజ్ విమానాశ్రయానికి వెళ్ళారు స్వాగతం చెబుదామని ఆమె వీళ్ళనుచూచి చిరాకు నటించింది గాలి గట్టిగా వీస్తున్నందువల్ల సేమో అనుకుని, విలేఖరులు అక్కడనుండి ఆమె బసచేసిన తాజ్ హోటల్‌కి వెళ్లారు

సినిమాస్టార్లు ముఖ్యంగా హాలీవుడ్ వాళ్లు, "చిరునవ్వులు తొడుక్కుంటారని," కొంద రంటారు ఆరోజున తాజ్ హోటలులో జెనిఫర్ దగ్గిర చిన్న సైజు చిరునవ్వుకూడా లేకపోయింది ఈ దేశం వచ్చేసరికి అయిపో యాయి కాబోలు కసిరినట్టు మాట్లాడ బోయింది ఆరకం వాలకం, మనదేశంలో నాగరికులు, సభ్యత తెలిసినవాళ్లు కూడే ఏ చోటా మనకి కనబడదు మనకి అలాటిది అలవాటు లేదు

జెనిఫర్, అక్కడించి, మళ్ళీ విమానం ఎక్కి ఢిల్లీ వెళ్ళింది ఓ నెల్లాళ్ళపాటు ఇందం బటే ఉండి విశ్రాంతి తీసుకుంటుందట ఇది కబురో, పుకారో తెలీదు ఆవిడ ఏదైనా ప్రత్యేకమైన మహత్కార్యం భుజాన వేసు కొచ్చిందేమోకూడా తెలీదు కానీ, ఆ చిరాకుపడటం అదిచూడగా, మనకు తెలియ రాని రాచకార్యంకాబోలు, బహుశా మనకది నచ్చనిది కాబోలు, అందుకే చిరాకు పోలేదు అని ఊహపోతుంది ఒకవేళ ఏదేనా ఫిలిం వ్యవ హారంమీద నె వచ్చినా వచ్చివుండవచ్చును ఏమైనా, అది వేరేసంగతి ఈ దేశం వచ్చిన అమెరికన్‌లు ఈ ఇద్దరే కారు ఇంతకుముందు చాలా మంచివాళ్లు, సౌమ్యులు వచ్చారు ఇక్కడ విశ్రాంతి తీసుకున్నారు, అనకకరాచీలో మజలీ చెయ్యనూచేశారు వాళ్లంతా, మనదేశంలోని కాశ్మీరు ప్రభృతి ప్రాంతాలలో స్థితిగతులుచూచి తెలుసుకుని, తమ రాచకార్యం మేరకు ఆ భోగట్టాను కరాచీ రవాణా చెయనే చేశారు జెనిఫర్ జోన్స రాచకార్యం కూడా అకోవదనా అన్న విషయంలో ఎవరికి తోచినది వారు అనుకోవచ్చు

నటి నూతన సమర్థ్ లండన్‌లో భారత చలన చిత్రోత్సవం అయిపోయాక, స్విట్జర్లాండ్ వెళ్లి నెల్లాళ్లు విశ్రాంతి తీసుకు తిరిగివచ్చింది మళ్ళీ ఓ కుక్కని పట్టుకు చక్కావచ్చింది యూరప్ వెళ్లివచ్చినప్పుడల్లా, కుక్కపిల్లని పట్టావడం ఆమెకు అలవాటే ★

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)



ఇటీవల దిలీప్‌కుమార్ డార్జిలింగ్ వెళ్ళినప్పుడు అక్కడివారు విందు చేశారు ఎడమ చివరఉన్నవారు బి ఆర్ చోప్రా.

చైనా రాజధాని 'పెకింగ్' నగరంలో ఇటీవల జరిగిన ఆసియా చలనచిత్రోత్సవానికి సొహ్రాబ్ మోడీ సతి శ్రీమతి మెహతాబ్ భారతప్రతినిధిగా వెళ్లారు ఆమెతో వున్నవారు చైనీస్ నటి పెనయెన్



# చలన చిత్రాలలో నటన

## అంజలీదేవి అభిప్రాయాలు

[ వాయిస్ ఆఫ్ అమెరికాలో గోష్ఠి]

మోహన్ -నమస్కారమండి అంజలీదేవి గారు

అంజలి -నమస్కారమండి.

మో -వాయిస్ ఆఫ్ అమెరికా ద్వారా మిమ్మల్ని పరిచయం చేస్తున్నందుకు చాలా సంతోషంగా ఉందండి

అ -ఈ అవకాశం కలిగించినందుకు నాకూ అలాగే వుందండి

ప్రశ్న -మీరు మొట్టమొదటగా నటించిన చిత్రమేదండి

జవాబు -గొల్లభామ

ప్ర -అందులో మీరు చాల చక్కగా నాట్యం చేశారు అంతకుపూర్వం, మీరు నాట్య శాస్త్రంలో శిక్షణ పొందారా?

జ -శిక్షణ అంటే నా చిన్నతనంలోనే మావాళ్ళు నాకు నాట్యం నేర్పించారు ఆ కళయందు ఎక్కువ ఉత్సాహముండటంచేత, ప్రతిరోజూ అమిత శ్రద్ధతో, నాట్యం చేస్తూండేదాన్ని ఇంతలో, యుద్ధ నిధి సహాయార్థం, కొన్ని నాట్య ప్రదర్శనాలని ఇవ్వమని నన్ను కోరడంచేత, ఈ కళను నవ్యరీతుల్లో దినదినాభివృద్ధి చేసుకోగలిగాను

ప్ర -అంటే ముఖ్యంగా 'స్వయంకృషి' అనే చెప్పాలి నాట్యమందు మంచి పేరు ప్రఖ్యాతులు తెచ్చుకోవడమే కాకుండా 'పల్లెటూరి పిల్ల' 'నిర్దోషి' మొదలగు చిత్రాల్లో ఉద్వేగభరితమయిన పాత్రలను, ఉత్తమంగా నటించారు మీకు నాట్యంలో




అనుభవంతోపాటు, రంగస్థల అనుభవం కూడా ఏమయినా వుందా?

జ - నేను మద్రాసు రాక పూర్వం, ఆంధ్రదేశంలో చాలా చోట్ల నాటకాల్లో కూడా నటించినా ఈ నటనలో అటు ఖులాసా అయిన పాత్రలూ ఇటు 'బరువైన' పాత్రలు వేస్తుండేదాన్ని

ప్ర -మీకు చిత్రాల్లో నటించడంతో పాటు రంగస్థలంమీద అనుభవంకూడా ఉన్నదన్న మాట ఈ రెండు తరహాల నటనలకు ఏమైనా వ్యత్యాసం వుందాండి

జ -చాలా వ్యత్యాసం వుందండి రంగస్థలంమీద నటించేప్పుడు ప్రక్కనున్న నటీనటుల సహకారం ప్రేక్షకుల రసానుభూతి ఎంతో సహాయంగా వుంటాయి కాని చిత్రాల్లో అదే దృశ్యాన్ని చిత్రించేటప్పుడు 'షాట్స్'గా విభజిస్తారు ఒక్కొక్క షాట్ మధ్యని, కాలవ్యవధి కనీసం అరగంట నుంచి, గంటవరకు వుంటుంది కనుక మొదట ఏ భావంతో నటించామో, అదే భావాన్ని తర్వాతి షాట్‌లోకూడా ప్రదర్శించాలి లేకపోతే నటనలో 'కంటిన్యుటి' దెబ్బతిని, రసాభాసవుతుంది

ప్ర -మరేనండి సాధారణంగా మీ కీ రంగస్థలం మీదికి వచ్చేటప్పుడు, మీ పాత్ర వంతో, కంఠస్థం చేసేసే ప్రాంప్టింగ్ లేకుండా చక్కగా నటించడానికి వీలవుతుంది అలాగే, చిత్రాల్లో షూటింగ్‌కి వెళ్లే



ఫిలింస్ డివిజన్‌వారు మలయాళకవి వల్లత్తోల్ పర్యవేక్షణ క్రింద, "కథాకళి" నృత్యవిద్యపై ఒక 'చిన్నచిత్రం' నిర్మిస్తున్నారు అందులో నృత్యంచేస్తున్న కుంజుకురూప్, కుమ రివాసు

ముందుకూడ, మీ పోర్షనంతా కంఠస్తం చేసుకుని వెళ్తారా

జ -కంఠస్తం అంటే నాటకాల్లోలాగా బట్టీపట్టి వెళ్లను కాని, ఆ పాత్ర ఏమిటో, ఆ డైలాగ్స్ ఏ విధంగా చెబితే భావయుక్తంగా ఒప్పుతాయో, బాగా ఆలోచించుకుని, అవగాహన చేసుకుని మరీ సెట్ మీదికి వెళ్తాను కాని కొందరు ప్రొడ్యూసర్స్ సెట్ మీదనే డైలాగ్సు ఇస్తూంటారు అక్కడే వాటిని చదువుకుని వెంటనే 'మూడ్'లోకి వెళ్ళి, నటించాలసి వస్తుంది

ప్ర షూటింగ్ అంటే, మీరు ప్రతిరోజూ ఒకే కాల్ షీట్ పనిచేస్తారా, లేక రెండు మూడు కాల్ షీట్స్ పని చేస్తూంటారా ?

జ -ప్రతిరోజూ ఒకే కాల్ షీట్ కి పని చేస్తే ఎంతో హాయిగా వుంటుంది కాని ఎక్కువ పిక్చర్లవల్ల, రోజుకి రెండు కాల్ షీట్స్ కూడా పనిచేస్తూంటాను

ప్ర -శారీరకంగాను, మానసికంగాను ఇది శ్రమయిన పనేకదా?

అవునండి

## పరకాయ ప్రవేశం

ప్ర -ఉదయం ఒక కాల్ షీట్ అంటే సుమారు 7 గంటలకాలం పని చేసారు, మధ్యాహ్నం నుండి రెండో కాల్ షీట్ పని చేస్తారు అంటే కొద్దిపాటి విశ్రాంతితో ఒకపాత్ర నుంచి, మరో పాత్రలోకి పరకాయ ప్రవేశం చేసినట్లుంటుంది కదూ?

జ -అంగుకనే కాల్ షీట్స్ మధ్య తగినంత వ్యవధి ఉండేటట్లు చూస్తూంటాను ఒకసారి 'రిలీజ్ డేట్' ఇచ్చిన పిక్చర్స్ అయితే, రాత్రింబగళ్ళు పని చేయాలసి వస్తుంది కాని, నటనయందు గల శ్రద్ధాభక్తులూ, నిర్మాతలకు సహాయం చేయాలనే ఆవేదనా, శ్రమనుకూడా లెక్క చేయకుండా చేస్తాయి

ప్ర -మీరూ ప్రొడ్యూసర్ కనక, ఆ సాధక బాధకాల్ని సులువుగా గ్రహించగలుగుతారు ఇంకో ప్రశ్న అండి, అంజలీదేవిగారూ

జ :-అడగండి మోహన్ గారు

ప్ర -ప్రతిరోజూ కనీసం 16 గంటలయినా పనిచేసే మీలాంటి వ్యక్తులకు, కనీసం వారానికి ఒకరోజయినా విశ్రాంతివుండటం చాలా అవసరమనుకుంటాను

జ నిజమేనండి ప్రతి ఆదివారం, ఈ చిత్రకళాప్రపంచాన్ని మరిచిపోయి ఎక్కడికయినా వెళ్లివద్దామనిపిస్తుంది కాని అది జరగదు

ప్ర -ఇలా సహకరించే నటీనటులు చాలా అరుదుగా వుంటుంటారు మీరింతవరకు ఎన్ని చిత్రాల్లో నటించివుంటారు

జ -విడుదలయిన చిత్రాలు అరవై అయిదు ప్రస్తుతం నటిస్తున్న చిత్రాలు ముప్ఫయిఒకటి మొత్తం తొంభైఆరుచిత్రాలు ఇటీవల సారథి వారిచిత్రం "పెద్దరికాలు", నా స్వంత చిత్రం తెలుగు 'సువర్ణసుందరి' తమిళం 'మణాలన్ మంగయిన్ భాగ్యం' మొదలునవి విడుదలయాయి



యన్ ఏ టి వారి "పాండురంగమాహాత్మ్యం"లో రామారావు, బి సరోజ



విజయగోపాల్ ప్రొడక్షన్స్ వారి "గంగా గౌరీ సంవాదం" చిత్రంలో గంగను కన్నతల్లిగా హేమలత

ప్ర మీరు నటించిన చిత్రాల్ని మీరు చూస్తుంటారా

జ -నేను నటించిన చిత్రాల రషెస్ మాత్రం అప్పుడప్పుడు చూస్తుంటాను చిత్రం పూర్తిఅయినతర్వాత చూడ్డానికి ముఖ్యంగా తెలుగుచిత్రాలు ఇక్కడ ఎక్కువగా విడుదల కాకపోవడమే కారణం "ప్రివ్యూ"కయినా వెళ్దామంటే 'కాల్ షీట్స్' ఆ కాస్త అవకాశాన్ని మింగేస్తాయి

ప్ర రష్సెస్ చూడటంవల్ల మీకేమయినా లాభం వుంటుందా?

జ -తప్పకుండా లాభముంటుంది నేను నటించిన పాత్రకు న్యాయంచేశానో లేదో అని ముందు ఆలోచిస్తాను సెట్ మీద నటిస్తూన్నప్పుడు, తెలియని కొత్త విషయాలు రషెస్ చూస్తూంటే కనిపిస్తుంటాయి

ప్ర -మీ అభిమాన ప్రేక్షకులనుంచి వచ్చిన ఉత్తరాలకి జవాబులిస్తుంటారా!

జ :-అవకాశం ఉన్నంతవరకు ఉత్తరా

# సినిమా వార్తలు

అన్నపూర్ణా(తోడికోడళ్ళు) పిక్చర్స్‌వారు ఈ వారంలో కొత్తచిత్రాన్ని ఆరంభిస్తున్నారు. నవంబరు రెండో వారాంతానికి స్క్రిప్టు రచన పూర్తిచేసినట్లు, నిర్మాత డి. మధుసూదనరావు తెలియజేశారు 28న పాటల రికార్డింగు ఆరంభిస్తారు. డిసెంబరు మూడో వారంలో "షూటింగ్" మొదలుపెడతారు. ఈ చిత్రంలో నాగేశ్వరరావు, సావిత్రి ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. రంగారావు, కన్నాంబ, రేలంగి, సూర్యకాంతం, రాజసులోచన ప్రముఖ పాత్రలు ధరిస్తారు.

కొత్త నటుడు రమణ (ఎం. ఎల్. ఎ.) మూర్తిని మధుసూదనరావుగారు ఇటీవలనే బుక్ చేశారు.

స్ఫురద్రూపం, సౌలభ్యం ఒప్పే నటన రమణమూర్తిని సర్వత్రా అభిమానపాత్రుణ్ణి చేశాయి. నిర్మాత మధుసూదనరావు ఇప్పుడు రమణమూర్తికి ఈ కొత్త చిత్రంలో ఒక మంచి భూమికను అప్పగించారు.

శతదినోత్సవ చిత్రం "తోడికోడళ్ళు" రూపొందించిన టెక్నీషియన్ల బృందము అంతా ఇందులో పాల్గొంటున్నది. దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు; మాటలు ఆత్రేయ, పాటలు ఆత్రేయ, శ్రీశ్రీ, కొసరాజు వ్రాశారు. సంగీత దర్శకుడు వేణు. కళాదర్శకుడు కృష్ణారావు. ఈ చిత్రాన్ని తెలుగులోను నిర్మిస్తున్నారు.

## తలవంచని వీరుడు

శరవణభవ అండ్ యూనిటి పిక్చర్స్‌వారి 'రణంగాముడి' చిత్రాన్ని నరసరాజు అండ్ కంపెనీవారు 'తలవంచని వీరుడు' పేరిట వచ్చే నెల తెలుగులో విడుదల చేస్తున్నారు మాటలు పాటలు శ్రీ శ్రీ వ్రాశారు. తమిళనాడులో విజయవంతంగా సాగిన ఈ చిత్రంలో సావిత్రి, శివాజీగణేశన్, కన్నాంబ, రాజసులోచన హెలెన్ నాగయ్య, నంబియార్, హాస్యనటుడు తంగవేల్ పాల్గొన్నారు దర్శకత్వం పి. పుల్లయ్య.

## పొన్నలూరివారి కొత్తచిత్రం

పొన్నలూరు బ్రదర్స్‌వారి సాంఘిక చిత్రం 'శోభ'ను సంక్రాంతికి విడుదల చేయాలని సంకల్పించారు. వీరి తరువాతి చిత్రం 'దైవబలం' నిర్మాణం (తెలుగు, తమిళ భాషలలో) డిసెంబరులో ఆరంభిస్తున్నారు. రచన పూర్తి అయింది. ఇది జానపదం

నాలుగవ కానుకగా హాస్యరస ప్రధానమైన ఇతివృత్తాన్ని తీసుకొని 'గుడ్ మార్నింగ్' పేరిట నిర్మించనున్నట్లు నిర్మాత వసంతకుమార రెడ్డి ప్రకటించారు.

# చలన చిత్రాలలో నటన

లకు జవాబులిస్తూనే వుంటాను. కాని అన్ని ఉత్తరాలకు సమాధానాలివ్వాలంటే మానవ మాత్రులకు సాధ్యంకాదు. ఈ విషయంలో మీరుకూడా నాతో ఏకీభవిస్తారనుకుంటాను.

ప్ర:-మరేనండి...ప్రేక్షకులుకూడ ఈ విషయాన్ని గ్రహిస్తారనుకుంటాను. ఇంకో ప్రశ్న. మీరు తెలుగు, తమిళ చిత్రాల్లో నేనా,...మరే భాషా చిత్రాల్లోనయినా నటించారా?

జ:-హిందీ చిత్రాలలోకూడా నటించానండి. 'ఏక్-థా-రాజా', లడ్కీ, షుక్-రంభ, నయా ఆద్మీ, 'దేవత'ల్లో నటించాను. ప్రస్తుతం 'ఉస్తాద్'లో నటిస్తున్నాను.

మోహన్:-మీకు వ్యవధి లేకపోయినా, శ్రోతలమీది అభిమానంతో ఈ కార్యక్రమంలో పాల్గొన్నందుకు అభినందిస్తున్నాను.

అం:-నాకీ అవకాశం ఇచ్చినందుకు చాలా సంతోషం.

మో:-శెలవండి.

అ:-శెలవండి. ★



పొన్నలూరి బ్రదర్స్‌వారి "శోభ" చిత్రంలో
అంజలీదేవి, రామారావు, కొండలరావు

## *'వద్దంటే పెళ్లి'*

విఠల్ ప్రొడక్షన్స్‌వారి హాస్యరస ప్రధాన చిత్రం "వద్దంటే పెళ్ళి" గతవారం ఆంధ్రలో విడుదల అయింది. శ్రీరంజని, కృష్ణకుమారి గిరిజ, ఇ. వి. సరోజ, అమర్‌నాథ్, చలం, సి. ఎస్. ఆర్. రమణారెడ్డి రాజనాల, పేకేటి శివరాం, బాలకృష్ణ, మొదలగువారు ఇందులో పాల్గొన్నారు. రచన రామచంద్, జి. కె. మూర్తి. దర్శకుడు విఠలాచార్య.

## ఇన్‌గ్రిడ్ బెర్గ్‌మన్

ఇటాలియన్ దర్శకుడు రాబర్టో (వైజా, స్ట్రాంబోలీ) రాసెలినీ, నటి ఇన్‌గ్రిడ్ బెర్గ్‌మన్ విడాకులు ఇచ్చుకున్నారు. ఏడేళ్ళ కాపరం తరువాత, ఒకరితత్వం ఒకరికి పొసగక ఇప్పుడు చట్టరీత్యా తేల్చుకున్నారు. రాసెలినీ ఆమధ్య మనదేశం రావడం, ఆయన బొంబాయిలోని సోనాలీ అనే గృహిణిని ప్రేమించాడని వదంతులు, వాటి మూలంగా కొంత రభస రేగడం విదితమే. తరువాత రాసెలినీ ఇటలీ వెళ్ళిపోయారు. వెళ్ళిన వారంరోజులకు (ఈ నెల రెండో వారం) భార్యాభర్తలు వేరైనట్లు ప్రకటన వెలువడింది. ఈ దంపతులకు ముగురు పిల్లలు. ★

# ఆంధ్రవిద్యార్థి సమితి సాంస్కృతికోత్సవాలు

మద్రాసు ఆంధ్రవిద్యార్థిసమితి సాంస్కృతికోత్సవాలు నవంబరు 7 నుండి 11 వరకూ జరిగాయి. ఉత్సాహం వెల్లివిరిసిన

ఈ ఉత్సవాలను తొలిరోజున మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ కె. కామరాజ్ ప్రారంభించారు. ఆనాటిసభకు శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడు శ్రీ వి. గోవిందరాజులు నాయుడు అధ్యక్షత వహించారు.

ఏకాంకికల ప్రదర్శనం, ఏకపాత్రాభినయం, గానసభలూ, నృత్య ప్రదర్శనలు మొదలగువాటన్నిటిలోను నగరంలోని వివిధ కళాశాలల ఆంధ్ర విద్యార్థినీ విద్యార్థులంతా పాల్గొన్నారు. ఈసారి విశేషం ఆంధ్ర, శ్రీ వెంకటేశ్వరవిశ్వవిద్యాలయాలకు చెందిన విద్యార్థి బృందాలు వచ్చి పాల్గొనడం.

## సన్మానాలు

నవంబరు 10 వ తేదీన పెంట్‌హౌస్ హాలులో ఈసమితి లలితకళా సన్మానం జరిపింది. చలనచిత్రకళాకారులలో నటుడు శ్రీ ఎన్. టి. రామారావు నటి శ్రీమతి జి. వరలక్ష్మి, గాయకుడు సంగీత దర్శకుడు శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావు ఉన్నారు. అటుకాక వెయిట్ లిఫ్టింగ్ చాంపియన్ శ్రీ కామినేని ఈశ్వరరావును, కవి శ్రీ పుట్టపర్తి శ్రీరాములురెడ్డిని కూడా సత్కరించారు. ఆరోజు సభకు చిత్తూరు నాగయ్య అధ్యక్షత వహించారు. సమితి అధ్యక్షుడు శ్రీ టి. సి. కొండయ్య స్వాగతం చెప్పారు.

శ్రీయుతులు కె. జగ్గయ్య, డా॥ గోవిందరాజు సుబ్బారావు ప్రభృతులు సన్మానితులను ప్రశంసిస్తూ ప్రసంగించారు. శ్రీ ముదిగొండ లింగమూర్తి. వివిధ పోటీలలో ఉత్తమ ప్రమాణాలు చూపిన విద్యార్థులకు బహుమతులు పంచిపెట్టారు. సమితి కార్యదర్శి శ్రీ రామారావు వందనసమర్పణతో ఉత్సవాలు ముగిశాయి. ఈ ఉత్సవసందర్భంగా ఒక చిత్రకళా ప్రదర్శనంకూడా ఏర్పాటు చేశారు.

# దర్శక నిర్మాత రంగాకు సన్మానం

దర్శక నిర్మాత, ప్రముఖఛాయాగ్రహణ దర్శకుడు, అయిన శ్రీ బి. ఎస్. రంగాకు, నవంబరు 10సాయంకాలం నవయుగ ఫిలింస్ వారు సన్మానం చేశారు.

శ్రీ పచ్చయప్పయ్య భవనంలో జరిగిన ఆసభకు, విజయవాడ పురపాలన ప్రత్యేకోద్యోగి, కమిషనర్, శ్రీ గురురెడ్డి అధ్యక్షత వహించారు.

ముందు తేనీటివిందు జరిగింది. తరువాత నవయుగ ఫిలింస్. తరఫున శ్రీ విశ్వనాథ శర్మ, సన్మానపత్రం చదివారు. ఆ పత్రా



చలనచిత్ర దర్శక నిర్మాత 'విక్రమ్ స్టుడియో' అధిపతి శ్రీ బి. ఎస్. రంగాకు నవయుగ ఫిలింస్ (విజయవాడ) వారు నవంబరు 10న సన్మానం చేశారు. ఎడమనుండి: శ్రీ రంగా, బహుమతిని అందచేస్తున్న విజయవాడ పురపాలక సంఘ కమిషనర్ శ్రీ గురురెడ్డి, శ్రీ డి. విశ్వనాథశర్మ.

న్ని, ఒక రజత అశోక స్తంభాన్ని అధ్యక్షుడు గురురెడ్డి రంగాగారికి బహూకరించారు. శ్రీయుతులు జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, ఎ. బలరామమూర్తి, డి. వి. కృష్ణయ్య ప్రభృతులు, దర్శకుడుగా, నిర్మాతగా చలనచిత్ర పరిశ్రమకు రంగా చేసిన సేవను ప్రశంసించారు. ఆయన నిర్మించిన 'తెనాలి రామకృష్ణ' చిత్రం రాష్ట్రపతి బహుమతిని అందుకోవడం తెలుగు పరిశ్రమకు ప్రజలకు కూడా గర్వకారణమన్నారు. రంగా కృతజ్ఞత తెలుపుతు, "తెనాలిరామకృష్ణ" విజయానికి కారణం అందులో పాల్గొన్న కళాకారుల టెక్నీషియన్ల కృషిఅని అన్నారు.

ఉత్తమశ్రేణి తెలుగు చిత్రాలను అంతర్జాతీయ చలనచిత్రోత్సవాలకు పంపడంలో ప్రభుత్వం సహాయం చాలా అవసరమని ఈ సందర్భంలో ఆయన చెప్పారు.

## రంగా పరంగా

రంగా గారు, చలనచిత్రపరిశ్రమలో ఛాయాగ్రాహకుడుగా ప్రవేశించారు. అచిరకాలంలోనే ఆరంగంలో పేరుతెచ్చుకొని, మద్రాసులో చిత్రనిర్మాణం ఆరంభించారు. ఒక లేబరేటరీ కూడా నెలకొల్పుకున్నారు. మా గోపి, తెనాలిరామకృష్ణ, భక్త మార్కండేయ చిత్రాలను తెలుగు తమిళ భాషలలోను, మొన్ననే విడుదల అయిన 'కుటుంబగౌరవం'ను తెలుగు తమిళ కన్నడభాషలలోను నిర్మించారు. ఈతొమ్మిది చాలు గెల్ల కాలంలో విడుదల అయ్యాయి. ఈ వ్యవధిలోనే ఆయన కోడంబాకంలో ఒక స్టుడియో నిర్మించుకున్నారు. ఉచ్చితంగా ఏడాదికో చిత్రం (కనీసం) అందివ్వడం ఆయన లక్ష్యం. తొంగిచూచి, అందిన లాభాలు పుచ్చుకొని ఇంకో రంగంలోకి వెళ్ళే ఊహతో రంగా ఇందులోకి రాలేదు పరిశ్రమకు చెందిన మనిషి అనిపించుకొని, స్వయంకృషితో చెప్పుకో తగ్గ ఫలితాలను సాధిస్తూ నిలదొక్కుకున్న వ్యక్తిగా సర్వత్రా అభినందనీయుడనిపించుకొన్నారు.

## కొత్తనటులకు నిర్మాతల సంఘం ప్రోత్సాహం

కొత్తనటులను ఏరి, చలనచిత్ర పరిశ్రమలో ప్రవేశపెట్టడానికై భారత చలనచిత్రనిర్మాతల సంఘం (ఐ. ఎం. పి. పి. ఎ) ప్రత్యేకం ఒక సంస్థను ఏర్పాటుచేసింది. వీరు ఏరిచూపే నటీనటులలో, తమచిత్రాలకు తగినవారు, సమర్థులు లభించినట్లయితే, వారిని తీసుకొని అవకాశం ఇవ్వడానికి ప్రముఖ దర్శక నిర్మాతలు బి.ఆర్. చోప్రా, బిమల్ రాయ్, గురుదత్, పి. ఎన్. అరోరా మోహన్ సెగాల్, ఎస్. డి. నరాంగ్, ఎం. సాదిక్ మొదలగువారు అంగీకరించారు.

ఇదే తరహా ప్రయత్నాన్ని సినిమాపత్రిక 'ఫిలింఫేర్' కూడా, గురుదత్, బిమల్ రాయ్‌ల సహకారంతో తలపెట్టడం విదితమే.

ఇపుడు ఐ. ఎం. పి. పి. ఎ. ద్వారా, చలనచిత్రాలలో చేరగోరేవారు ఆ సంఘం

# నిర్మాతలసంఘ ప్రోత్సాహం

కార్యదర్శి పేరిట శాండ్‌హర్స్ట్ బిల్డింగ్, సర్దార్ పటేల్ రోడ్, బొంబాయి-4 కు దరఖాస్తులు పెట్టుకోవచ్చు. ముందుగా ఓ ఉత్తరం రాస్తే దరఖాస్తు ఫారాలు పంపిస్తారు. అందులో వారు కోరిన వివరాలన్నీ ఇచ్చి, దానికి రెండు ఫోటోలు (ఒకటి ఫ్రంట్ వ్యూ, ఇంకొకటి ప్రొఫైల్) జతపరచి పంపించాలి.

*  *  *

విజయవాడలో ఈ నెల 15 నుండి 21 వరకూ ఆర్. కె. ఫిలింస్ చలనచిత్రోత్సవం జరిగింది. ప్రేమలేఖలు, జాగ్ తేరహో, శ్రీ 420, బూట్ పాలిష్, ఆవారా, బర్సాత్ చిత్రాలను ప్రదర్శించారు. జెక్ ఉత్సవంలో 'జాగ్ తేరహో' బహుమతి నందుకున్నందుకు, నిర్మాత రాజ్ కపూర్ గౌరవార్థం ఈ ఉత్సవాన్ని ఏర్పాటు చేశారు. ★

# రాజమండ్రిలో నాటకోత్సవాలు

ఈ నెల తొలి వారంలో, లలితకళా నికేతన్ ఆధ్వర్యాన రాజమహేంద్రవరాన భారీఎత్తున నాటకోత్సవాలు జరిగాయి. ఆంధ్రప్రదేశ్ లోని వివిధ పట్టణాల నుండి నటకసంఘాలు వచ్చి ఈ ఉత్సవంలో పాల్గొన్నాయి. వారంరోజులు ఊరంతా కలకలలాడింది, నాటక, నాటికా పోటీలలో అందరు ఉత్సాహంగా పాల్గొని, పురజనులకు విందువంటిది చేశారు ప్రేక్షకులు పుష్కలంగా హాజరై, ఉత్సవాలను జయప్రదం చేశారు. నాటకపోటీలకు, 'నాటకకళ' రచయిత మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, వేదుల జగన్నాధరావు రోహిణి గారలు న్యాయమూర్తులుగా వ్యవహరించి సర్వజనామోదకరంగా తీర్పులనిచ్చి బహుమతులు నిర్ణయించారు.

ఈ క్రింది వారికి బహుమతులు లభించాయి.

## నాటకాలు

ప్రదర్శన ఇన్‌స్పెక్టరు జనరల్ (రాఘవ కళాసమితి), రచన రెంటాల

రచన: నిజరూపాలు. కొర్రపాటి గంగాధరరావు.

నటుడు: శ్యామసుందర్ (బాపట్ల- నిజరూపాలు నాటకంలో).

నటి. కుమారి శాంత (ధవళేశ్వరం- కావ్యశ్రీ వ్రాసిన 'ప్రతిష్ఠ'లో)

## నాటికలు

ప్రదర్శన 'ఈరోజు (బ్రాకెట్టు)'-పీపుల్స్ అకాడమీ, విజయవాడ. (రచయిత కె. అప్పలస్వామి)

రచన 'మన సత్త్వాలు' - భమిడిపాటి రాధాకృష్ణ.

నటుడు తాతాజీ ('సమర్పణ' నాటికలో.) నటి. మణికుమారి ('మన సత్త్వాలు' నాటికలో)

ఉత్తమరంగ స్థలాలంకరణకు ఇచ్చే బహుమతి, "ఇన్‌స్పెక్టరు జనరల్" నాటక ప్రదర్శకులు రాఘవ కళాసమితి (కాకినాడ)కి లభించింది. ఇదే నాటకంలో ముఖ్యపాత్ర ధరించిన హరనాథరాజు, 'వెంకన్న కాపురం (రచయిత ఎం లింగమూర్తి)'లో సింగరాజు నాగభూషణం గారలకు ప్రత్యేక బహుమతులు ఇచ్చి గౌరవించారు.

## సన్మానం

వీరందరికీ, చలనచిత్ర నిర్మాత పొన్నలూరి (భాగ్యరేఖ) వసంతకుమారరెడ్డి గారు 'రోలింగ్ కప్‌లు' బహూకరించారు.

ఆనాడు జరిగిన సభలో, ప్రముఖచలనచిత్రనటుడు ఎస్. వి. రంగారావుకు సన్మానం జరిగింది ఆస్థానకవి. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారు ఆయనకు నటసమ్రాట్ బిరుదు ప్రదానంచేసి గౌరవించారు. అనంతరం, నాటక రచయిత కొర్రపాటి గంగాధరరావుకు నటరాజ సన్యాసి రాజుగారు 'రంగరచన ప్రవీణ' బిరుదు నిచ్చి సత్కరించారు ★

# గురుభక్తి

(7-వ పేజీ తరువాయి)

గురించి చెప్తూ పెరటితోట ఉపయోగాల గురించి ఉద్ఘాటించేవాడు గాని ఎప్పుడూ పట్టించుకోలేదు. భార్యతో 'వెంటనే "దామోదరంచేత తెప్పిస్తానుండు!" అన్నాడు. ఆవిడ అలాగే ఉంది!!

దామోదరంతో చెప్పాడు భార్యకోరికను తన కోరికగా! ఆచార్యులువారి ముందు శ్రీరాములవారి ఎదుట ఆంజనేయులులా నుంచున్నాడు దామోదరం. కార్యార్థమై పయనమైన దామోదరాన్ని చూస్తే సంజీవికై బయలుదేరిన హనుమంతులవారు జ్ఞాపకానికి వస్తారు

మర్నాడు దొడ్లో నీళ్ళుపోసుకోబోతున్న ఆచార్యుల మాస్టారుకు దామోదరం పెట్టిన "మాస్టారు" కేక వినపడ్డది. ఆయన ఒక్క ఉదుటన ఇవతలకు వచ్చారు. ఇక ఆచార్యులు వారిభార్యచిన్న గుడ్డకట్టుకొని పులుసు కలియబెడుతున్నదల్లా తన "కోరికల పంటలు" వచ్చాయని సంబరపడి, వీధితలుపు వారగా కొంగులాగి ఒకచేతో పట్టుకొని మరోచేత్తో గరిటె పుచ్చుకొని వీధిలోకి చూసింది.

రెండెడ్ల బండివాడు అమాంతం బండిని లేవనెత్తి అరటి పిలకల్ని గుమ్మరించాడు. కింద ఒకటికాదు, రెండుకాదు, తోటకు సరిపడే పిలకలు! ఆచార్యులు వారికి నోట మాట పెగలలేదు ఆచార్యుల వారి భార్య కన్నులు చెదిరినట్లు కనపడ్డాయి తనచుట్టూ అరటి పిలకలు గుండ్రంగా తిరుగుతూ "చాకలిబాన" ఆట ఆడుకుంటున్నట్లనిపించింది. దామోదరం, ఒకకాలు ఒక అరటి పిలకమీద రీవిగాఉంచి, మాంత్రికుడులా నుంచున్నాడు!

ఆచార్యుల వారు తువ్వాలుతో ఉన్నట్లు గాని, దొడ్లో నీళ్ళు చల్లారతాయనిగాని ఆయనను, బండివాడు, "నన్ను పంపించడయ్యా" అన్నంతవరకు తెలియదు. "ఏమిటీ?" అన్నట్లు చూశారు బండి అబ్బాయివైపు. బాడుగ డబ్బులు అర్ధరూపాయి ఇమ్మన్నాడు బండివాడు ఇక చేసేదిలేక.. లోపలికి పోయి అర్ధ రూపాయి తీసుకువచ్చి ఇచ్చాడు పోతున్న బండివాణ్ణి ఆపి... "ఇదుగో ఇవి తీసుకుపోయి దూరంగా పారేయి, ఇంకో పావలా ఇస్తాను" అని వేరొక పావలా ఇచ్చాడు. భార్య వారించబోయింది. బండివాడు ముసి ముసి నవ్వులు నవ్వుతూ ఎత్తుకోబోతున్నాడు ఆవిడ కోరిన పంటల్ని. భార్య మాటలు ఖాతరు చేయలేదు. ఆయన చుర్రుమన్నాడు

"లక్క పిడతంతదొడ్డి. ఎందుకు ఇవన్నీ.. నాయనా. దామోదరం వెళ్ళిరా! నీదీ బుద్ధి తక్కువ రెండు పిలకలు పట్రా అంటే లారీకు పట్టుకు వచ్చావు" దామోదరం చిన్న బుచ్చుకొని బాధగా వెళ్ళిపోయాడు.

ఆచార్యులవారు మెట్లుదిగి వచ్చివ బుల్లి పిలకల్ని రెండు తీసుకొని దొడ్లోకి వెళ్ళిపోయారు విసురుగా! ఆవిడ గభాలున కిందకు దిగి మరోమూడు పిలకల్ని అందిపుచ్చుకొని వంటింట్లో దాచుకొంది!

ఇంతకీ దామోదరం గురుభక్తి మోతాదు మించింది ఆచార్యులవారి దగ్గర! ★

Printec anc Publishec for Nageswara Rac Estates (Private) Ltd, by S Radha krishna at
The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street Madras-1 Editor S Sambhu Prasad



....నిలవరో బండివాడా!

—ఫొటో : పి. వి. నారాయణ్]

# ఆరోగ్యమునందు ప్రీతిగలవారు ఎల్లప్పుడూ లైఫ్‌బాయ్‌తో స్నానము చేయుదురు

ఆరోగ్యము కొరకు ఆటలు ఆడుట అవశ్యకమైయున్నది — అయితే ఆటయందుగాని లేక పనియందుగాని మనము ఎల్లప్పుడూ మురికిగా నగుదుము మురికిలో వ్యాధి కారకములగు క్రిములున్నవి వాటివల్ల మన ఆరోగ్యమునకు ఎడతెగని ప్రమాదమున్నది. లైఫ్‌బాయ్ సబ్బు మురికిలోని క్రిములను కడిగివేసి మిమ్ములను రక్షించును.

లైఫ్‌బాయ్ సబ్బుతో ప్రతిరోజూ స్నానము **చేసి** మురికిలోని క్రిముల బారి నుండి మీ ఆరోగ్యమును కాపాడుకొనుడు, ఇందువల్ల మీరు మరల హాయిగా నుందురు.




L T 266-X 52 TL

హిందూస్థాన్ లీవర్ లిమిటెడ్ బొంబాయి వారి ఒక తయారు.

## కథారచనలో పోటీ: రచయితలకు సదవకాశం

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

సంక్రాంతిసంచికలో ప్రచురణకు

**[15-1-1958]**

## "చంద్రలోక యాత్ర"

అనే విషయం ఆధారంగా తీసుకొని ఆ లోకంలోని ఊహామాత్రమైన
చిత్ర విచిత్రానుభవాలను వర్ణించే

## ఉత్తమ కథకు

## రు 50 లు బహుమానం

రచన వారపత్రికలో నాల్గుపేజీలకు తగ్గకుండా, ఆరుపేజీలకు
మించకుండా వుండాలి

రచనలు మా కార్యాలయానికి **డిసెంబరు 20 లోగా** చేరాలి.

తరువాత పంపేవాటిని పోటీకి స్వీకరించము.

సంవత్సర చందా
రు. 13-0-0
విడిప్రతిక 25న.పై.

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

సంపుటము 52
సంచిక 13
20-11-57

Founder : K. NAGESWARA RAO

హేవిళంబి కార్తీకం, బహుళ చతుర్దశి బుధవారం

 విషయానుక్రమణిక 

ముఖచిత్రం !
'పోలీస్' చిత్రంలో
మధుబాల

★



## అంబపల్కు....

[కొత్తరకం జానపదగేయం]

అంబపల్కు జగదాంబాపల్కు !
కంబుకంఠి కరుణార్ద్రహృదయరో
పొలిమేరల్లో పోలేరమ్మ
మూలనువున్నా ముత్యాలమ్మ
పలుకు పలుకుడీ పెద్దమ్మల్లూ
అలుకవీడుడీ పెద్దమ్మల్లూ
అద్దద్దా అదిగో బాబూ
పెద్దగ అరుస్తు పడమటి నుండీ
కారు నల్లనీ మేఘమొచ్చెనూ
మేఘములోనా మూలను నక్కి
అల్లదిగదిగో వచ్చిందండీ!
తెల్లభూతమే కళ్ళురుముతూ!
ఆటు తర్వాతా యేమి జరిగెనూ ?
యెటు జూసినమరి యేమున్నాదీ ?
తల్లి భారతి చల్లటి ఇల్లే
గుల్లగుల్లగా అయిపోయిందీ !
కట్టుబట్టకే కరువైనాదీ !
పొట్టకూటికే తిప్పలు వచ్చాయ్ !
ముసిముసినవ్వుల మురిపించేటీ
పసిపిల్లలకూ పాలు దొరకవూ !
యిది చూశారూ యింట్లో అందరు;
పదిమందియునూ చేతులు కలిపిరి

గాంధీతాతా నెహ్రూమామా
ముందుకుదూకీ మరియేమన్నరు ?
తెల్లభూతమే పోవాలన్నరు;
యిల్లు చల్లగా ఉండాలన్నరు;
అందుకోసమే జైళ్ళకువెళ్ళి
బందిఖానలో బాధలు పడినరు
తాతలగర్జన కదిరిభూతమూ
తట్టాబుట్టా సర్దుకొన్నదీ
బిస్తర్ గిస్తర్ పట్టుకొన్నది
పడమటిదిక్కుకి చలోయన్నదీ !
అటుతర్వాతా యేమి జరిగెనూ ?
అద్దద్దా శ్రద్ధగ వినరా !
వనకటి చీకటి పోయిందండీ!
వెన్నెలదినాలు వచ్చాయండీ !
అంతటిలోనే సరిపోయిందా ?
అంతా చక్కగ అయిపోయిందా ?

ఆకటి బాధలు పోవంగానూ
అందరు సుఖముగ వుండంగానూ
అందరు కలసీ కదలాలండీ;
ఘనముగ సాయం చేయాలండీ;
ప్రభుత్వానికి అండగనిలిచీ
భూదానాన్నీ పొందుగయిచ్చీ
శ్రమదానాన్నీ చక్కగచేసీ
భారతదేశము నంతయుకూడా
బంగరుభూమిగ చేద్దామండీ. ★

★ లక్ష్మీకాంతమోహన్ ★

# నెహ్రూ పుట్టినరోజు

మొన్న 14 వ తేదీతో శ్రీ జవాహర్‌లాల్ నెహ్రూకు 68 ఏళ్ళు నిండి, 69 వ సంవత్సరం ప్రవేశించింది. తన వయస్సు ఇంత అని జ్ఞాపకం చేసుకోవడం నెహ్రూకు ఇష్టం ఉండదుగాని, భారత ప్రజలు, ఇతర దేశాల్లో ఉన్న ఆయన స్నేహితులు, అభిమానులు ప్రతి నవంబరు 14 నాడూ నెహ్రూ ఇంకా పది కాలాల పాటు చల్లగా ఉండాలి ఆరోగ్యంగా ఉత్సాహంగా ఉండాలి అని తప్పకుండా కోరుకుంటూరు.

నెహ్రూ భారత దేశానికే కాదు, ఆసియా ఖండానికే భాగ్యవిధాత. మహాత్మా గాంధీ స్వాతంత్ర్యంకోసం ఏమార్గం అవలంబించారో ఆమార్గమే అనుసరించి భారత దేశాన్ని భాగ్యవంతమైన, శాంతి ప్రియమైన, సర్వ స్వతంత్ర ప్రజాస్వామిక దేశంగా నిర్మించడానికి నెహ్రూ ప్రయత్నిస్తున్నారు కొందరు కొందరు ఆరోపించినట్లు నెహ్రూ ఆడంబరంకోసమే గాంధీ తత్వం చేపట్టలేదు. ప్రాచీన సంస్కృతి పునాదులను సంరక్షించుకుంటూనే దేశాన్ని శీఘ్రంగా అభివృద్ధి చేయాలని ఆయన సంకల్పం. అయితే ఆచరణలో ఇతర ఆసియన్ రాజకీయ నాయకులను ఎదుర్కొన్నట్లే అనేక సమస్యలు నెహ్రూను ఎదుర్కొంటున్నాయి. ఉదాహరణకి,—నిరక్షరులైన కార్మికులను పెట్టుకుని ఉత్పత్తి అభివృద్ధి చేయించాలి; పరిశ్రమలలో పొదుపుగా అధికోత్పత్తికి ప్రయత్నిస్తూనే నిరుద్యోగ సమస్యను పరిష్కరించాలి సోషలిస్టు సమాజ స్థాపనకు ప్రయత్నిస్తూ కుల, మతవిభేదాలను రూపుమాపాలి. ఈసమస్యలను ఆయన ఎట్లా ఎదుర్కొంటున్నదీ, ఆయన ఉత్సాహశక్తి దేశాన్ని ఎలా ఉత్తేజపరిచిందీ అందరికీ తెలిసినదే. ఆయన జీవితము, ఆయన దేశభక్తి, ఆసియా, ఆఫ్రికాలలోని పీడితప్రజల విముక్తికి ఆయనచేసిన కృషి, ఇప్పుడాయన ప్రపంచశాంతికి చేస్తున్న నిరంతరకృషి—ఇవన్నీ ఈనాటి యువకులకు మార్గదర్శకమైన ఆదర్శాలైనాయి.

ఆయన స్వతహాగా కొంచెం బిడియంగల మనిషి; గంభీరుడు హారోలో చదువుకునే రోజుల్లో తనేమిటో తన చదువేమిటో తప్ప ఆటపాటల్లోనూ, విందు వినోదాల్లోనూ పాలొనేవారు కాదు. అయితే ప్రపంచంలో జరిగే విశేషాలను ఎప్పటికప్పుడు తెలుసుకొనే ఆసక్తిమాత్రం ఆయనకి మొదటినుంచీ ఉంది. పాశ్చాత్య రాజ్యాల అభివృద్ధిని భారతదేశపు వెనుకబడిన పరిస్థితితో పోల్చిచూసి చాలా బాధపడి, స్వతంత్రతా వేశంతో ఆయన ఉద్రూతలూగిపోయారు. ఆరోజుల్లోనే ఆయనకొక



పుస్తకం బహుమతిగా వచ్చింది. ఇటలీ స్వాతంత్ర్యంకోసం పోరాడిన దేశభక్తుడు గారిబాల్డి జీవితగాథ అది. ఈ పుస్తకం నెహ్రూను ఉత్తేజపరిచి ఉంటుందనడంలో సందేహంలేదు హారోనుంచి కేంబ్రిడ్జి వెళ్ళి సైన్సు, న్యాయవిద్య చదివారు. 1912 లో ఆయన స్వదేశం తిరిగివచ్చి అలహాబాదు హైకోరులో అడ్వొకేటుగా ప్రాక్టీసు ప్రారంభించారు. డా॥ ఆనీ బిసెంట్‌పై ఆయనకు చాలా గౌరవం ఉండేది. ఆమె ప్రారంభించిన హోంరూల్ ఉద్యమం ఆయనను ఆకర్షించింది. కొద్దికాలం దివ్యజ్ఞానమతం కూడా చవిచూసి, అందులోని తాంత్రికవాదం నచ్చక మానివేశారు.

## రాజకీయ జీవితం

ఆరోజుల్లోనె నెహ్రూ తండ్రి శ్రీ మోతీలాల్ నెహ్రూ క్రమక్రమంగా గాంధీమహాత్ముని ఆకర్షణకు లోనవడం ప్రారంభించారు. 1918 లో నెహ్రూ అఖిలభారత కాంగ్రెసు సంఘంలో సభ్యులయ్యారు. (ఈ సభ్యత్వం నేటివరకూ అవిచ్ఛిన్నంగా ఉంది.) 1922 నాటికి రాజకీయోద్యమంలోకి పూర్తిగా ప్రవేశించారు. వేల్సు యువరాజు భారతదేశానికి రావడం అప్పుడే జరిగింది. యువరాజు ఆగమనానికి నిరసనగా సమ్మెలు, హర్తాళ్ జరిపించారు. తత్ఫలితంగా ఆయనకు జైలుశిక్ష పడింది. అదే ఆయన మొదటిసారిగా అరెస్టుకావడం. ఒక ఏడాది అయిన తర్వాత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి అయ్యారు. సోవియెట్ రష్యా సాధిస్తున్న అభివృద్ధిని గూర్చి వార్తలు వినివిని ఆ దేశం ఎప్పుడు చూద్దామా అని ఆయనకు కుతూహలం కలగజొచ్చింది. చివరకు 1924 లో ఆయనకు రష్యా వెళ్ళే అవకాశం కలిగింది. సోవియెట్ యూనియన్‌లో పర్యటించారు పరిశ్రమలలోను, వ్యవసాయంలోను రష్యా సాధించిన అభివృద్ధి ఆయనను ముగ్ధుణ్ణి చేసింది. అప్పటి నుంచి ఆయన సోషలిస్టు అయ్యారు.

సాభా ఆకాలీ ఆందోళన సందర్భంలో నెహ్రూ రెండోసారి అరెస్టయ్యారు. జైలువాసం వలన ఆయన ఆరోగ్యం చెడింది. విశ్రాంతికోసం తండ్రి ఆయనను 1926 లో యూరప్ పంపించారు ఒక ఏడాది తరవాత తిరిగి స్వదేశం వచ్చారు. 1929 లో లాహోరు కాంగ్రెసుకు అధ్యక్షుడయ్యారు 40 ఏళ్ళ వయస్సుకే అంత గౌరవం లభించడం నిజంగా ఆయన ఘనతకు చిహ్నం. ఆయన పేరుప్రతిష్ఠలు స్వదేశంలోను, ఇతరదేశాల్లోను ఇనుమడించాయి. ఆ తరవాత 18 ఏళ్ళలోనూ ఆయనపై ఒకవంక భారతదేశమంతా అపూర్వ గౌరవాభిమానాలు పెంపొందించుకుంటూనే ఉంది. మరోవంక బ్రిటిష్ ప్రభుత్వం కారాగారశిక్షలు వేస్తూనే ఉంది. మొత్తం మీదఆయనమూడుసార్లు కాంగ్రెసు అధ్యక్షుడయ్యారు. తొమ్మిదిసార్లు జైలుకు వెళ్లారు. గాంధీజీ సాన్నిహిత్యంవల్ల నెహ్రూ ఎన్ని కష్టాలనైనా ధైర్యంతో ఎదుర్కొన్నారు. తండ్రి, తనభార్య పోయిన విచారాన్ని కూడా ఆయన ఎంతో నిబ్బరంతో నిగ్రహించుకోగలిగారు

## వ్యక్తిగా నెహ్రూ

నెహ్రూ ప్రధానిపదవిని నిర్వహిస్తున్నా అదేదో నెత్తిమీద కిరీటంలా ఆయన ఎన్నడూ భావించరు. ఎన్ని త్యాగాలైనా చేసి నెరవేర్చవలసిన బాధ్యతగా భావిస్తారు. ఇంత వయస్సులో కూడా సడలని ఆయన దేహదార్ఢ్యం, ఉత్సాహశక్తి చూసి మనం ఆశ్చర్యపడాల్సిందే ఆయన దినచర్య ఇంకా చిత్రమైనది. ఆదేపనిగా పనిచెయ్యడమేకాక రకరకాల పనులు కూడా ఆయన చేస్తూ ఉంటారు. గడియారం కంటె కరెక్టుగా పనిచేస్తారు పొద్దున 6 గంటలకు లేచి పదినిమిషాలసేపు శీర్షాసనం వేస్తారు.

(6-వ పేజీ చూడండి)




# "రెండు నగరాల కథ"

**శ్రీ కృష్ణ**
[ఆంధ్రపత్రిక ప్రతినిధి]

ఇటీవలి విశేషాలు! ఇద్దరు జర్నలిస్టులు కొత్తగా "రెండు నగరాల కథ" (టేల్ ఆఫ్ టూ సిటీస్") రచించారు ఒక నగరం సిమ్లా, మరొకటి హస్తినాపురం రాష్ట్రపతి సాధుసమాజ వార్షికోత్సవాన్ని ప్రారంభించారు. గాంధీజీ ప్రవచించిన బేసిక్ విద్యావిధానాన్ని ప్రోత్సహించాలని కూడా ప్రభుత్వాన్ని కోరారు. స్నేహ సంబంధాలభివృద్ధి చేసుకునే నిమిత్తందక్షిణ వియత్నామ్ అధ్యక్షుడు ఢిల్లీవచ్చి ఘనమైన స్వాగతం అందుకున్నారు ఢిల్లీ పోలీసుల నుద్దేశించి కొందరు జైనమునులు నీతి వాక్యాలు పలికారు.

లండన్, పారిస్ నగరాల పరిస్థితులను చిత్రిస్తూ చార్లెస్ డికెన్స్ "టేల్ ఆఫ్ టూ సిటీస్" నవల వ్రాశాడు ఈనవలలోని ప్రారంభ వాక్యాలు డికెన్స్ కాలానికేకాక నేటికాలానికికూడా తూచా తప్పకుండా వర్తిస్తాయి అయితే నేను ఉదహరించే "రెండు నగరాల కథ" ఇద్దరు జర్నలిస్టులు రాసిన పుస్తకంకాదు. సిమ్లా నగరాన్ని గూర్చి "అబ్జర్వర్" పత్రికలో విలియం క్లార్క్ అనేఆయన ఒక వ్యాసం వ్రాశాడు. భారత జాతీయవాదమూ, ఎయిర్ కండిషనింగ్ పద్ధతీ కలిసి సిమ్లాను పాడు పెట్టాయని ఆయన వ్రాశాడు అది ఆయన అభిప్రాయమనుకోండి సిమ్లా బ్రిటిష్ వారు కట్టి, వృద్ధిచేసిన నగరం కనుక దాన్ని మనంపాడుపెట్టినపక్షంలో, న్యూఢిల్లీ కూడా అంతేగా! న్యూఢిల్లీలో మే, జూన్ నెలల్లో ఎండ దుర్భరంగా ఉంటుంది ఎయిర్ కండిషనింగ్ కూడా ఈ పరిస్థితిని చల్లబరిచినట్లు లేదు. అందుకే వేసవికాలములో న్యూఢిల్లీ అంతా ఖాళీగా ఉంటుంది. మంత్రులు ఏదో సాకుచెప్పి తమ సభలు, సమావేశాలు చల్లని వేసవి కేంద్రాలకు మార్పించుకుంటూ ఉంటారు అందుచేత సిమ్లా పాడుకావటానికి వేరే కారణాలుండి ఉంటాయి. సిమ్లా అందరికీ అందుబాటులో లేకపోవటం ఒక కారణం కాని అసలు కారణం నిర్లక్ష్యం న్యూఢిల్లీ నుంచి ప్రభుత్వ కార్యాలయాలను ఇతర ప్రదేశాలకు మార్చాలనే పథకం ప్రదేశ్ నుంచీ అలాగే న్యూఢిల్లీలో ఉంది తను కట్టుకున్న "కోట"నువిడిచిపెట్టి పోవటం ఏ మంత్రికీ ఇష్టంలేదు ముఖ్యమైనకార్యాలయాలసంగతి సరేకాని అంత ముఖ్యంకాని వాటిని కూడా ఢిల్లీలోనే ఎందుకుంచాలో అర్థం కావటంలేదు. ఈ విధానం పన్నులు చెల్లించే ప్రజలమీద రెండంచుల కత్తిలాగా పడుతోంది ఒకపక్కన కోట్లకొద్దీ ఖర్చుపెట్టి న్యూఢిల్లీలో కార్యాలయాలు, నివాస గృహాలు కట్టేస్తున్నారు. మరోప్రక్కన కోట్లకొద్దీ ఖర్చుచేసి కట్టిన భవనాలు శిథిలమవుతూన్నాయి. సామ్యవాద పద్ధతిలో నడిచే శ్రేయోరాజ్య 'వ్యవస్థ' అవస్థ ఇది! వ్యయకర్తనం ప్రవర్తనం ఇది!

మరొక జర్నలిస్టు ఒకానొక భారతీయ దినపత్రికలో హస్తినాపురం గూర్చి ఒక వ్యాసం వ్రాశాడు. మహాభారత ప్రసిద్ధమైన ఆ పట్టణమే ఇది! ఇటీవలిదాకా ఇది మామూలు పెద్ద పల్లెటూరుగా ఉండేది. జైనులకు ఇది యాత్రాస్థలం. పునరావాసశాఖ శ్రీ ఏ. పి. జైన్ అధ్వర్యంలో ఉండే రోజుల్లో ఈ గ్రామాన్ని కాందిశీకులకు నివాసయోగ్యమైన పట్టణంగా వృద్ధి చేయాలని కొందరు మేధావంతులకు ఆలోచన తట్టింది పైన చెప్పిన వార్తాపత్రికలో వ్యాసం ప్రకారం, హస్తినాపురం చక్కని పట్టణంగా మారిందనీ, విశాలమైన రోడ్లూ, ఇతర సౌకర్యాలు ఏర్పడ్డాయనీ తెలుస్తోంది. అన్నీ ఉన్నాయిగాని జనం మాత్రం లేరు. ఓ పరిశ్రమ, వర్తకం, రైలుస్టేషనూ ఏపాడూ లేని ఆ ఊళ్ళో స్థిరపడడానికి ఒక్క కాందిశీకుడైనా ఒప్పుకున్న పాపాన పోలేదు హస్తినాపురం బాగుచేయడానికి కోటి రూపాయలదాకా ఖర్చయింది. కాని చివరకి బాగుపడింది జైనమతం! ఈ ఖర్చుకు ఎవరు కారకులో, ఇటువంటి ఆలోచన అసలు ఎవరికి కలిగిందో, అసలు ఆ ఊళ్ళో జనం ఏ విధంగా నివసిస్తారని అనుకున్నారో, ఇప్పుడా నిర్జననగరాన్ని ఏం చేద్దామనుకుంటున్నారో ఎవరికి తెలుసు?

* * *

"గాంధీజీ సూచించిన ప్రాతిపదిక విద్యావిధానాన్ని ప్రభుత్వం అంగీకరించా"లని రాష్ట్రపతి ఉద్బోధ చేసినట్లు పత్రికల్లో వార్త పడింది గుజరాత్ విద్యాపీఠం సమావేశంలో ఆయన ఈ ఉద్బోధ చేశారు. ఆ విద్యాపీఠానికి ఆయన అధ్యక్షుడు (చాన్సెలర్) అందుచేత ఆయనఅభిప్రాయాలు కొంత అయోమయావస్థ కల్పించాయి. రాష్ట్రపతే భారత ప్రభుత్వాధిపతి. ఆయన పార్లమెంటులో ప్రసంగించేటప్పుడు "నా ప్రభుత్వము", "నా ప్రధాన మంత్రి" అని అంటూ ఉంటారు. ఇది రాజ్యాంగవిహితమైన ఆచారం. ఇప్పుడాయన గాంధీ విద్యావిధానాన్ని

> **ముఖ్య గమనిక**
> 16 వ పేజీలోని కథ శీర్షిక "భయం" అనీ, 32 వ పేజీలోని కథ శీర్షిక "దొరగారి అల్పాహారం" అనీ పాఠకులు గమనించ ప్రార్థన.

## 27-11-57 సంచికలో:
# ఆత్మహత్యలు ఆడవాళ్ళలోనే ఎందుకు ఎక్కువ?
### అనే ప్రత్యేకవ్యాసం

అంగీకరించాలని ప్రభుత్వాన్ని కోరాయీ అంటే, తన్ను తను కోరుకున్నారనే గదా? అయినప్పుడు బేసిక్ విద్యా విధానాన్ని ఆయనే అంగీకరించి ఉండవచ్చును గదా?

ఆయోమయావస్థకు మరో కారణం ఏమిటంటే, ప్రాతిపదిక విద్యావిధానం సరే, బాగానే ఉంది; అయితే ఇది ఎవరి కోసం? న్యూఢిల్లీలో సెంట్ కొలంబియా హైస్కూలుకి సాయంత్రం క్లాసులు విడిచి పెట్టేటప్పుడు వెళ్లిచూస్తే బోలెడు కార్లు కనిపిస్తాయి. వాటిలో అశోక చక్రంజెండా లెగిరే కార్లు ఎన్నో ఉంటాయి ఉన్నతాధికారి అయిన ఒక కాంగ్రెసు వాది తన కుమారుణ్ణి హిందీచెప్పని పాఠశాలలో చేర్పించారు. ఇక ఈ దేశంలో ప్రాతిపదిక విద్యా విధానానికి ఏపాటిగౌరవం ఉందీ ఊహించవచ్చు.

* * *

మతాతీత వ్యవస్థను సమర్థించే కొందరు పెద్ద మనుషులు ఈ మధ్య మరీ బహాయిగా మతారాధన చేస్తున్నారు ఏదైనా శంకుస్థాపనోత్సవం వచ్చిందంటే చాలు, బ్రాహ్మణుల సమక్షంలో పూజా తతంగమంతా యథావిధిగాజరిగిపోతోంది. ఉన్నత పదవుల్లోవున్న వ్యక్తులు బ్రాహ్మణుల కాళ్లు కడుగుతున్నట్లో, పూజా పురస్కారాలు చేస్తూ ఉన్నట్లో ఫోటోలు తీయించుకుని పత్రికల్లో వేయించుకుంటున్నారు. రాజ్యాంగం బ్రాహ్మణ పూజలను గుర్తించ లేదు. మరి వీటికయ్యే ఖర్చు ఎవరు భరించేటట్లు? ఖజానాలోంచి తీసి ఖర్చు పెట్టిన ప్రతి పైసకూ పద్దువేసి చూపించడం ప్రభుత్వ పద్ధతి. అందుచేత ఈ పూజలకు ఖర్చయినదంతా పూజలు చేయించిన వ్యక్తి నుంచి రాబట్టుకోవలసిందే.

మరొక విషయం. ప్రధాన మంత్రిని తప్పిస్తే ప్రభుత్వంలోని మిగతా వారంతా ప్రవర్తించే విధానం చూస్తే, ఈ దేశంలో బ్రాహ్మణ మతాన్ని పునరుద్ధరిస్తున్నారనీ, ప్రభుత్వం కూడా ఈమతం పుచ్చుకుందనీ అనిపిస్తుంది. నెహ్రూ ఉండగానే ఇలా జరిగితే, ఆయన తరవాత ఇంకేం జరుగుతుందో ఊహించుకో వచ్చును.

శ్రీ గుల్జారీలాల్ నందా ఆరాధించే ఈ సాధువులందరూ తమతమ మఠాల్లోనూ, దేవాలయాల్లోనూ నిలవఉన్న బంగారం, డబ్బు శ్రీ కృష్ణమాచారి గారికి ఇచ్చేస్తే రెండవ పంచవర్ష ప్రణాళిక సులభంగా విజయవంత మవుతుంది. రాజస్థాన్‌లోని ఒక దేవాలయం చులాగ్గా రెండు ఉక్కు కర్మాగారాలకు డబ్బు సప్లయి చేయగలదు.

శ్రీమతి రూజ్వెల్టు "భారతదేశము, ఉద్బుద్ధప్రాచ్య ఖండము" అనే తన గ్రంథంలో ఒక చోట (195 వ పేజీ) ఇలా వ్రాసింది:

"డా॥ కైలాసనాథ్‌కట్జూ నావైపు చూసి 'నేను ఈపళంగా మంత్రిపదవిని వదిలివేసి, నేనుసంపాదించినదంతా త్యాగంచేసి, ఒక భిక్షాపాత్ర చేత్తోపట్టుకునికూర్చుంటే నాకు ఇప్పటికంటె నూరురెట్లు ఎక్కువపలుకుబడి వస్తుంది,' అన్నారు"

ఇందుకే కాబోలు ఈరోజుల్లో ప్రతివారూ సాధువులను దువ్వుతున్నారు! సాధు సమాజ సమావేశాలకు హాజరయ్యే మంత్రులకు ప్రయాణ ఖర్చులు ప్రజలెందుకు భరించాలీ అని ఆడిటర్ జనరల్ ఆలోచిస్తే బావుండును!

* * *

"పార్లమెంటు వీథిలోని పోలీసు స్టేషనులో చాలమంది పోలీసు అధికారులచేత శ్రీ మునినాగరాజ్ నేడు ప్రమాణస్వీకారం చేయించారు" అని ఒక వార్తను ఒక ఢిల్లీ పత్రిక ప్రకటించింది.

ప్రమాణ స్వీకారానికి పోలీసు సూపరింటెండెంటుకూడా హాజరయ్యారట. దొడ్డిదోవన మతాన్ని ప్రవేశపెట్టడానికిదొక పద్ధతి. ప్రభుత్వోద్యోగి సహజంగా నిజాయితీ కలవాడై ఉండాలి. స్వతహాగాలేని నిజాయితీ, ఉద్యోగ నిబంధనలవల్ల కలగని న్యాయబుద్ధి ఎన్ని ప్రమాణాలు చేస్తేమాత్రం వస్తుందా? ఇంకో విషయం. ప్రమాణం చేయించినాయన జైనముని. ఆయన దగ్గిర ప్రమాణం చేసిన ముస్లిం, సిక్కు, బ్రాహ్మణ పోలీసులు ప్రమాణం నిలబెట్టుకుంటారని హామీ ఏముంది? ప్రమాణాలు చేయించేందుకు పోలీసు స్టేషనులోకి "మునుల్ని ఋషుల్ని" తీసుకురావడమూ బాగాలేదు; ఈ బాగాలేని పనికి పత్రికల్లో పబ్లిసిటీ ఇవ్వడమూ బాగాలేదు. ★

## నెహ్రూ పుట్టినరోజు

(3-వ పేజీ తరువాయి)

తరవాత కాసేపు గుర్రపుస్వారీ. స్నానం చేసి, తేలికగా ఏదన్నా తింటారు. అంతే. ఆఫీసుకు తయారు. తన మంత్రులందరికంటే ఆయనే ముందుగా తయారవుతారు ఆఫీసులో బోలెడు ఉత్తరాలు, టెలిగ్రాములు, ఫైళ్ళు ఎదురు చూస్తుంటాయి. ఇంటర్వ్యూకోసం వచ్చేవాళ్ళులెక్కలేదు. అన్నీ చూసుకుని, అందరితో మాట్లాడి, సాగనంపుతారు. మంత్రివర్గంతో సమావేశాలు, పార్లమెంటు ఉంటే దానికి హాజరుకావడం ఇవన్నీ ఉంటాయి. ఇంటికి వచ్చి భోజనంచేసి మళ్ళీ పనిలో మునుగుతారు. రాత్రి ఒంటిగంటదాకా పనే. రోజుకు అయిదుగంటలే నిద్ర. ఒక్కొక్కసారి ఇంకా తక్కువే. రాజకీయ, వేదాంత, శాస్త్రగ్రంథాలు చదువుతారు. కవిత్వము కూడా ఇష్టమే. నవలలంటే పెద్ద ఆసక్తి లేదు. పిల్లలన్నా, పువ్వులన్నా, పెంపుడు జంతువులన్నా మక్కువ.

నెహ్రూలో చిన్న చిన్న లోపాలు లేకపోలేదు. లోపాలులేని మానవుడే వుండడు. ఆయన వ్యక్తిత్వానికి అసలు ఈ చిన్న లోపాలే కొంత ప్రత్యేకతను, ఆకర్షణను కలుగజేస్తాయి. మనిషికి పట్టుదలజాస్తి అనీ, అప్పుడప్పుడు ఏకాకితనం వస్తుందనీ, ముక్కోపం ఉందనీ, అతిశయం ఉందనీ, ఆధ్యాత్మికచింతన లేదనీ విమర్శకులు అంటూ ఉంటారు. కాని ఆయన వంశం, ఆభిజాత్యం ఇంగ్లీషుపద్ధతులలో పెరగడం, మొండి సాహసం మొదలైనవి గుర్తుంచుకొని, ఆయన గాంధీజీ ప్రభావంవలన ఏవిధంగా మారిందీ, ఎంత త్యాగశీలుడు అయినదీ, దేశభక్తుడైనదీ చూస్తే ఆయనలో లోపాలన్నీ తొందరగా పనులు కావాలనే ఆవేశంవల్లనే ఏర్పడినట్లు గ్రహించగలం. మూర్ఖుల్ని, భజనగాళ్ళనీ సహించే గడుసుదనం ఆయనలో లేదు.

స్వదేశాభివృద్ధి ఆయనలక్ష్యం. ఆ అభివృద్ధిని క్రమంగా, చురుగ్గా సాధించాలని ఆయన ఆశయం. గొప్పపనులను గొప్పగా చెయ్యాలనే మనస్తత్వం ఆయనది. మనిషి మేరుపర్వతంలాంటివాడు. భారతదేశం ప్రపంచంలో గొప్పదేశాల్లో ఒకటిగా పరిగణించబడడానికి ఆయనే ముఖ్యకారణం ★

[రచన: పి. ఎస్. నారాయణరావు—
ఇండియన్ ప్రెస్ సర్వీస్]

# ధ్రువోపాఖ్యానం



"అమ్మా, అత్తయ్య వచ్చింది" అని ఒక్క కేక వేశాడు సావిట్లో చదువుకుంటున్న రఘు.

లోపలినుండి మా మరదలు, పిల్లలు బిలబిల్లాడుతూ వచ్చారు సావిట్లోకి.

"అత్తయ్యొచ్చిందోయ్, మా అత్తయ్యొచ్చిందోయ్" అంటూ గంతులేసుకుంటూ చిన్న పిల్లలిద్దరూ నా కాళ్లు చుట్టేశారు. పెద్ద పిల్ల ఒక్క సామాను లోపల పెట్టించి, పంపేసింది రిక్షావాణ్ణి.

చిన్న పిల్లవాడు శ్రీను ఆరేళ్లవాడు ఆఖరి పిల్ల పూర్ణ నాలుగేళ్లది.

నలుగురు పిల్లలూ చుట్టూచేరి ఊపిరిసలప నియ్యకుండా తలోమాటా అడుగుతున్నారు. ప్రశ్నల వర్షం కురిపిస్తున్నారు. చిన్న పిల్లలిద్దరూ గట్టిగా పట్టేసుకుని కదలనియ్యడం లేదు నన్ను.

పిల్లల కోడిలా గప్పున్న నన్ను చూసి మా మరదలు నవ్వుతుంది.

"లోపలికి రానియ్యండి అత్తయ్యను. కాళ్లు కడుక్కోనివ్వండి" అంది పిల్లల్ని.

"ఆ మర్యాదలతో వాళ్లకేం పని? నేను వచ్చానని బ్రహ్మానంద పడిపోతున్నారు. పాపం వాళ్లు. రెండేళ్ళయిందివీళ్ళనిచూసి. కళ్లు కాయలు కాసినట్లయిపోయాయి వీళ్ళని చూడ్డానికి ఇప్పటికిగాని తెరిపి అవలేదు రావడానికి" అంటూ వాళ్ళని తీసుకునే లోపలికి వెళ్ళాను.

పెట్టె తీసి పెద్ద పిల్లవాడికి, పెద్ద పిల్లకు కథల పుస్తకాలు రెండు పెద్ద బొమ్మలు యిచ్చాను. శ్రీనుకి లాగు, చొక్కా, ఒక రైలు యిచ్చాను. పూర్ణకి పువ్వులగౌను, ఒక విమానం యిచ్చాను. వాళ వాళ వస్తువులు తీసుకుని నలుగురు పిల్లలూ వెళ్ళిపోయారు. అప్పటికిగాని మరదలు, నేను యోగక్షేమాలు మాట్లాడుకోటం కాలేదు. తమ్ముడు రావు ఆఫీసుకి వెళ్లాడు. సాయంత్రం గాని రాడు.

ఒక్కా అరగంట అయింది. నేను, మరదలు భోజనంచేసి, తాంబూలం వేసుకుంటూ కూర్చున్నాం.

ఏడుస్తూ వచ్చింది పూర్ణ.

"ఏం?" అన్నాను ఒళ్ళో కూర్చోపెట్టుకుని.

శ్రీను రైలు యివ్వనన్నాడు. నేను గిల్లు తూంటూంటే వాడు కొట్టాడు." అంది.

తను చేసిన తప్పుని చెప్పకూడదని తెలియని అమాయకత్వం కదా. వాడు కొట్టాడనకుండా తను గిల్లినట్లు, దానికి బదులు కొట్టినట్లు తనే చెప్పేసింది పాపం.

"అయితే నీకు విమానం యిచ్చాను కదా? వాడి రైలెందుకు నీకు?" అన్నాను.

"ఆ విమానం నాకు వద్దు" అంది ఖండితంగా.

"మరి వాడి రైలు వాడెందుకిస్తాడు?" అని ప్రశ్నించాను.

## వేదుల మీనాక్షిదేవి

"నా విమానం యిస్తా. నీ రైలు యియ్యమన్నాగా" అంది.

"వాడివ్వనంటే గిల్లుతావా? తప్పుకదమ్మా" అన్నాను.

"రైలు యివ్వకపోతే గిల్లనా మరి?" అని యెదురుప్రశ్న వేసింది పూర్ణ. అది గిల్లడం యెంతమాత్రం తప్పుకానట్లు, పైగా చాలా అవసరమయే గిల్లినట్లు దాని నమ్మకం.

ఏమీ యెరగనట్లు వచ్చి శ్రీను పొరుగింటి ముత్తైదువలాగ గుమ్మందగ్గిర నిలబడి, బుగ్గను చెయ్యి పెట్టుకుని చూస్తున్నాడు.

"ఏంరా? అది గిల్లితే మాత్రం చిన్నది కదా. నువ్వు పెద్దవాడివి కొట్టవచ్చునా?" అంది వాళ్ళమ్మ.

"అత్తయ్య దానికి విమానం, నాకు రైలు యిచ్చింది కదా. మరి నా రైలు అది అడగడము తప్పుకాదా? అడగడం కాకుండా ఇవ్వనంటే గిల్లింది. నేను కొట్టాను. చెల్లుకి చెల్లు అయిపోయింది. నేను అన్నయ్యంత పెద్దవాడినా?" అన్నాడు శ్రీను.

"అత్తయ్య యిచ్చినవస్తులనుగురించి దెబ్బలాడుకుంటే ఆవిడ యేమనుకుంటారు? దెబ్బలాడుకుంటే యింకెప్పుడూ యేవీ తేవద్దని చెబుతాను ఆవిడతో" అంది వాళ్ళ అమ్మ

"చూడు అత్తా. మరేమో అమ్మ యెప్పుడూ పూర్ణనే వెనకేసుకొస్తుంది. నన్ను తిడుతుంది. అది యేది యిమ్మంటే అది యిచ్చేసి దణ్ణంపెట్టెయ్యాలిట. నువ్విచ్చిన రైలు యెంతో ముద్దొస్తోంది. నేనెందుకిస్తాను" అనివాళ్ళమ్మమీద నేరం చెప్పి రైలు యివ్వనని ఖండితంగా చెప్పాడు యేడుస్తూనే.

వాడిని దగ్గరకు తీసుకొన్నాను. వాడి ఏడుపు మరోస్థాయి హెచ్చింది. నేను ఓదారుస్తున్నాను. ఇంతలో నా ఒళ్లో కూర్చున్న పూర్ణ గభీమని లేచి చక్కాపోయింది వాళ్ళమ్మ దగ్గిరకి.

"అదేమే అలా వెళ్లిపోయావు?" అన్నాను ఆశ్చర్యపడి.

"వాడు కూర్చున్నాడుగా, నేనెందుకు?" అంది పూర్ణ.

మామరదలకేసి ప్రశ్నార్థకంగా చూశాను ఏమిటన్నట్లు.

"అసలువచ్చిన గొడవే అదండీ ఇద్దరికీ పడదు. వాడున్నచోట అదివుండదు. అది వున్నచోట వాడువుండడు. ఒకరు నడిచిన త్రోవను రెండోవారు నడవరు. ఎంతమంచి వస్తువులైనా సరే వాళ్ళది వాళ్ళకు నచ్చదు. ఎదటివాళ్ళ వస్తువుకోసం పేచీ ఒకవాడు గడ్డిపోచకోసం పేచీ పడ్తారు. అప్పుడు నేను మరోగడ్డిపోచ అలాంటిదే తెచ్చియిస్తే పొడుగనీ, వెడల్పనీ పేచీ పెట్టి యెలాగో సమాధానపడ్డం బ్రహ్మాండమైంది" అంది మరదలు.

"అయ్యో యింత పేచీ పెడతారని తెలిస్తే



ఒకరకమే యిద్దరికీ తెద్దును తగాదా కొని తెచ్చినట్లయింది సొమ్ము పెట్టి" అన్నాను.

"సాయంత్రం రైలు తెప్పిస్తాను బజారు నుండి" అని పిల్లని సమాధాన పరచి పంపాను.

"అయితే యీ రైలు నాకు వద్దే వద్దు" అన్నాడు శ్రీను.

"ఎందుచేత ?" అన్నాను.

"దానికి విమానం, రైలు రెండు అవుతాయి" అన్నాడు.

"మరైతే నీకు విమానం కూడా తెప్పిస్తాను నీకూ రెండు అవుతాయి అప్పుడు. సరేనా ?" అన్నాను.

"అచ్ఛా, అచ్ఛా. నాకు రెండోయ్" అంటూ ఆడుకుందుకు చక్కాపోయాడు శ్రీను.

"మీరు యెన్ని తెప్పించినా సరే వాళ్ళ పేచీ తప్పదు. రెండు రైళ్లు ఒక్కలాగ వుండాలి. రెండు విమానాలు ఒక్కలాగ వుండాలి. ఏ కొస్తతేడా లేకుండా ఒక్కలాగ దొరకడం కుదరదుకదా. ఇప్పుడు దీని కొసమేకాదు. ఎందుకో అందుకు పేచీ లేనిదే వాళ్లకి పొద్దుపోదు" అంది మరదలు.

"నేనెలాగో సముదాయిస్తాను నేనున్న నాలుగు రోజులు" అన్నాను.

* * *

దీపాలవేళకి మా తమ్ముడు రావువచ్చాడు. "అక్కయ్య యెప్పుడు వచ్చింది" అంటూ కాళ్ళు కడుక్కువచ్చి చిన్న పిల్లాడులాగ దగ్గిర కూర్చున్నాడు.

చిన్నపిల్లలిద్దరు నన్ను అన్నం కలిపిపెట్టమన్నారు. అంటే యిద్దరూ కలిపి కాదు. వేరే వేరేనే అడిగారు. ఇద్దరికీ వేరుగా కలపడం యెలాగ అని ఒక్క కంచంలోనే కలిపి పెడతానన్నాను.

"పులినీ మేకనీ ఓ కంచంలో పాలు త్రాగించినట్లు" అన్నాడు తమ్ముడు నవ్వుతూ.

కొత్తగా వచ్చాను గనుక ఒక కంచంలో కలపడానికి అంగీకరించినా, రెండు షరతులు ప్రతిపాదించి మరీ అంగీకరించారు. ఒకటి ఎవ్వరూ కంచం ముట్టుకొనకూడదు నేను తప్ప. (పూర్ణ అని శ్రీను వుహా. శ్రీను అని పూర్ణ అభిప్రాయం) రెండు. వరసగా యిద్దరినీ కూర్చోపెట్టక పోవడం ఈ రెండింటికీ అంగీకరించాను. నాకు చెరోక ప్రక్క చెరోకరినీ కూర్చోపెట్టుకుని నేనే కలిపి వాళ్ల చేతులలో పెట్టడం అన్నమాట.

భోజన మధ్యంలో "అత్తయ్యోయ్ నా కొత్తపీట" అన్నాడు శ్రీను.

"నా కొత్త గ్లాసు యిదిగో" అంది నోటి నిండా అన్నంతో పూర్ణ.

"రైలు, విమానంలాగ పేచీ లేకుండా ఒక పీటతోను, ఒక గ్లాసుతోను తృప్తిపడ్డట్టున్నారే" అన్నాను ఆశ్చర్యపోతూ.

"దీనికే పేచీపెట్టాం. కాని, మా నాన్న చీటీలు వేశాడు" అన్నాడు శ్రీను.

"చీటిలేమిటి?" అన్నాను.

"మా నాన్న రెండు కాగితం ముక్కలు తెచ్చి పీటబొమ్మ ఓ కాగితం ముక్కమీద గ్లాసు బొమ్మ ఓ కాగితంముక్కమీద వేశాడు. రెండూ గిలకరించి క్రిందపడేశాడు. కళ్లు మూసుకుని మేం తీసుకున్నాం. ఎవరికే బొమ్మవస్తే ఆ వస్తువు వాళ్లది అన్నాడు నాన్న. నాకు పీటబొమ్మ, పూర్ణకి గ్లాసు బొమ్మ వచ్చింది. అప్పటినించి పీట నేను, గ్లాసు అదివాడుకుంటున్నాం. దానికి చదువు రాదుకదూ. అందుకని బొమ్మవేశాడు నాన్న" అని కళ్ళు తిప్పుకుంటూ చెప్పాడు శ్రీను. పైగా దానికి చదువురాదని చెప్పడంలో తను విద్యావంతుడైనట్టు చెప్పుకోవడం మరోక విశేషం. పీడీమధ్య అతురాభ్యాసమై ఒకటవ తరగతి పుస్తకం చదువుతున్నాడు ప్రైవేటు మేష్టరు దగ్గిర. అది చెప్పడం కోసం యీ తిప్పలన్నీను.

"భలే బాగుంది వుపాయం. రైలు, విమానం కూడా అలాచేద్దాం మళ్ళీ అలాంటివి తెప్పించడం యెందుకు! మరోమాటు మీ యిద్దరికీ ఒక్కలాంటివే బొమ్మలు తెస్తాను" అన్నాను.

శ్రీను, పూర్ణా సంపూర్ణంగీకారం తెలియజేశారు. చీట్లు వేశాం. శ్రీనుకి విమానం, పూర్ణకి రైలు వచ్చింది. శ్రీను ముఖం చిట్లించుకున్నాడు.

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక



## సంక్రాంతి ప్రత్యేక సంచిక

[15-1-1958]



ప్రధానాకర్షణ

### సినిమా శీర్షిక

చలనచిత్ర కళకు, పరిశ్రమకు సంబంధించిన

ప్రత్యేక వ్యాసాలు — చిత్రాలు



రసవంతమైన కథలు, గేయాలు

రమణీయమైన చిత్రాలు, ఫొటోలు



"వనితాలోకం" శీర్షికలో

ప్రత్యేక వ్యాసాలు — చిత్రాలు

★

ముగ్గులు — డిజైన్లు

రచనలు, చిత్రాలు అన్నిటిపైనా "సంక్రాంతి సంచికకు" అని వ్రాయాలి.



**1957 డిసెంబరు 15 లోగానే మాకు చేరాలి.**

# ★ ధ్రువోపాఖ్యానం ★

"అత్తయ్య కొత్తగా వచ్చింది కదూ. అందుచేత" అని సరిపెట్టుకున్నాడు ఏమీ అనకుండా.

* * *

రాత్రి పూర్ణ తల్లిదగ్గిర, శ్రీను తండ్రిదగ్గిర పడుకుంటారు. పొరపాటుననైనా శ్రీను తల్లి దగ్గిరికి రాకూడదు. పూర్ణ తండ్రి దగ్గిరికి పోకూడదు. ఆవిధంగా జరిగిందో రామ రావణ సంగ్రామం, వాలి, సుగ్రీవ యుద్ధం.

నేను వచ్చింది మొదలు పూర్ణ నాదగ్గిర పడుకుంటానని ఒకటే గొడవ, తను పడుకుంటానని శ్రీను పేచీ, "కథ చెప్పేటాక పూర్ణ అమ్మ దగ్గిరకి వెళ్ళిపోతుందిలే" అని వాడిని సమాధానపరచి యిద్దరినీ చెరోక వైపున పడుకోపెట్టుకున్నాను.

పులి మేక, గడ్డిమేటి కథ చెప్పాను ఇద్దరూ నిద్రపోకుండా విన్నారు.

ఉన్నట్టుండి శ్రీను నన్ను గట్టిగా గిల్లాడు "అదేమిరా అలా గిల్లావు నెప్పెట్టింది" అన్నాను.

పాపం వాడు చాలా నొచ్చుకున్నాడు అయ్యో నిన్ను గిల్లానా అత్తా. పూర్ణ అనుకున్నాను." అన్నాడు.

"పూర్ణ అయితేమాత్రం నొప్పెట్టదూ అంతగట్టిగా గిల్లావుకదా, పాపం చిన్న పిల్ల అది. నిన్నేంచేసింది? కథ వింటోంది బుద్ధిగా నీలాగే" అన్నాను. నీలాగే అన్నాను గనుక సరిపోయిందిగాని లేకపోతే అది బుద్ధిగా వింటోందంటే యెంతైనా పేచీ వచ్చేదే.

"సరేగాని కథ బోధపడిందా?" అన్నాను విషయం మారుస్తూ.

పూర్ణకి బాగా తెలిసినట్లు లేదు. వూరుకుంది.

"ఓ నాకు తెలిసిపోయింది పులి, మేకనీ ఓచోట పెడితే పులి మేకని తినేస్తుంది. మేకని, గడ్డిమేటినీ ఓచోట పెడితే మేక గడ్డి తినేస్తుంది. అందుచేత కాపువాడు పులినీ, గడ్డినీ అవతలగటున దింపి మళ్లీ యివతలగట్టుకివచ్చి మేకని తీసుకువెళ్ళాడు" అన్నాడు శ్రీను.

"కాపువాడు బలేవాడు" అంటూ కాపువాడిని మెచ్చుకున్నాడు.

"పులి, మేకతో కాపువాడు తిప్పలు పడవలసి వచ్చింది. మీరిద్దరూ అస్తమానం కొట్టుకుంటూంటే మీ అమ్మా నాన్న మీ తగూలు తీర్చలేక బాధపడుతున్నారు. మీరిద్దరూ ఒక చోట చేరకుండా చూసుకోవలసి వస్తోంది. మీరు స్నేహంగా వుండరాదా?" అన్నాను.

శ్రీనుకి ధుర్రున కోపం వచ్చి లేచాడు.

"నేను పులినా?" అన్నాడు.

నువ్వు పులివి కాదు" అన్నాను.

"మరి నేనా"? అంది పూర్ణ బుంగ మూతి పెట్టి.

"నువ్వూ కాదమ్మా" అన్నాను.

ఇద్దరూ దెబ్బలాడుకోకుండా వుంటే మీకు రోజుకి చెరోక రెండు అణాలు యిస్తాను. సావిట్లో కాగితం ముక్కలు పొయ్యకండి పోస్తే వెంటనే తీసిపారెయ్యండి. మీ నాన్నకోసం, యెవరైనా వస్తూంటారు. బాగా వుండదు" అన్నాను.

"సరే" అన్నారు. ఇద్దరూ నాదగ్గిరే నిద్రపోయారు.

* * *

తెల వారింది. కాఫీలయాయి. ఇద్దరూ వచ్చి నా యెదురుగా నిలబడి "బుద్ధిగా వున్నామా?" అన్నారు.

"ఓ" అన్నాను నవ్వుతూ.

భోజనాల వేళలోపుగా నాలుగుసార్లు వచ్చి అడిగారు "బుద్ధిగా వున్నామా" అని.

"ఉన్నారు. ఇలాగే వుండాలి యెప్పుడూ సావిట్లో కాగితంముక్కలున్నాయి నేల మీద తీసిపారేయండి" అన్నాను.

(56-వ పేజీ చూడండి)



# వరదలప్రళయం





ఈ మాసం మొదటివారం సూళ్లూరుపేట, గూడూరు, నాయుడుపేట ప్రాంతంలో బ్రహ్మాండమైన వానలుకురిసి, చెరువులూ, వాగులూ వీకపై వరదలుసంభవించాయి. అనేక గ్రామాలు కొట్టుకుపోయి చాలా ఆస్తినష్టం, వరదల్లో 65 మందికి పైగా జననష్టం కలిగాయి. కలకత్తా-మద్రాసు రైలుమార్గం దెబ్బతినడం మూలంగా సూళ్లూరుపేటలో నిలిచిపోయిన గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్ ప్రయాణీకులను పడవల్లో అక్కంపేటకు చేరవేయడం, అక్కణ్ణించి మద్రాసు ప్రయాణీకులు ప్రత్యేకరైలును ఎక్కుతూ ఉండడం ఈ చిత్రాల్లో చూడవచ్చు.






"తర్వాతికథ చెప్పడానికి వీల్లేదనుకో. అక్కడే కీలకం అంతా ఉంటుంది. అది కాస్తా చెప్పేస్తే, ఆకథని ఎవడేనా కొట్టెయ్యొచ్చు. అందుకని బేరం ఖరారని నమ్మకం కుదిరితేగాని ఎవరూ వివరంగా కథ చెప్పరు" అన్నాడు కొలంబస్.

"మరి నాకు మతిపోతోంది. ఎలాగా?" అన్నాడు రాజా.

"పోతేపోనీ మరేంఫర్వాలేదు. మిగతాకథ విను. అంటే జటాయుకథకాదు. అది రాసిన గిరిగాడికథ. వాడు జాగర్తగానే ఉంచుకున్నాడు. వాడి బ్రోకరు ఫ్రెండు, పెద్దపెద్ద స్టారదగ్గిరా, ప్రొడ్యూసర్ల దగ్గిరా చూచాయగా ఆకథ చెప్పి, దిన్ని ఫలానావాడు రాస్తున్నట్టు, అద్భుతమైన బాక్సాఫీసు ట్రీటుమెంటు చేస్తూన్నట్టూ ఆమాట అతిరహస్యమైనట్టూ, తనకే ఎలాగో తెలిసినట్టూ, నటిస్తూ, మెల్లి మెల్లిగా న్యూస్ ఇస్తూ వచ్చేవాడు. ఒకానొక పెద్దస్టారు అదివిని బాగుందనడం జరిగింది. తక్షణం ఆ బ్రోకరుడు ఓప్రొడ్యూసరు దగ్గిర కెళ్లాడు.

"ఫలానా బాక్సాఫీస్ స్టారికి ఫలానా కథమీద దారుణమైన మోజు ఉంది. ఈ సంగతి ఇంకా ఎవరికీ తెలీదు. మీరు కనక ఆకథ విని కొనుక్కుంటే, ఆస్టారుని సులభంగా బుక్ చేసుకోవచ్చు" అని చెవిలో చెప్పాడు.

ఆప్రొడ్యూసరు ఎంతలావువాడైనా యథాశక్తి ఎగిరి చిన్నగంతు వెయ్యడం సహజం కదా. సిఫార్సు తెచ్చుకోకుండా, కెళ్ళాం బిడ్డల్ని వెంటబెట్టుకువెళ్ళి ఆ స్టారును తన చిత్రంలో వేషం వెయ్యమని బ్రతిమాలే అవసరం లేకుండా, కేవలం ఒక్క కథ కొనడంవల్ల సులాగ్గా బుక్ చేయడానికి వీలవుతోందిగదా మరి.

సరే, అబ్బీ ఆ కథ ఎవరిదోయ్? అన్నాడు. భలానా శేషగిరిగారు రాస్తున్నారు అని చెప్పాడు బ్రోకరు. రైట్ అని ప్రొడ్యూసరు బయల్దేరి వెళ్లాడు. గిరిని అడిగాడు. గిరి ఎంతో సంతోషించాడు. డబ్బు అదీ మాటాడుకున్నారు.

అంతలోకి చిన్న చిక్కొచ్చిపడింది. సదరు ఏర్పాట్లుచేసి పెట్టిన బ్రోకరు సగానికి సగం వాటా యివ్వమన్నాడు గిరిని. నేనింతగా కాన్వాసు చెయ్యకపోతే నీకు దిక్కేమిటి అని పోట్లాడాడు.

"అరే, నాకు ఆ ప్రొడ్యూసరు ఇచ్చిన డబ్బు చాలా కొంచెంకదా. దాన్ని రెండెట్టి భాగించడానికి వీల్లేదే. ఎలా?" అన్నాడు గిరి.

"ఎందుకు వీలుండదు? నా ప్రాపగాండా అప్పనంగా వస్తుందనుకున్నావేం పాపం" అని దబాయించాడు బ్రోకరు.

"అయ్యో. నీకివ్వడానికి నాకేం అభ్యంతరంలేదు. కాని ఆయన నాకిప్పు డిచ్చినది భలా కొంచెం కదా. దాన్ని సగం సగం వాటా వెయ్యడానికి అసలు వీల్లేదు. 'ఇప్పుడిది లాంఛనంగా తీసుకోండి' పిక్చరు రిలీజయ్యాక మిగతాది మీ కిస్తాను అలాని చెప్పాడు ప్రొడ్యూసరుగారు. వృద్ధిలోకి రాదలచుకుంటే ఈ ఛాన్సు వదులుకోవద్దని బెదిరించాడు. అందుకని ఒప్పుకున్నాను" అని మొత్తుకున్నాడు గిరి.

"అదంతా నా కనవసరం. రిలీజయ్యాక వాడేమిస్తాడు. నువ్వేం పుచ్చుకుంటావు. ఇస్తేగిస్తే అదంతా నువ్వే ఉంచుకో. ఇప్పుడిచ్చింది మటుకు సరిసగం వాటా వెయ్యాల్సిందే. వీల్లేదండానికి వీల్లేదు. ఎంతిచ్చాడో తియ్యి ఇవతలికి" అన్నాడు బ్రోకరు. అప్పుడు నేను అక్కడే ఉన్నానులే. అప్పటిదాకా గిరిని తిడుతున్నాను. ఇప్పుడు విడిపాటాటచూస్తే నవ్వాగటం లేదు. ఆఖరికి ఆ గిరికికూడా నవ్వొచ్చేసింది అంత దుఃఖంలోను.

'ఇంద తీసుకో. ఇదే నా తొలి సినిమా ఆర్జన. చావుంటే, చాతనైతే దీన్ని భాగించు రెండుతోటి' అంటూ, గూట్లో పెట్టిన తాంబూలంలోని 'అడ్వాన్సు' తీసి గదిమధ్య పడేశాడు.

'అయ్యబాబోయ్' అన్నాడు బ్రోకరు కొయ్య బారిపోయి. ఎందుచేతనో తెలుసా?

"భవుశా చెక్కు రాసిచ్చి ఉంటాడు ప్రొడ్యూసరు" అన్నాడు రాజా దగ్గిరున్న తెలివితేటలన్నీ వాడేసి.

"నీబొంద. అయామ్ సారీ...మీబొందలు. ఆ ప్రొడ్యూసరుగారు తాంబూలంలో పెట్టి ఇచ్చింది కాష్. హార్డ్ కాష్. 1902 వ సంవత్సరపు గుండుగల రాజాగారి రాగికాసి" అన్నాడు కొలంబస్.

రాజాకి అర్థంకాలేదు. అనక, 'వెళ్ళొస్తా బ్రదర్' అంది అతని మతి.

'1902 వ సంవత్సరపు గుండు ఏమిటండీ? పేటెంటు చేసిన ఫాషనా?" అన్నాడు ఇంకేం తోచక.

'ఆకాలమానం గుండుకు విశేషణం కాదు. కాణీకి. గుండు, కాణీ మీద రాజాగారి బొమ్మకి సంబంధించినది. సదరు గుండుగల రాజాగారి బొమ్మగల కాణీ అన్నమాట. కర్తే

# ★ విక్రమార్కుడి మార్కు సింహాసనం ★

లేని కానీ. దాన్ని రెండువాటాలు వెయ్యడం ఎలా?

'మరేండి, మూడు వెయ్యొచ్చేమో.'

'దమ్మిడీలు దొరకట్లేదుగా. దొరికితే, ఓ దమ్మిడీ కమీషను ఇచ్చి, రెండు తీసుకుని చెరోటి పంచుకోవచ్చు. సర్లె అదెందుకు వీరైతే మాత్రం ఏం చేసుకుంటారు గనక ఆ బ్రోకరు.

కాలుగుతిట్టి, నీపని చెప్తానుండు అని బెదిరించి వెళిపోయాడు. నమ్మ నమ్మకపో బ్రదర్. మూడోనాటికలా "జటాయువు పెళ్లి" అనే పిక్చర్ తీస్తున్నట్లు ఇంకో ప్రొడ్యూసరు ప్రకటించారు.

వీడికలా తట్టిందిరా ఈ అయిడియా అని నేను వాకబు చేద్దునుగదా. జరిగిందేమిటో తెలుసా? మా గిరిదగ్గిర కథ తీసుకున్న ప్రొడ్యూసరు, దాన్ని ఇంకో రైటరుకి చూపించి, డైలాగులూ గట్రారాయమని పేర మాడి పుష్కలంగానే డబ్బిచ్చాట్ట. తీరా కూడి ఆ రైటరు తన ఆప్తమిత్రుడైన ఇంకో ప్రొడ్యూసరుకి దాన్ని అమ్మేశాట్ట. అదేంపనయ్యా అంటే, జటాయువు నీ సొంతఖదా? దాన్ని నాయిష్టంవచ్చినవాడికి అమ్ముకుంటాను అవటా అన్నాట్ట ఆ పెద్దరైటరు. ఇటు గిరిగాడి గోలకి అంతు లేదు. వీడూ, వీడితోపాటు, మొదట వీణ్ణి మోసంచేసిన ప్రొడ్యూసరూ కలిసి జాయింటయిపోయి డ్యూయెట్ అరంభించారు ఆ రెండో పార్టీవాళ్లు అన్నెంచి గోలపెడుతున్నారు. ఇంతట్లోకి చల్లగా ఓ రోజున "జటాయుపెళ్ళి" అనే ది ఎక్స్ ఫిలింస్ వారి నెక్స్ట్ పిక్చరు అంటూ ప్రకటన వచ్చేసింది. ఆ పనిచేసిన ప్రొడ్యూసరు అమాయకుడే. కాని ఈ మాగిరీవాళ్ళు చేసిన గోలతాలూకు పుకారు షికారెళ్లి అతనికి పోకింది. అతను తక్షణం ఇంకో రైటర్ని పురుర్పుకుని తను విన్నకథయావత్తు చెప్పి, ఓ పెద్ద హోటల్లో ఉంచి తాళంపెట్టి, రెండు గంటలసేపులో ఆ కథకి టెంపరరీ ట్రీటుమెంటు రాయించేశాడు. దాన్ని పట్టుకుని, మొటమొదట-ఆ ఖదమీద మోజుపడ్డ స్టార్ తెలుసుగా — అక్కడికెళ్లి చూపించాడు. ఆస్టార్ కి ఈ భాగోతం ఏం తెలుసు? కథ బాగుందని, డబ్బు బాగా వస్తుందని కాంట్రాక్టుమీద సంతకం పెట్టెయ్యడం జరిగింది. వెంటనే ఆ ప్రొడ్యూసరు ఆకథని ఆ సబ్జెక్టుని రిజిష్టరు చేయించేసుకుని ప్రకటన వేసేశాడు. ఇంకేముంది గోవింద.

పిట్టతగవు పిట్టతగవు పిల్లి తీర్చెను. విన్నావా. ఆకథ ఎక్కడ పుట్టింది? ఏ కంపెనీ పెట్టింది? చిత్రంగా లేదు? నువ్వేమిటో సవాలక్షు హెడ్డింగులు వర్ణించావు ఇపుడు. ఇవన్ని నీ వేనని గేరంటీఏమిటి ఇవి దక్కించుకు గట్టెక్కే ప్రజ్ఞఉందా? అన్నాడు కొలంబస్ కథ ముగిస్తూ

జాగర్తగా ఉంటావండి. అసలిలాటి పరిస్థితి రానియ్యనండి అన్నాడు రాజా ధైర్యంగా.

"అయితే ఇది చెప్పు. నువ్వు గిరిగాడి పరిస్థితిలో ఉంటే ఏం చేస్తావు? ఆ సబ్జెక్టుని ఎలా రక్షించుకుంటావు?" అన్నాడు కొలంబస్.

"దాని విషయంలో చేసేదేముంది? నీళ్లో దులుకోడమేనండి... సుభ్భరంగా ఓ సోషలుకథ రాసుకుంటా"

"యూజ్ లెస్ పనికిరావు, సోషల్ స్టోరీ ఎవడికొక్కవాలి కాస్ట్యూమ్ పిక్చరుగురించి మాట్లాడుతూ ఉంటే?... సరేవిను. గిరి ఏం చేశాడో తెలుసా? ఈ గోలమూలానా వాడి పేరు నలుగురికీ తెలిసిందిగా మరి. అందుకని జటాయుసినిమా తీస్తానన్న వాడంటే బాగా కోపం ఉన్న ఇంకోడి దగ్గిర కెళ్ళి సంగతంతా వివరంగా చెప్పి, వాళ్ళు తనదగ్గిర చెక్కేసింది అసలు కథకాదనీ, అది వేరనీ, తనకథలో హీరో సంపాతేకాని జటాయు కాదనీ చెప్పాడు. అసలు వాల్మీకి అయిడియాకూడా అదేనుట. అయ్యా వాల్మీకిగారు మీ జటాయు స్టోరీపిక్చర్ తీస్తాంగాని హీరో ఎవర్ని వెయ్యమంటారూ అని గనక అడిగితే; ఫిచ్చివాళ్లారా సంపాతి నే హీరోగా పెట్టుకోండీ, పిక్చరు హిట్టవుతుంది అని చెప్పేవాడే వాల్మీకి అని చెప్పాడు గిరి. అందుకని సంపాతి హీరోగా ట్రీటుమెంటు ఉందనీ అది మొదలెడితే బెస్టనీ నచ్చచెప్పాడు. అదృష్టం కూడా కలిసొచ్చిన మూలాన ఆప్రొడ్యూసర్ రైటో అనేశాడు; అంతే ఈసారి గుటు చప్పుడు లేకుండా, 'జటాయు' పిక్చర్లో హీరోచేస్తీళ్ల 'సంపాతి' పిక్చరుకి కూడా ఎక్కువ డబ్బుమీద బుక్ చేసి, వరసగా 20 కాల్ షీట్లు కుదిర్చేసుకుని 20 రోజుల్లోనూ సగం పిక్చరులాగి అవతలపారేశారు. ఇంక అవతలి వాళ్లకి అపుడు తెలిసింది సంగతి. వాళ్లింకా షూటింగే మొదలెట్ట లేదు. అపుడు పోటీగా తీసినా లాభం లేదని మానుకున్నారు. తక్షణం వీళ్ళు 'సంపాతి' పేరుమార్చి మళ్ళీ 'జటాయు'వనే పెట్టుకున్నారన్న మాట. ఆ వేషం వేసిన పక్షి జర్మనీలో ట్రైనింగ్ ఐ వచ్చిందిలే. భలే చురుగ్గా యాక్టుచేసి పారేసింది. దాని పార్టను మిగతా దెప్పుడు పూర్తిచేస్తారో నాకు తెలీదు. అదీకథ. రాజా నీకిలాంటి చురుకుతనం, నేర్పు ఉన్నాయా? అన్నాడు కొలంబస్.

'లేవండి' అన్నాడు వరహాలరాజా నీరసంగా

"అయితే లాభంలేదు నువ్వు సినిమాలో చేరడానికి పనికిరావు" అన్నాడు కొలంబస్.

(పైవారం మరోకథ) ★

# పసి హృదయాలు

"అక్కా! నాక్కూడా నీళ్ళు పొయ్యవూ!" అంటూ వచ్చాడు చంటిగాడు శకుంతల స్నానం చేస్తుంటే. "పోస్తారా!" అని నాలుగుచెంబులు నీళ్ళు నమస్కరించి ముఖంనిండా సబ్బురుద్దింది. చంటిగాడి నల్లని ముఖానికి సబ్బురాసే సరికి వింతగావుంది శకుంతలకు నవ్వొస్తోంది— "కోతీ, కోతీ భలేగావుంది కోతి!" అంటూ చప్పట్లు కొడుతోంది. "అమ్మా! అక్కట్యో..." కేకలు పెడుతున్నాడు చంటి.

అంట్లు తోముతూనే సావిత్రికి చంటిగాడి ఏడుపు వినిపించి—"ఒసేవ్! శకుంతలా! ఎందుకే ప్రొద్దున్నే వాడినలా ఏడిపిస్తావ్? అబ్బబ్బ! దావొచ్చి పోయిందమ్మ నీ పిల్లల పిడుగానూ" అనుకుంటూ గృహస్థాశ్రమంలోని ఉదయ ప్రార్థన చేసుకుంటూ వచ్చింది. సావిత్రి కేకలు శకుంతల చెవిని బడ్డా ఆమె ఆనందానికేమీ అడ్డురాలేదు. సావిత్రి విసుక్కుంటూ చంటిగాడి ముఖం కడుగుతూంటే "అమ్మా! అమ్మా! వాడి ముఖంచూడవే కోతిలా ఎల్లా ఉందో! అంది. సావిత్రి నవ్వుకుండి నాలుగు తడ్డించి అంది "ఛీ వమ్మా! ఆకోతి ముఖం కోసమే వాచి పొయ్యే రోజులొస్తాయ్యే! అక్కలు! తమ్ముళ్ళు ఎల్లకాలం కలిసేవుంటారా?"— చంటిని చంకనెత్తుకుని చక్కా పోయింది సావిత్రి యింట్లోకి.

ఇవాళ ఈ సంఘటన సావిత్రికి క్రొత్తేమీ కాదు. ఇటువంటి సంఘటనలెన్నో నిత్యం ఆయింట్లో పరిపాటయిపోయినై. పదకొండేళ్ళ కూతురు శకుంతల. నిదేళ్ళ అబ్బాయి చంటిగాణ్ని ఏడ్పించటం—వాడు అమ్మకు ఫిర్యాదు చేయటం—తను గంభీరమైన వేదాంతం బోధించటం ఇవన్నీ సావిత్రిని గంభీరమైన ఆలోచనల్లోకి దించినై. ఒక తల్లిబిడ్డలు అన్యోన్యంగా ఎందుకుండరు? వారు కలకాలం కలిసే వుండరే! చివరికి ఎవరి దారిన వాళ్ళుపోతారు. నిత్యం తన అన్నకు పెంకి సమాధానాలు చెప్పుతూ ధిక్కరిస్తూ వుండే తాను టైఫాయిడ్ జ్వరము వచ్చినపుడు "అన్నయ్యా! అన్నయ్యా!" అంటూ ఎందుకు కలవరించింది ఒక వస్తువును పోగొట్టుకున్న పిదపగాని దాని విలువను గుర్తించలేము కాబోలు! అందువల్లనే [illegible] గుర్తించకే యున్నారని తాను ఎంతగా ప్రయత్నిస్తున్నా, తనపిల్లలు నిత్యం కలహించుకుంటారేమిటి? ఒకరినొకరు ఎందుకు ప్రేమించుకోరు?—ఇవన్నీ సావిత్రికి సమాధానం దొరకని ప్రశ్నలుగా తయారైనై. వీటినిగురించి తీరిక సమయాల్లోనే గాక సందర్భం వచ్చినపుడల్లా చేతిలోపని ఆపిమరీ ఆలోచిస్తుంది.

సర్వకార్యాల్లో సహకరిస్తానని అగ్నిసాక్షిగా పెళ్ళాడిన వెంకటేశ్వరరావు సావిత్రి ఆలోచనా కార్యక్రమానికి కించిత్తు సహకరించడు. పిల్లల విషయాల్లో భార్యాభర్తలు భిన్నాభిప్రాయాలు కలవారు, విజాతి ధ్రువాల మనస్తత్వం వారిది. సావిత్రి తన సమస్య తెగక సాలెగూడులో దారి దొరకని పురుగులా సతమత మవుతుంటే వెంకటేశ్వరరావు పరిహాసం చేస్తూ వుంటాడు.

## ముక్కామల

"చక్కా రామలక్ష్మణుల్లాంటి సంతానం వుండి అన్యోన్యంగా వుంటే యిల్లు ఎంత బావుంటుంది?" సావిత్రి అభీష్టం యిది.

సావిత్రికి సమాధానం చెప్పడమంటే వెంకటేశ్వరరావుకి బలే సరదా—"అవును అందుకే కాబోలు దశరథుడు అంత సుఖం అనుభవించాడు. ఇక యింటి బాగోగు లంటావ్. ఊరులోని యిల్లువూర్చి అడవిలోని పర్ణశాలకు ప్రయాణంకట్టారు. ఇంతేం మనం కూడా పోదాం పద. అసా కాదు తెలీకడుగుతా సావిత్రీ! మన పిల్లల్ని కలుపుగోలుతనంగావుండక ఎలావున్నారంటావ్?"

"అవు నవును. కలుపుగోలుగా లేకేం! కాకపోతే రోజుకు పదిసార్లు ఏడుపులూ మొత్తుకోళ్ళున్నూ చూసేగాని. నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని మా దారిని మారు చక్కాపోతారు. ఇక మిగిలింది నేనేగా యింట్లో భరించేది."

"అవును. భార్య అంటే భరించేది" క్రొత్త భాష్యం చెప్పాడు వెంకటేశ్వరరావు.

"ఆ భరింపటంలా సరి! ఆయన నాకీ అనుట్ల, పిల్లల అల్లరీ అన్నిట్నీ భరిస్తున్నా. నా మాటలు యిలా పెడచెవిని బెట్టి వాళ్లను వెనకేసుకు రండి. వాళ్ళు తన్నుకుంటూ, గుద్దుకుంటూ పెరిగి పెద్దవారవుతారు. మొక్కై వంగనిదే మానై వంగుతుందా? ఈ గుణాలే ఉండిపోతయ్!

"పసిహృదయాల లీలలు నీకు తెలియవు సావిత్రీ!" ప్రొఫెసర్లు భార్యలకు హితబోధ చేసే ధోరణిలో మొదలెట్టాడు వెంకటేశ్వరరావు. "పిల్లల మనసులు మల్లెపూవుల్లా నిర్మలంగా వుంటాయి. ఒక కంటితో ఏడుస్తూ రెండో కంటితో నవ్వుతూంటారు. కలహించుకున్న వాళ్లు క్షణంలో కలుస్తారు. పిల్లల కలహాలకు, కల్మషాలకు మన పెద్దవాళ్లలో మాదిరి వేళ్ళు వుండవు. వాళ్లలో వున్న అలకలు, కలహాలు ప్రేమతో కూడినవి. అవిలేనియిల్లు యిల్లుగాదు. అటువంటి దానిని శ్మశానం అంటేనే నాకు సంతోషంగా వుంటుంది. పిల్లలు లేకపోయినా నాకు బాధలేదుగాని ప్రేమతో జరిగే అల్లరి, అగడాలూ చేయని పిల్లలంటే నాకు తలనొప్పి. పిల్లలూ, పిల్లులూ అల్లరి అగడాలు చేయకుండావుండటం జరుగుతుందా? సావిత్రికిదంతా అగ్నిమీద ఆజ్యం పోసినట్టుంది. చివాల్న లేచి స్త్రీత్వాన్ని ప్రదర్శిస్తున్నట్టుగా యింట్లోకి వెళ్ళిపోయింది.

అద్దం, దువ్వెన తెచ్చి అమ్మముందు కూర్చుంది శకుంతల. ఇంకా గట్టిగా మందలిద్దామనుకున్న సావిత్రికి కూతురు చిక్కిన మొగం చూసేసరికి మాతృత్వం పొంగి ఆ ప్రయత్నాన్ని విరమించుకుంది. కాని హితవచనాలేవో తనకు తోచినవి చెప్పింది— "తమ్ముణ్ణి అలా ఏడ్పించ కూడదమ్మా! పోట్లాటలు లేకుండా చక్కగా కలిసిమెలసి వుంటే శకుంతల మంచిపిల్ల అంటారు అంతా. నేను నా చిన్నపుడు మా అన్నయ్యలతోగాని తమ్ముళ్ళతోగాని ఎప్పుడూ పోట్లాడలేదు"—ఈ మాట అంటూ సావిత్రి నాలుక కొరుక్కుంది. అబద్ధమాడుతున్నందుకు ఆమె మనసు చివుక్కుమంది... ఆనాడు బొమ్మల పుస్తకం కోసం తాను, అన్న పోట్లాడుకోటం—అలిగి పెలరోజుల

#  పసిహృదయాలు 

వరకు తాను మాట్లాడుకోనకుండానే అమ్మ తాయం పెట్టినప్పుడల్లా మెదలకుండా తన అన్న ముందుపెట్టి పోవటం—గుక్కచుక్క గానున్న తన అన్న వాటిని గుటకాయ స్వాహాచేయటం—ఇవన్నీ ఒకదానితరువాత ఒకటి తెరమీద బొమ్మల్లా దొర్లిపోవడంతో సావిత్రి చేతిలోనిపని పూర్తవటంకూడ తెలియనందుకు సిగ్గుపడింది. ఆమె పెదవుల మీద ఓ మందహాసరేఖ వెలసి భావప్రపంచాన్నుండి బాహ్యప్రపంచంలోకి కొనివచ్చింది సావిత్రిని

అనుభవం కలుగకపోతే ఆడవాళ్లు దేనినీ నమ్మరుకాబోలు! వెంకటేశ్వరరావు ఎంత వేదాంతం బోధించినా చెవిని పట్టించుకోని సావిత్రి ప్రత్యక్షంగా తాను కూతురి బిక్క మొగం చూసేసరికి కోపమంతా ఎక్కడికి పోయిందో! హితవచనాలు చెప్పి మందలించి మాత్రం వూరుకుంది. అయినా ఆ చిన్న సంఘటన ఆమెమనసుకి బలమైన అనుభూతిని కలిగించ లేకపోయింది.

పలక చంకన పెట్టి జారిపోయే లాగూను ఒక చేతితో పైకిలాక్కుంటూ డిమాండుచేశాడు. "అమ్మా! తాయం" అని చంటి.

శకుంతల చంటిగాణ్ని చెయ్యిపట్టుకు బడికిపోతుంటే వీధిమలుపు తిరిగిన తరువాత గాని సావిత్రి వాళ్ళను చూడటం మానలేదు.

లోపలకొస్తూ భర్తముఖం చూడలేక ఓటమి చిహ్నంలా తలవంచుకుంది సావిత్రి, భర్తనవ్వుతూ "వాళ్లు పోట్లాడుకుంటూ లేమా బడివరకూ పోయిరాకపోయారా?" అన్నాడు.

"ఎంతమాట! వెంకటేశ్వరరావుగారి పిల్లలేమిటి! పోట్లాడుకోవడమేమిటి?" అంది పరిహాసంగా.

"నీవెంత పరిహాసానికన్నా దానిలో పరమార్థం లేకపోలేదోయ్!" అన్నాడు ఆయన గర్వంగా.

"అదిగాదండీ! ఏదో వాళ్ళే కిందా మీదా పడుతుంటారనుకోటానికి అపుర్రవుంక ఏడుపు లంకించుకున్నాడంటే వదలడాయె. ఒకటేగోల. పనిమీదవున్న దాన్ని నేనుపోయి దానిని నాలుగు చప్పిడిగుద్దు లన్నా వేస్తేనేగాని వాడికి ఆనందంగా వుండదు. అవతల నాపనికాస్తా ముక్కలు చెక్కలైపోతుంది. ఎందుకు? ఈ వేళ సంగతే చూడండి. మీరు వంటపెందరాళే చెయ్యమన్నారని అంట తప్పేలా తోము కుంటూ, చంటికికూడా చెంబుడు నీళ్ళు పొయ్యవే అన్నా. ఇంకేముంది? వాడి ముఖాన యింతసబ్బురుద్ది చంకలు కొడు తూంది పాడుపిల్ల— వాడుకళ్ళుమంటపెట్టి చస్తుంటే. వాణ్ని చూదామని ఓ అడుగు వేశానో లేదో పాడుకాకి ఎక్కడనుండి వచ్చిందో రానూవచ్చింది, నేతిగిన్నె కాస్తా వేసుకు పోనూపోయింది. వరాల్లాంటిగిన్నె, కళ్ళల్లో మెదుల్తోంది. మొన్ననే కొన్నా మీ పాతచొక్కాలు రెండుంటే వేసి. ఇల్లా వుంటాయి మాబాధలు. మీకేమో ఎత్తిపొడుపులు— మొత్తుకోళ్ళులా వుంటాయి. కన్న బిడ్డలమీద నాకు ప్రేమలేనట్టూ, మీరే కన్నటుగా మాట్లాడుతారు" అంది.

"అదిగాదు సావిత్రీ! ప్రేమవుండటం లేకపోవటం కాదు. వాళ్లను మనం సరిగా అర్థం చేసుకోడానికి ప్రయత్నించాలి. బతిమాలడం, బామాలడం—నయాన భయాన చెప్పుకోవటం చెయ్యాలి. దానికి కాస్త ఓర్పూ ఓపికా వుండాలి మరి. సాగరంలాంటి సంసారంలో తెప్ప తెట్టూ లేకుండా పోయిగా పడవప్రయాణం చెయ్యాలంటే ఎలాసాధ్యం చెప్పు. అంతే గాని కొట్టడం అన్నదొక్కటే సాధనంగా భావించుకోకూడదు. నా చిన్నతనంలో మా అమ్మ ఓసారి నావీపు ఎలా మోగుతుందో పరీక్షించి చూసింది. అంతే, ఆవేళ మానాన్న అన్నం తింటే ఒట్టు!"

"ఇంకేం మీరు మంచినీళ్ళుకూడా మానెయ్యండి" అంది సావిత్రి నవ్వుతూ లోనికి పోతూ.

"ఆ! సాయంత్రం వరకు అలానే మాను కుంటామగాని త్వరగా వడ్డించు టైమయింది" అన్నాడు తన హితవచనాలు భార్యహృదయాన్ని తప్పకుండా మారుస్తాయనే సంతృప్తితో—

* * *

"తాను చేసిన పని ఎంతవరకు బాగుంది?"— ఆయన ఆఫీసు కెళ్ళిన దగ్గర్నుండీ పని పూర్తి చేసుకుని పిల్లల రాకకోసం ఎదురుచూస్తూ ఈ ఆలోచన్నే పనిగా పెట్టుకుంది. ఆ ఆలోచనల్లో తన బాల్యమూ, భర్తసిద్ధాంతాలూ కూడా రాకపోలేదు. చివరికి ఆలోచనల్లో నుంచి బయటపడి ఒక్కటే నిర్ణయాని కొచ్చింది. ఇక నెప్పుడూ పిల్లలను కొట్ట కూడదని! సావిత్రి ఒట్టువేసుకుందన్నా తప్పులేదు. ఎంచేతంటేను ప్రశ్నించింది సావిత్రి. ఏమో నాకు తెలియదు." అని కోపంగా అన్న శకుంతలగనుక ఓపని చేయదని గట్టిగా నిర్ణయానికి రావడమంటే-పురుషుడు ఒట్టువేసుకున్నంతన్న మాట!

"చంటిఏడీ?" అప్పుడే వచ్చిన శకుంతల సమాధానంతో పాటు వీధి గుమ్మంవద్ద చంటిగాడి శోకసంగీతం కూడా వినిపించింది అరుగు మీద కూర్చుని. రాగాలాపన చేస్తూ అప్పుడప్పుడు యింటిలోపలకు చూస్తున్నాడు ఎవరైనా వస్తారో లేదోనని. చంటిగాడే జయంపొందాడు. ఏడ్పు విని సావిత్రి గుమ్మంవద్దకు వస్తోంది. ఇది చూసి కొద్దిగా స్థాయిపెంచాడు.

సావిత్రి నవ్వుతూ "నా నాన్నే! ఎందుకు ఏడుస్తున్నావ్? లోపలికెళ్దాం రా!" అంటూ చంక వేసుకుని లోపలి కొచ్చింది.

"అమ్మా! దబ్బున నడవలేదని 'గాడిద' అని అక్క నన్ను వొదిలిపెట్టి వచ్చింది" అన్నాడు ఫిర్యాదు చేస్తూ.

సావిత్రికి నవ్వొచ్చింది - దారిలో ఎక్కడో వదిలిపెట్ట బడ్డవాడు ఇంటిగుమ్మం వరకు రాగలిగి, యింట్లోకి మాత్రం రాలేక పోయినందుకు.

సావిత్రి ఈ విషయం ఆలోచిస్తూండగా యింకొకటి తోడయింది.—తాను చూసింది— బడికిపోతూ వుండగా చంటిగాడి చేతిలోని అప్పచ్చి (తాయం) కాకి ఎత్తుకపోతే తన చేతిలోనిది వాడికిచ్చి చేయిపట్టుకు మరీ తీసి కొనిపోయిన శకుంతలేనా? ఇపుడు చంటి ఏడుస్తున్నా లెక్కచేయక దారిలో వదిలి వచ్చింది!

ఈ ఆలోచనల్లోంచి బయటపడేసరికి చంటి తన సంగీతాన్ని యింకా కొనసాగిస్తూనే వున్నాడు.

"అక్కను నేను కొడతానులే ఊరుకో బాబూ!" అనే ఓదార్పు మాటలు సావిత్రి అన్నప్పటికీ వాడు ఏడ్పు మానలేదు. ఇక గత్యంతరం లేక సావిత్రి "నువ్వు చంటిని వదిలి ఎందుకొచ్చావ్? ఈ సారెప్పుడైనా మళ్ళీ అలాచేస్తే వీపు చిట్లగొడతాను అప్పురా!" అని శకుంతల వీపుమీద నాలుగు చప్పిడి గుద్దులు వేసేసరికి చంటిగాడు ఏడుపులో మిళాయించి నవ్వటం మొదలెట్టాడు.

* * *

"అమ్మా! సుబ్బాలావింటికెళ్ళి శ్రీరాముడి వూరేగింపు చూడొద్దూ...!" శ్రీరామనవమి ఉత్సవానికి జరిగే ఊరేగింపు చూచేందుకు అనుమతికి అప్లై చేశాడు చంటి.

"ఏం? సుబ్బారావింటి కెళ్లితేనే గాని కనబడదంటా ఊరేగింపు? మనవాకిట నిలబడి చూస్తె కనబడదూ?" అందామనుకున్న సావిత్రి తల పైకెత్తి చూసి అంతలోనే—

"ఓసి! నీ తెలివితేటలు బంగారంగానూ! ఎంత నంగనాచివే?" దేనికైనా అనుమతి అవసరమైనపుడు శకుంతల తలుపుచాటున వుండి తన తమ్ముడిచే అడిగించటం గ్రహించిన సావిత్రి ఆశ్చర్యంగా అంది.

"అమ్మా! అమ్మా!!" గారాముగా మళ్ళీ చంటి......

"ఎక్కడకురా వెళ్లేది? వెధవ! ఆజనంలో కలిసి పొయ్యావంటే నిన్ను వెదకలేక మా కాళ్లు పడిపోతయ్యి" కోపంగా అంటూ లోపలికెళ్ళింది.

తల్లిమాటల్లోని అయిష్టతను గ్రహించిన శకుంతల మిన్నకుండి పోయింది.

మేళతాళాలతో ఊరేగింపు సాగిపోతూన్నది. సావిత్రి యింటి ముందరగా, అబ్బ ఎన్నెన్ని ఆటవస్తువులు! ఎన్ని పాటవస్తువులు, రంగు రంగుల బట్టలు వేసుకున్న జనం పిల్లలు పెద్దలు మొదలయిన వారందరితో ఆ బజారు కిటకిటలాడి పోయింది. పెద్దపులి తలఅట్ట ముఖానికి కట్టుకున్న ఓ పిల్లవాడు తనకన్నా చిన్నవాళ్లందర్ని జడిపించి సంతోషిస్తున్నాడు.

"చంటీ! చంటీ!! పెద్దపులి చూశావా?" చప్పట్లు కొడుతూ ప్రక్కకు చూసింది. వాకిట నిలబడి ఊరేగింపు చూస్తున్న శకుంతల.

కాని చంటి ఏడీ? చుట్టూ కలయజూసింది. ఇంట్లోకి పరుగెత్తింది. మెట్లమీద నున్న సావిత్రిని ఆందోళనగా అడిగింది. "అమ్మా! చంటేడీ?"

"ఏడీ?" ఖంగారుగా సావిత్రి యిదే ప్రశ్న వేసింది.



అశోక స్తంభం

—ఫొటో: జి. రామమూర్తి,
(తంజావూరు)

"చంటి ఎక్కడా కనబడలేదమ్మా!" కళ్లలో నీళ్లు గిర్రున తిరిగాయి.

"వాణ్ని వదిలిపెట్టి నువ్వేం జేస్తున్నావ్?—" నోటివరకు వచ్చిన మాటలకు పెదిమల గేట్లు వేసేసింది సావిత్రి. శకుంతల ముఖంలోని భావాలే దానికి కారణం. అసలే కళ్లనుండి కాల్వలు కడుతున్నాయి ఇంకా దానికి తోడు నాలుగు మాటలంటే చిట్టితల్లి భరించగలదా? అనుకుంది మదిలో.

అందువలన శకునాలేవో శకటాల్లా ఒకదాని తరువాత దొర్లిపోతున్నా కృత్రిమంగ నవ్వుతూ "వాడే వస్తాడమ్మా! ఏబజార్లోనో నిలబడి ఏ బొమ్మలో చూస్తూవుంటాడు. వాడేవస్తాడులే" అంది భయాన్నీ, ఆందోళనా దాచుకుని.

కంటిముందు చంటిలేని శకుంతలకు యీమాటలేవీ వినిపించడంలా – రత్తమ్మత్తయ్య గారబ్బాయి రాము మొన్న కారు కింద పడటం-పడికాలు పూర్తిగా తీసివేయటం-తన తోటి యీడుగల వాళ్ళక్క కనకదుర్గ ఘోరున ఏడవటం-ఇవి ఆమె కళ్ళముందు కదలాడే దృశ్యాలు.

కనబడకుండా వుండటానికి వీలులేనట్లుగా ఏడుస్తూనే పరుగెడుతోంది. బజారు గుమ్మం రాయి తగిలి బోక్కబోర్లాపడింది. ముక్కువెంబడి రక్తం కారుతోంది. బజారులో ఒక్క పురుగైనా లేదు.- లేచి మళ్ళీ పరుగెత్తుతోంది.

"అమ్మదూ! ...... శకుంతలా!" తల్లి కేకలు వినిపించుకోలేదు.

* * *

డాబామెట్లమీద వుండి ఇంకా ఆశతో చూస్తోంది శకుంతల.

నాన్నగారి చెయిపట్టుకుని బుల్లిబుల్లి అంగలు వేసుకుంటూ వస్తున్నాడు.

ఎప్పుడు వెళ్ళిందో చంటిని తలకెత్తుకుని ఒక్క పరుగులో యింట్లో వాలింది.

"ఏమే వాణ్నలా వదిలిపెత్తే ఎలా?" వెంకటేశ్వరరావు వాక్యం ముగించనేలేదు-

అయ్యోరామ! నేను యింట్లో పనిలో వున్నాను. శకుంతలా వీడూ బజారు గుమ్మంలో నిలబడి ఊరేగింపు చూస్తున్నారు. దాని కన్నుగప్పి ఎప్పుడు పోయాడో పోయాడండీ!"

"ఇంకా నయం. ఆ రాఘవయ్యగారి నౌకరు వుండబట్టిగాని లేకపోతే ఏమయ్యేది?"

ఇద్దరూ యింట్లోకి వెళ్ళారు.

"దొంగ బుజ్జె నన్నొదిలిపెట్టి ఎక్కడకెళ్ళావ్? ఈసారెప్పుడైనా వెళ్తావా? గాడిదా!" తమ్ముణ్ణి తన బాహువుల్లో బిగించి ముద్దుల వర్షం కురిపిస్తోంది శకుంతల.

వెంకటేశ్వరరావు నవ్వుతూ సావిత్రి వంక చూశాడు. సిగ్గుతో తలవంచిన సావిత్రి శకుంతలను గట్టిగా ముద్దాడి తన పైట చెంగుతో ముఖాన్ని తుడుస్తూ అంది "చంటీ! నీకోసం చూడు అక్క యిప్పటిదాకా ఎలా ఏడ్చిందో."

"నే నేడవలేదంటే మరి! [illegible]" బుంగమూతిపెట్టి అన్నాడు.

"నువ్వెందుకేడ్చావురా బుజ్జీ! "[illegible]" అంది సావిత్రి.

"బూరకోసం" బుంగమూతిని సాగదీసి చెప్పాడు.

ఒక గంతులో బజార్లోకి పోయి తన స్వంతఆస్తి-కానీతో బూరకొనితెచ్చి చంటికిచ్చి "ఇదిగోరా కోతీ!" అంటూ గట్టిగా ముద్దుపెట్టుకుంది శకుంతల.

వెంకటేశ్వరరావు, సావిత్రి ఒకరి ముఖం ఒకరు చూసి నవ్వుకున్నారు.

పక్కింటి రేడియోనుండి వినబడుతోంది- "కలకల లాడే... పసిపాపల వెలుగులే, సంసారం! సంసారం!!" ★

# దొరగారి అల్పాహారం

## ముద్దం శెట్టి హనుమంతరావు

తలుపు తట్టిన శబ్దం విన్న జానకి భర్త వచ్చాడనుకొని వుత్సాహంతో పరుగెత్తింది. కాని, తలుపు తెరిచేసరికి ఆమె వుత్సాహం, సంతోషం, పటాపంచలయ్యాయి. ఆమె యెదుట భర్త లేడు... పోలీసు యిన్‌స్పెక్టరు!

"కృష్ణమూర్తి యింట్లో వున్నారాండీ?" ప్రశ్నించాడు పోలీసు యినస్పెక్టరు. అతని గొంతులో అధికారస్వరం వుట్టిపడుతోంది. జానకి బెదిరిపోయింది.

"లేరండి..." అంది తడబడుతూ.

"ఇంకా, ఆఫీసునుంచే రాలేదా యేవిటి?"

"లేదండి...యింకా రాలేదు..." అంది జీరపోయిన గొంతులో.

"సరే, మళ్ళీ వస్తాలెండి..." అనుకుంటూ వెళ్ళిపోయాడతను.

జానకి దభాలున తలుపు మూసి వగర్చుకుంటూ యింట్లోకి పరుగెత్తింది.

"అత్తయ్యా: అత్తయ్యా: ఆయనకోసం పోలీసు యినస్పెక్టరు వచ్చాడు..." భయవిహ్వలయై అరిచింది జానకి.

వృద్ధురాలు వరసమ్మ ఒక్కమారుగ చలించిపోయింది. ఆమెకి పరిస్థితి ఒకపాలాన అవగాహన కాలేదు.

"పోలీసు యినస్పెక్టరు అబ్బాయికోసం వచ్చాడా? ఎందుకు?" ఆత్రుతగా అంది వరసమ్మ.

"ఏమోనత్తయ్యా! మళ్ళీవస్తాననుకుంటూ పోయాడతను...నాకేవిటో భయంగా వుందత్తయ్యా:" రుద్ధకంఠంతో అంది.

"నాకూ భయంగానే వుంది జానకీ! అబ్బాయి యేం అపరాధం చేశాడని? వీడిలాంటి మనిషి కాడే! ఏమీ అర్థం కాకుండా వుంది."

"ఏమో నత్తయ్యా! ఆయనమీద గిట్టని వాళ్ళెవరైనా కుట్రపన్నారేమో! రోజులెప్పుడూ మనవి కావుగదా!" అని ఏడుపు గొంతుకతో అంది జానకి.

మళ్ళీ తలుపు తట్టిన శబ్దం వినిపించింది.

జానకి గుండెలు విపరీతంగా కొట్టుకోసాగాయి.

"చూడమ్మా, జానకీ! అబ్బాయి వచ్చి వుంటున్నాడు" అంది వరసమ్మ ఆత్రంగా.

"ఏమో, మళ్ళీ ఆ యినస్పెక్టరే వచ్చాడేమో నత్తయ్యా!" అంటూనే వికువికువుంటున్న గుండెలతో, తడబడే అడుగులతో పోయి తలుపు తెరిచింది.

కృష్ణమూర్తి సాక్షాత్తూ ఆ శ్రీకృష్ణ పరమాత్మలా ప్రత్యక్షమయ్యాడు. అనాడు ఆ రుక్మిణిలా సంతోషంతో వుప్పొంగిపోయింది యీనాటి జానకి. ఆమె ముఖం అప్పుడే వికసించిన పుష్పంలా విప్పారింది. కాని, ఆ సంతోషం యెంతోసేపు లేదు.

"లోపలికి వచ్చేయండి చప్పున..." అంటూ భర్త లోపలికి రాగానే తలుపు దభాల్న మూసి గడియవేసింది.

భార్య ప్రవర్తన కృష్ణమూర్తికి అణుమాత్రమైనా అర్థం కాలేదు.

"ఏవిటి జానకీ! యెందుకలా బెదురుతున్నావు? ఏమయ్యింది?" అక్కడే ప్రశ్నించాడు కృష్ణమూర్తి. కాని జానకి అక్కడే జవాబు చెప్పే స్థితిలో లేదు.

"లోపలికి పదండి చెప్తాను..." అంటూ వడివడిగా ముందు నడిచింది.

"ఏంరా అబ్బాయ్, ఆఫీసునుండి రావటం యివ్వాళ యింత ఆలశ్యం చేశావేం?" అడిగింది వరసమ్మ. ఆమె మాటల్లో కూడా యేదో అవ్యక్తమైన భయం యిమిడివుందని పసిగట్టేశాడు కృష్ణమూర్తి.

"కొత్తవనుండి ఆఫీసులో వుండాల్సి వచ్చిందమ్మా! ఇంతకీ మీరు యెందుకదోలా అగుపిస్తున్నారు? యేం జానకీ, యిప్పుడైనా చెప్తావా?" అన్నాడు.

"మీకే చెప్పం దత్తయ్యా!" భయంతో అంది జానకి. కృష్ణమూర్తి సహించలేకపోయాడింక.

"ఏవిటమ్మా, యిదంతా? ఏం జరిగిందో చెప్పండి..." విసుగ్గా అన్నాడు.

"నీకోసం పోలీసు యినస్పెక్టరు వచ్చాడ్రా! నువ్వు లేవని చెప్పడంతో మళ్ళీ వస్తానంటూ వెళ్ళిపోయాడు. నిజం చెప్పరా అబ్బాయ్...నువ్వేమైనా నేరం చేశావా?" బాధగా అంది వరసమ్మ.

కృష్ణమూర్తి ఆశ్చర్యచకితుడై పోయాడు. ఎప్పుడూ లేని ఆపద, అపవాదు, యేవిటొచ్చిపడిందా అనితల్లడిల్లిపోయాడు.

"ఏవిటమ్మా, నువ్వు అలాగే అడుగుతావు? నేనెలాంటిమనిషినో నీకు తెలీదూ? నాకేవిటో ఇదంతా అర్థంకాకుండా వుంది. ఇందులో యేదో పొరపాటు జరిగి వుంటుంది...మళ్ళీ వస్తానన్నాడు కదూ, అసలు విషయ మేవిటో కనుక్కుంటాను..." అని కృష్ణమూర్తి అన్నాడో లేదో, చప్పున అందుకుంది జానకి.

"అంత పని చెయ్యకండి, మీకు పుణ్యముంటుంది...ఈసారి అతను వస్తే మీరు యింట్లో లేరని చెప్తానండి....మీరు మాత్రం అతని యెదుటికి పోవద్దు..." ఆమె యేవేవిటో వూహించుకొని కుమిలిపోతోంది.

"అదేవిటి జానకీ! ఇవ్వాళ యింట్లో లేరని చెప్తావు...రేపు చెప్తావు...ఎంతకాలం వాళ్ళ కళ్ళు కప్పగలవు? అలా చెప్పినా వాళ్ళు నమ్ముతారా? అదీ ఒక నేరమే కదూ! బలవంతంగా యింట్లోకి రావచ్చు, యేముంది?" అన్నాడు మూర్తి నిరుత్సాహంగా.

"మీరన్నీ యిలాంటి అడ్డువాదనలే తెస్తారు. మీరు కంటబడిన తక్షణం, ఆయన తనతోపాటు మిమ్మల్ని పోలీసు ఠాణాకి తీసుకుపోతే, ఆడవాళ్ళం మేం నెత్తీ నోరూ కొట్టుకోవటం తప్పించి, చేసేదేముంది చెప్పండి? పక్కింటి ప్రకాశంగారు కూడా యీరోజు వూర్లో లేరు...వుంటే, ఆయనతోనైనా మొరపెట్టుకునివుండేవాళ్ళం" అన్నది జానకి. కృష్ణమూర్తికి విసుగుతోపాటు, కోపం కూడా వచ్చింది.

"నువ్వన్నీ ముందుగా వూహిస్తావెందుకు జానకీ! నన్ను స్టేషనుకి తీసుకుపోయేంత నేరం నేనేమైనా చేస్తేకదూ!" అన్నాడు కాస్త గట్టిగా.

"మెల్లిగా మాట్లాడండీ! మీరన్నదికూడా నిజమే. మన నిర్దోషిత్వంగురించి మనం చెప్పుకోవడంలో తప్పేమీ లేదు. కాని, మీకు విరోధులెవరైనా వుండి, పరోక్షంగా యేదో కుట్ర పన్ని, ఆ వలలో మిమ్మల్ని యిరికించాలని ప్రయత్నించకూడదూ?" భర్తకి నచ్చచెప్పడానికి యెంతో ప్రయత్నిస్తోంది జానకి. వరసమ్మకూడా జానకిని వెనకేసుకొచ్చింది.

"ఘోరా అన్యాయం. రేపు పక్కింటాయన వస్తే, నే వదినతో మాట్లాడతాలే; ఈలోగా మాత్రం నువ్వు యిన్స్పెక్టరు కళ్లెదుట పడకు. పెద్దదాన్ని...యెందుకు చెప్తున్నానో ఆలోచించు" అంది వరసమ్మ.

కృష్ణమూర్తికి పిచ్చెత్తినట్టవుతోంది. తనకి విరోధు లెవరూ లేరని అతనికి తెలుసు. కాని, అది ఖచ్చితంగా చెప్పటం యెలా! ఏమో, కొందరు పైకి మంచిగా వుంటే లోలోన గోతులు త్రవ్వకూడదూ!...అదీ బంధనమే! ఆడవాళ్ల అనుమానాన్ని అంత వేగంగా కొట్టిపారేయకూడదు...ఇంతకీ ఆ నేరమేమిటో!.. యిలా పరిపరివిధాల ఆలోచనలు సాగించాడు మూర్తి.

కొన్ని నిముషాలు గడిచాయి...

మళ్లీ తలుపు తట్టిన శబ్దమయ్యింది. ముగ్గురూ ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు. జానకి కళ్ళు తిరిగాయి...చెమ్మగిలిన కళ్ళు చీరచెంగుతో ఒత్తుకొని దరదరా వెళ్లింది. ఆమెకి తెలుసు ఆ వచ్చినవాడు యిన్స్పెక్టరేనని. తలుపు తెరిచింది. ఎదురుగా యిన్స్పెక్టరు!

"ఓ, మీరా! మా ఆయన వచ్చారేమో ననుకున్నాను" అంది బెదురుతూ. ఎంత ధైర్యం తెచ్చిపెట్టుకోవాలని ప్రయత్నించినా చివరికి బెదురు తప్పిందికాదు. ఇన్స్పెక్టరు మాత్రం యెలా అనుకుంటాడు, ఆమె అబద్ధం చెప్తోందని.. ?

"ఇంకా ఆఫీసునుండి రాలేదా యేమిటమ్మా?" అన్నాడు యిన్స్పెక్టరు విసుగ్గా.

"లేదండీ ...... యెక్కడికి వెళ్లారో యేమిటో!" అంది జానకి.

"అనవసరంగా తిరగడమయ్యింది...సరే, రేపు రావాలిమరి." గొణుక్కుంటూ వెళిపోయాడు యిన్స్పెక్టరు.

తాత్కాలికంగా జానకి గుండెలు కుదుటపడ్డాయి. తలుపు దభేలునవేసి యింట్లోపలికి నడిచింది.

"వెళ్ళిపోయాడా?" అంది వరసమ్మ ఆత్రుతగా.

"వెళిపోయాడత్తయ్యా! కాని, రేపు మళ్ళీవస్తాట్ట" నిరుత్సాహంగా, వుస్సురను కుంటూ అంది జానకి.

"నేను చెప్పలేదూ! ఈ వేళ కాపోతే రేపువస్తాడు. లేదా యీరాత్రి పదిగంటలకే రావొచ్చు. వాళ్ల వుద్యోగమే అది...అందుకే నేను కలిసి, సంగతి సందర్భాలు తెలుసుకుంటానంటే మీరు ఆటంకపర్చారు." చప్పున అన్నాడు కృష్ణమూర్తి. "సరేలేరా! యీవేళ రాత్రికే పక్కింటాయన వస్తాడు. రేపువుదయమే ఆయనతో మాట్లాడుతాను. ఆయన యేంచెయ్యమంటే, అదిచేద్దాం... అతను అనుభవజ్ఞుడు..... బాగా పలుకుబడి కూడావుంది" అంది వరసమ్మ.



తిరుపతి సింహద్వారముపైని ప్రతిమలు
—ఫొటో : ఏ. కమలనాథయ్య-నెల్లూరు.]

జానకి యింక దుఃఖాన్ని ఆపుకోలేక పోయింది. చిన్నగా యేడుపు మొదలు పెట్టింది.

"ఎందుకు జానకీ ఆ యేడుపు? ఇప్పుడేమీ కొంపమునిగిపోవడంలేదులే ... నిజానిజాలు తెలుసుకోకుండా అనవసరంగా మనం గాభరాపడ్డం యెందుకు?" లోలోపల గుండెలు పీచుపీచుమంటున్నా ఆడవాళ్ళలా తనూ గాభరాపడిపోవటం, మరింత ప్రమాదమనిపించి ధైర్యవచనాలు పలకడం మొదలు పెట్టాడు మూర్తి.

తరువాత అంతా భోజనాలకు లేచారు. ఆ రాత్రి ఆ యింట్లో యెవ్వరికీ సరిగ్గా నిద్ర పట్టలేదు పాపం!

* * *

పక్కింటి ప్రకాశంగారు అనుకున్నవేళకి రాలేకపోయారు. మరుచటిరోజు వుదయం వరసమ్మ వెళ్ళేసరికి ఆయన రానట్టు వార్త విని, దిగాలుపడిపోయింది. జానకి మరీ బెంగ పెట్టుకుంది. ఏ క్షణాన పోలీసుయిన్స్పెక్టరు వస్తాడోనని వాళ్ల గుండెలు బితుకు, బితుకు మంటూనేవున్నాయి.

కృష్ణమూర్తి ఆఫీసుకి బైలుదేరేవరకూ యే యిన్స్పెక్టరూ రాలేదు. అతను ఆఫీసుకి బయలేరుతూంటే, తల్లీ, భార్యాకూడా వెళ్ళొద్దని ఒకటే పట్టుపట్టారు వాళ్ళ చాదస్తానికి నవ్వుకుని వెళ్లిపోయాడు. అతను వెళ్లిపోయిన కాస్సేపటికి ప్రకాశంగారు

ములో వున్న వ్యక్తి. కృష్ణమూర్తి అతణ్ణి చప్పున గుర్తు తెచ్చుకోలేకపోయాడు. మొదటికి కొత్త పని తగిలించాక జ్ఞప్తికి వచ్చింది.

"నవ్వట్రా మధూ! ఒకంతట పోల్చుకోలేకపోయానే...యూనీఫారమ్‌లో వుంటే మనిషివే పూర్తిగా మారిపోయావు! ఎప్పుడొచ్చావేమిటి? వచ్చేముందు ఓ కార్డుముక్కయినా వేశావు కాదేంరా?" ప్రశ్నల వర్షం కురిపించాడు కృష్ణమూర్తి.

"నాకు యీ వూరు బదిలీ అయ్యిందిరా! అదీ అకస్మాత్తుగా జరగటంవల్ల నీకు వుత్తరం రాయలేకపోయాను. అందుకే నువ్వేమను కొంటావోనని, నిన్న రెండుసార్లు మీ యింటికి తిరిగాను. తమరి దర్శనభాగ్యం కలుగలేదా? రాత్రి తొమ్మిదింటి వరకూ నువ్వు 'యిల్లుచేరుకోకపోతే, యింట్లోవాళ్లు గాభరా పడతారనైనా వూహించవా యేమిట్రా?" నవ్వుతూ అన్నాడు మధు. కృష్ణమూర్తి ఆలోచనలో పడ్డాడు. బహుశా మధు ఈ యూనిఫారమ్‌లో వచ్చాడేమో! వీడు తనగురించి అడిగితే, జానకి తప్పుగా అర్థంచేసుకుందేమో!

"అవుతే మధూ, నిన్న నువ్వు మాయింటికి వచ్చినపుడు రా యూనీఫారమ్‌తోనే వచ్చావా యేమిట్రా?" వింతగా ప్రశ్నించాడు మూర్తి. మధుకి ఆ ప్రశ్న మరీ వింతగా కన్పించింది.

"ఔరా! అవుతే ఏం?" ఆశ్చర్యపోతూ అడిగాడు.

అంతే! కృష్ణమూర్తి కడుపుబ్బేట్టు నవ్వటం మొదలు పెట్టాడు. మధు తెల్లమొహం వేస్తూ "అదేవిట్రా, అలా నవ్వుతావు పిచ్చెత్తినట్టు?" అన్నాడు.

"ఔరా మధూ, వచ్చినవాడివి ఫలానా అతను వచ్చాడని చెప్పమని చెప్పకూడదూ! ఇప్పుడు ఇంట్లో ఏడుపులూ, పెడబొబ్బలూ అవుతూంటేనూ!" నవ్వుతూ అన్నాడు మూర్తి.

"ఏవిటీ? ఏడుపులా? ఎందుకురా?" నీరైపోయాడు మధు. తను ఏమీ చెప్పకపోయినందువల్ల ముంచుకొచ్చిన ప్రమాదం ఏవిటో అతని వూహకి అందలేదు.

"ఎందుకేవిట్రా? నువ్వు యూనిఫారమ్‌లో వచ్చావా? నిన్నెప్పుడూ మావాళ్లు చూశేదు కదూ! నేనేదో నేరంచేస్తే నన్ను అరెస్టు చెయ్యడానికే వచ్చివుంటావని వాళ్లు వూహించి గాభరాపడిపోయారు. నువ్వు రెండోసారి వచ్చినప్పుడు నేను ఇంట్లోనే వున్నాను. కాని, నేనింకా ఆఫీసునుండే రాలేదని వాళ్ళు అబద్ధం చెప్పడానికి ఇదే కారణం...నన్ను కక్కురుమననీయలేదంటే నమ్మ"...

మధుకూడా పిచ్చివాడిలా ఒకటే నవ్వు నవ్వటం మొదలుపెట్టాడు.

"ఇంత రాద్ధాంతం జరిగిందట్రా? పాపం వాళ్ళెంత తల్లడిల్లిపోతున్నారో! తప్పంతా నాదేను...యూనిఫారంలో వెళ్లటం మొదటి తప్పు...వెళ్లినా పేరుచెప్పి నీ స్నేహితుణ్ణని చెప్పకపోవటం రెండో తప్పు. ఔనుగాని, రెండోసారి నేను వచ్చినప్పుడు యింట్లోనే వున్నావంటున్నావుగదా, నా గొంతు అయినా పోల్చలేదట్రా?"

"లేదురా...బైటి తలుపుకీ, లోపల ఇంటికీ మధ్య ఖాళీస్థలం వుందిలే...నీ గొంతు వినిపిస్తేగా పోల్చేందుకు? వినిపిస్తే పసిగట్టను రానూ?" నవ్వుతూ అన్నాడు మూర్తి.

"బావుందిరా! వేగిరం యింటికి వెళ్దాం పద...వాళ్లెంత గాభరాపడుతూవుంటారో! అసలు, నే నెప్పుడన్నా అనుకున్నానా ఇలా జరుగుతుందని"...కొంత బాధపడుతూ అన్నాడు మధు.

*   *   *

తలుపు తట్టిన శబ్దం విని జానకివచ్చి తలుపు తెరిచింది. భర్త, అతని వెనుక పోలీసు యినస్పెక్టరు ఆమె కళ్ళకి అగుపించేసరికి, ఆమె ప్రాణాలు పైపైనే యెగిరిపోయాయి. ఉన్న చోటనే పెదగా యేడవా లనిపించింది... వాళ్ళని చూసిమూడ్డంతో చప్పున వెనుదిరిగి, పరుగు నడకలతో యింట్లోకి పోయి "అత్తయ్యా," అంటూ బావురుమంది.

"ఏమయ్యిందే జానకీ?" అయోమయంగా అంది నరసమ్మ.

"ఆయన్ని ఇనస్పెక్టరు త్రోవలోనే పట్టుకున్నాడు గామోను, ఇంటికి తీసుకొస్తున్నా డత్తయ్యా" అంది జానకి. నరసమ్మ నోరు తెరిచి విగ్రహంలా నిల్చుండిపోయింది.

అప్పుడే కృష్ణమూర్తి, అతనివెనుక పోలీసు యినస్పెక్టరూ వచ్చారు. కృష్ణమూర్తి మొహంలో నవ్వు అగుపించేసరికి నరసమ్మ కొంత కుదుటపడింది.

"కూర్చోరా మధూ!" అంటూ ఓ కుర్చీ చూపించాడు మూర్తి ఆ ఇనస్పెక్టరుకి. మధు కూర్చుని ఇల్లంతా పరికిస్తున్నాడు.

ద్వారంపక్కనుండి వింతగా ఇదంతా గమనిస్తున్న జానకివేపు తిరిగి "నిన్న రెండుసార్లు వచ్చిన యినస్పెక్టరు వీడేనా?" అన్నాడు మూర్తి నవ్వుతూ. ఔనన్నట్టుగా తలూపింది జానకి సిగ్గుపడుతూ. ఆమె మనసు బాగా కుదుటపడిం దిప్పుడు.

కృష్ణమూర్తి ఫకుక్కున నవ్వేడు.

"వీడు నా స్నేహితుడు జానకీ! కొత్తగా ఈ వూరు బదిలీఅయ్యిందట. నన్ను కలుసుకోవాలని డ్యూటీలో వున్నపుడే యిలా మనింటివేపు వచ్చాడు. వచ్చినవాడు పేరూ వూరూ చెప్పకుండా వెళ్ళటంవల్లనే ఇంత రసాభాస జరిగింది. మీరు అనవసరంగా గాభరా పడిపోయారు...నన్నూ గాభరా పెట్టేశారు..."

"ఔను చెల్లాయ్...నన్ను క్షమించాలి. మీరు అనవసరంగా బెంగపెట్టుకున్నారట. నేను మొదట్లోనే పేరుచెప్పి, వచ్చినపని చెప్పివుంటే, కథ ఇంతదూరం వెళ్లివుండేది కాదు. తప్పంతా నాదేను" అన్నాడు సిగ్గుపడుతూ మధు. తనే తెలివితక్కువగా ప్రవర్తించాడని అతని బాధ.

జానకి లోలోన నవ్వుకుంది. నరసమ్మ గట్టిగా ఓమారు నిట్టూర్చింది.

"హమ్మయ్యా! బ్రతికాం నాయనా!" అంది మెల్లగా నవ్వుతూ.

"మీరంతా నన్ను క్షమించాలి..." మళ్లీ అన్నాడు మధు.

"క్షమాపణ కేముందిలేరా! జరిగిందేదో జరిగిపోయింది. కాని, ఇకముందు మాత్రం స్నేహితుల ఇళ్ళకు ఎప్పుడు వెళ్ళినా యూనీఫారంలోమాత్రం వెళ్ళకు నీకు పుణ్యముంటుంది..." గట్టిగా నవ్వుతూ అన్నాడు కృష్ణమూర్తి.

"ఇంకానా! బుద్ధి వచ్చింది..." నవ్వేశాడు మధు.

అంతా ఒక్కసారి ఫకాలున నవ్వేరు. అప్పుడే ఇంట్లో అడుగు పెటిన ప్రకాశం గారు దృశ్యం చూసి ఆశ్చర్యపోయారు... నరసమ్మ సంగతంతా చెప్పేసరికి ఆయనా నవ్వటం మొదలుపెట్టాడు...అందరి నవ్వులూ మిళితమై ఆ ఇంట్లో ప్రతిధ్వనించాయి. ★







ఛాన్సు! 'థండర్ ఫుల్ ఛాన్సు తప్పిపోయింది.

"వెధవగోపీగాడు ఇక్కడతగలడ్డాడుకాని లేకపోతే సుధ ఇక్కడికి రాకపోయిందా. ఒకవేళ సుధ లోపలకురాకపోయినా నేనే వెళ్ళి పట్టుకోకపోయానా ? అలా ఒంటిగా కనపడినపుడు నేను మాత్రం విడిచిపెడుతానా ? ఛీ! ఈ శనిగ్రహంగాడు ఇంకా ఎంతసేపు పట్టుకుంటాడో. వదిలిపెట్టేటట్లు లేదు" అని విసుక్కున్నాడు మనసులో. గోపీగాడు తనసెంతకూ వదిలిపెట్టక పోయేసరికి ప్రాణం విసిగి—"ఏరా! పోయి పాఠాలు చదువుకోరాదూ. ఎందుకీ చెత్తా కానీ కబుర్లూ" అన్నాడు విసిగి.

"పాఠాలకేంలే బావా! ఎప్పుడూ చదువుతున్నవేగా. కులాసాగా నాలుగుకబుర్లు చెప్పుకుందాంలెద్దూ" అంటూ మళ్ళీ కబుర్లల్లోకి దిగాడు. ప్రకాశానికి ఒళ్లు మండింది. ఇంతలో మామగారు గోపీని కేకవేశాడు. గోపీ తుర్రుమని లోపలకు పరుగెత్తాడు. "అమ్మయ్య! వదిలిపోయింది పీడా" అని సంతోషపడ్డాడు.

ఇంతలో మరదలుపిల్ల గబగబా పరుగెత్తుకుంటూవచ్చి బావ చెవిలో రహస్యం వూదింది. మరదలు పిల్ల మాట వినగానే ప్రకాశంముఖం చాటంతయింది. మరదల్ని ఎత్తుకుని ముద్దు పెట్టుకున్నాడు.

"ఎక్కడుందీ మీ అక్క ?" రహస్యంగా అడిగాడు.

"ఆ ఎదురుగా కనపడేగదిలో వుంది బావా! నిన్ను రమ్మంటోంది" అంది.

"ఆ! నిజంగానా!" అంటూ మొహం ఇంతచేసుకొని నెమ్మదిగా మరదలువెంట బయలుదేరాడు. ప్రకాశం నెమ్మదిగా గది దగ్గరకు వచ్చి తలుపుతట్టాడు. కాని తలుపు తీయలేదు. "ఊహూ నీపని యిట్లావుందా" అనుకుంటూ తానే నెమ్మదిగా తలుపు త్రోసి లోపలకు అడుగుపెటాడు, "ఇందాక తప్పించుకుపోయావ్. మరి యిప్పుడెక్కడికి పోతావ్!" అంటూ. లోపలకుపోగానే ప్రకాశంగుండె నిలువునా నీరయిపోయింది. అక్కడ మామగారు కూర్చుని సంధ్య వార్చుకుంటున్నారు.



"అరి భడవా! మరదలుపిల్ల ఎంతమోసం జేసింది!" అని ఆశ్చర్యపోయాడు. ఇంతలో మామగారు—

"ఏమిటి నాయనా!" అని అడిగారు.

"అబ్బే ఏమీ లేదండీ. గోపీ ఇక్కడున్నాడా" అన్నాడు.

"లేదు ముందుగదిలో వున్నట్లున్నాడు!" అన్నాడు.

"సరేలెండి!" అంటూ బయటపడ్డాడు. మామగారు ముసిముసినవ్వులునవ్వుకున్నాడు మరదలుపిల్ల ఎంత తెలివిగా తనను మోసంచేసింది అని కొంచెం కించపడ్డాడు. బయట మరదలు చప్పట్లు చరుస్తూ పకపకా నవ్వుతోంది. బావ తండ్రి గదిలోనుంచి బయటకొస్తుంటే. మరదలుతోపాటు మధ్య గదిలోనుంచి రెండోగొంతుకూడా పకపకా నవ్వటం స్పష్టంగావినిపించింది ప్రకాశానికి.

ఆ సాయంత్రం ఏమీతోచక డాబా మీదికి వెళ్లి అటూ యిటూ పచార్లుచేయటం సాగించాడు. బావ డాబామీదికి వెళ్ళటం మరదలు చూసింది. ఈసారి అక్కయ్యను ఏడిపించాలి అని నవ్వుకుంటూ గబగబా దొడ్లోకి వెళ్ళింది. "అక్కా! అక్కా! ఇంకా ఇక్కడేంచేస్తున్నావే" అంటూ పెద్దగా అరిచింది.

"ఏంటమ్మా ఏం మునిగిపోయిందనీ అలా కేకలూ, బొబ్బలూ పెడుతున్నావ్ ఇల్లెగిరి పోయేటట్లు"—అంది సుధ.

"డాబామీద ఒడియాలు ఎండబెట్టి రమ్మని అమ్మ ఇందాకటినుంచీ కేకలు వేస్తుంటే ఏమిటమ్మా యీ పరధ్యానం ? బావ వచ్చాడనా, యిలా మారిపోయావ్.

# ★ కొత్తగా అత్తారింటికి ★

నీ బావనెవరూ ఎత్తుకుపోర్లేమ్మా, పద పద!" అంది.

"ఒసేవ్ నీ సరాగం మరీ మితిమీరి పోతోంది" అంటూ చెల్లెల్ని మొట్టికాయ వేసి ఒడియాలు తీసుకొని డాబామీదికి బయలుదేరింది. చెల్లెలుకూడా నెమ్మదిగా మేడమెట్లదాకా వచ్చి చిరునవ్వు నవ్వుతూ నుంచుంది.

డాబాఎక్కి ఒడియాలు క్రిందపెట్టింది. వెనక్కు తిరిగిచూసేసరికి ప్రకాశం పచార్లు చేస్తూ కనిపించాడు. సుధ గుండె గుభేలు మంది. "ఓసి దీనిదుంప ఇగురెట్టా ఎంత మోసం చేసింది. ఇందుకనా ఒడియాలు ఎండబెట్టమని నన్ను పురమాయించింది," అనుకుని నెమ్మదిగా క్రిందికి దిగబోయింది. ప్రకాశం ఎప్పుడో సుధ పడుతున్న అవస్థను చూశాడు. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలెనని ఎప్పుడో నిశ్చయించు కున్నాడు. సుధ ఆయన్ను చూసి చూడనట్లు నటించి నెమ్మదిగా జారుకోబోయింది. ఇంతలో ప్రకాశం ఆమె జడపుచ్చుకొని వెనక్కులాగాడు. సుధ బిక్కచచ్చిపోయి నుంచుంది. సిగ్గుతో మాట పెగిలిరావటంలేదా క్రొత్త పెళ్ళికూతురికి. ఏమి మాట్లాడించ వలెనో తెలియక మైకంలో పడిపోయాడా పెళ్ళికొడుకు.

"ష్! ఒదలండి" అంది సుధ.

"ఊహూ వదలను ఏంచేస్తావేంటి?"

"నాన్నను కేకేస్తా, నా......" అని ఆగిపోయింది.

"ఊ ఆగావేం. మీ నాన్నను పిలు" అన్నాడు నవ్వుతూ.

"అబ్బ వదలండీ. ఎవరైనా చూస్తారూ" అంది.

"చూడనీయి. ఏం కేసుపెడతారా?" అన్నాడు నవ్వుతూ.

"ఆ! ఇలాఐతే మీపై కేసే కేసుపెడ తాను!"

"ఓసిదొంగా!" అంటూ ఆమె బుగ్గపై చిటికవేశాడు. ఆమె నెమ్మదిగా చిరునవ్వు నవ్వింది.

"అదిగో అమ్మ వస్తుదిం!" అంది.

"ఎక్కడా?" అంటూ ఆమె చేతిని వదిలే శాడు. సుధ పకపకా నవ్వుతూ సున్నితంగా ఆయన చేతుల్లోనుంచి తప్పించుకొని లేడిలా తుర్రుమంది. ఆ రోజంతా చెల్లెలు సుధను ఒకటే గోలచేసి ఏడ్పించింది.

పండగ వెళ్ళిన మర్నాడు సుధను వదలేక వదలేక బయలుదేరాడు. ప్రకాశం ప్రయాణమవుతుండగా మామగారు-"ఈ మాఘ మాసంలో ముహూర్తం నిశ్చయించుతాను. తొందరలోనే ఆ శాస్త్రకార్యం జరిపించేస్తే సుధ అటు ఇటూ వస్తూ పోతుండవచ్చు. నీకేమయినా ఇబ్బంది వుందా ప్రకాశం!" అన్నాడు.

ప్రకాశం ఒక్కసారి ఆశ్చర్యపోయి "అబ్బే! మీ ఇష్టమండీ!" అన్నాడు.

బండి ఎక్కుతుండగా సుధ కళ్లలో నీళ్లు తిరగటం తాను స్పష్టంగా చూశాడు. ఇంతలో మరదలు గబగబా పరుగెత్తుకుంటూ వచ్చి "బావా! నీ హేండ్ బ్యాగ్ మర్చిపోయావ్!" అంటూ తెచ్చి ఇచ్చింది.

"మా మరదలు మహామంచిది. భేష్!" అని మెచ్చుకున్నాడు. ఇంతలో గోపీ రేడియోను తీసుకొచ్చి బండిలో పెట్టి "వస్తాను బావా!" అన్నాడు.

"ఇంటికి వెళ్లగానే వుత్తరం వ్రాయి నాయనా!" అన్నారు మామగారు. ప్రకాశం హేండ్ బ్యాగ్ విప్పాడు. అందులో నిండా గారెముక్కలు కూర్చివున్నయ్. చిలిపి మరదలు మోటుసరసం చూచేసరికి కోపంపోయి నవ్వు వచ్చింది. మరదలు పకపకా నవ్వింది. గారెముక్కల్ని క్రింద గుమ్మరించి "ఉండవే మరదలా! నీ కొవ్వును అణిచే మొగుణ్ణి చూస్తాగా" అంటూ గుర్రపుబండీ ఎక్కాడు.

మామగారు ఇంత త్వరగా ముహూర్తం పెట్టించటానికి కారణమేమిటా అని ఆలోచించాడు. ఛటుక్కున గుర్తుకు వచ్చింది. తాను నిన్న డాబామీద చేసిన ఘనకార్యం సంగతి తెలిసి ఇక తొందరపడకపోతే లాభం లేదనే, ఇంత త్వరగా ముహూర్తం పెట్టించాడు. అదీ ఒకందుకు తనమంచికే అయింది. బండివాడు స్టేషను వచ్చిందని గుర్తుచేసిందాకా ప్రకాశం ఊహాపథంలోనే ఉండిపోయాడు.



# నక్షత్ర ఫలితాలు

**( 20-11-57 మొదలు 26-11-57 వరకు )**

బి. నరసింగరావు

### గ్రహస్థితి

| | | | |
|---|---|---|---|
| | కే | | |
| — | 22 తేదీని శని అస్తమించును. తుల, వృశ్చికము, ధనుర్మకరములలో చంద్రుడు. | | — |
| శు | ర బు శ | రా కు | గు |

### *అశ్విని [చూ, చే, చో, లా]*

గతవారమున కలిగిన యోగము ఈ వారము కూడా వుండుటచే కోర్టు వ్యవహారములు సానుకూలపడును; అనుకున్న సొమ్ము చేతికి వచ్చును; బంధువులతో కలిసి మృష్టాన్న భోజనము, కొత్తవారిని కలుసుకొనుట మొదలైనవి కలుగును. విద్యార్థులకు చదువు చురుకుగా సాగుతుంది. కవులకు సన్మానము కలుగుతుంది. గాయకులకు, నటీనటులకు యోగకాలము 20,21, 22 తేదీలలో కార్యభారమువల్ల శ్రమ. 23 న మిత్రదర్శనము, ప్రయాణమువల్ల లాభము.

### *భరణి [లీ, లూ, లే, లో]*

ఈ వారము మీకు యోగదాయకముగా వుంటుంది. ప్రయత్నించిన కార్యములు ఫలిస్తాయి. గృహమందుండు వారితోనూ, మిత్రులతోనూ వినోదములలో పాల్గొంటారు. శుభకార్యములలో నిమగ్నులౌతారు. కోర్టు వ్యవహారములు అనుకూలిస్తాయి. వర్తకులు విలువగల వస్తువులు కొనుటలోనూ అమ్ముటలోనూ లాభముపొందుతారు. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. 20, 21, 22 తేదీలలో కార్యాచరణవల్ల శ్రమ. కవులకు, నటీనటులకు, గాయకులకు మేలుకాలము.

### *కృత్తిక [అ, ఈ, ఉ, ఏ]*

ఆదాయాభివృద్ధికి ఎక్కువ కార్యభారమును పైన వేసుకొని ఆశాభంగము పొందుతారు. పితృసహాయము ఆశించినంతగా కలుగక గృహకలతలు కలుగుతవి. కార్యభారముచే వేళతప్పిన నిద్రాభోజనాదులవల్ల ఆరోగ్యము దెబ్బతింటుంది. ఉద్యోగస్థులకు ఆందోళనకరముగా ఉంటుంది. వ్యాపారస్తులకు లాభము తక్కువ. 20, 21, 22 తేదీలలో ఆర్థికమాంద్యం. శ్రమ, ఆరోగ్యభంగం. వారాంతమున కొంత శాంతి.

### *రోహిణి [ఓ, వా, వీ, వూ]*

ఈ వారము అంత అనుకూలముగా వుండదు. యత్నకార్యము సిద్ధించక ఆరాటపడతారు. విరోధస్తులని అపోహపడేవారివల్లనే కార్యసాఫల్యమును పొంది సిగ్గుపడతారు. గృహమందుండువారిలో కొందరి ఆరోగ్యం చెడి కలతపడతారు. ఖర్చులు ఎక్కువ. ఉద్యోగులకు అధికారుల ఒత్తిడి ఎక్కువవుతుంది. 20, 21, 22 తేదీలలో అమిత ఖర్చులు, కార్యభంగం. వారాంతమున మిత్రలాభము, కార్యానుకూలత. విద్యార్థులకు శ్రద్ధ తక్కువ.

### *మృగశిర [వే, వో, కా, కీ]*

ఈ వారము అనుకున్న పనులు జరగకపోయిననూ ఖర్చులు ఎక్కువైననూ పుణ్యకార్యభారముచే లెక్కచేయక ఈశ్వరానుగ్రహమున అవే సర్దుకుంటాయని సమాధానపడతారు. కాని మిమ్ములను పరిగ్రహించలేక ఇంట్లో లేనిపోనికలతలు కలుగుతాయి. ఉద్యోగస్తులకు ఏమంతమంచికాలముకాదు. వ్యాపారస్తులకు మిశ్రమయోగము. 20, 21, 22 తేదీలలో కార్యభంగంవల్ల మనోవ్యధ. 23 వ ప్రయాణము. వారాంతమున కొంత ఊరట.

### * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈవారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. కార్యభారము అధికము. శ్రమకు తగ్గ ఫలితమువుండదు. కోర్టువ్యవహారములలో కొంత అనుకూలత కొంత ప్రతికూలత వుంటుంది. ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడివున్నా క్రమేణా సర్దుబాటై ప్రేమపాత్రులవుతారు. వ్యవహారముపట్ల దుష్టస్త్రీలతో వివాదము కలుగుతుంది. 20, 21, 22 తేదిలలో కార్యభంగము; మనోవ్యథ. 23 న వివాదము. వారాంతమున కొంత శాంతి.

### * పునర్వసు [కే, కో, హా, హీ,] *

మిత్రులు తటస్థముగా వుండుటచేత సాధించదలుచుకున్న కార్యములు నిలిచిపోవును. సోదరులవల్ల లభించిన సహాయము అవసరములకు చాలక ఇబ్బందిపడతారు. యంత్రములవల్లగాని, ఆయుధములవల్లగాని ప్రమాదసూచనలున్నవి. విద్యార్థులకు గాయములు తగులవచ్చు. అధికారులపోటుమాటలచే ఉద్యోగస్తులు కించపడతారు. 20, 21, 22 తేదీలలో ఆర్థికలోటు, కార్యభంగము. వర్తకులకు లాభములేని ప్రయాణము.

### *పుష్యమి [హూ, హే, హో, డా]*

ఈ వారము కొత్తమిత్రులను కలుసుకుంటారు. అధికారములోనున్న వారి ఆదరణవల్ల యత్నకార్యములు ఫలించుతాయి. విద్యార్థులు నూతనాంశాలు నేర్చుకుంటారు. బంధువులవల్ల శుభకార్యనిశ్చయము జరుగుతుంది. కవులకు మంచికాలము. కొత్తరచనలు చేస్తారు. ఉద్యోగస్తులకు అధికారుల ఆదరణ లభిస్తుంది. వర్తకులకు ప్రయాణమువల్ల లాభము కలుగుతుంది. 20, 21, 22 తేదీలలో కార్యసాధనలో శ్రమ. వారాంతము శుభయోగము. కళాకారులకు, నటీనటులకు మేలుకాలము.

### *ఆశ్రేష [డి, డూ, డే డో],*

ఈ వారము ధనాదాయము అభివృద్ధి పొందుతుంది. పిల్లలవిషయమై శుభకార్య నిశ్చయాలు చేయగలుగుతారు. కొంత కాలమునుండి పరిష్కారము కాకుండా నిలిచి పోయిన చిక్కు వ్యవహారము సాధించుతారు. పండితులకు, న్యాయవాదులకు, కళాకారులకు మంచికాలము. విద్యార్థులు నూతనవిషయాలు నేర్చుకుంటారు. 20, 21, 22 తేదీలలో కార్యభారమువల్ల త్రిప్పట, అలసట; బంధుదర్శనము, కార్యానుకూలత.

### * మఖ [మా, మీ, మూ, మే] *

ఈ వారము విజ్ఞానులతో పరిచయలాభము కలుగుతుంది. బంధుమిత్రులతో కలిసి శుభకార్యములలో పాల్గొంటారు. ఆర్థికస్థితి బాగుపడుతుంది. గృహమందుండువారి ఆరోగ్యము బాగుంటుంది. ఉద్యోగస్థులకు అధికారుల ఆదరణ కలుగుతుంది. వర్తకులకు లాభదాయకము. గాయకులకు, కళాకారు



# నక్షత్రఫలితాలు



లకు మంచికాలము. 20, 21, 22 తేదీలలో ప్రయాస, అమితఖర్చులు. 23, 24 తేదీలలో బంధుదర్శనము, కార్యలాభము, మృష్టాన్న భోజనము.

### * పూర్వ ఫల్గుణి (పుబ్బ) *
### [ మో, టా, టీ, టూ ]

ఈ వారమున మీకు నూతన వాహన లాభము కలుగుతుంది. బంధుమిత్రులతోకూడి కవులతోనూ, కళాకారులతోనూ వినోదిస్తారు. పిల్లల శుభకార్యములవిషయమై తూర్పుదిక్కునుండి వార్త వస్తుంది. విద్యార్థులకు చదువు చురుకుగా సాగుతుంది. ఉద్యోగస్తులకు గౌరవప్రదముగా ఉంటుంది. 20, 21, 22 తేదీలలో కార్యభారము, ప్రయాసము, ఎక్కువ ఖర్చులు. 23, 24 తేదీలలో శుభకార్యాలోచన. కవులకు, గాయకులకు, నటీనటులకు యోగకాలము.

### * ఉత్తర ఫల్గుణి (ఉత్తర) *
### [ టే, టో, పా, పి ]

ఈ వారము ఆర్థికలోపముచే ఒత్తిడికలుగుతుంది. కోర్టువ్యవహారములలో అసంతృప్తి కలుగుతుంది. శ్రమాధిక్యముచేతనూ, అకాల భోజనంచేతనూ ఆరోగ్యము భంగపడుతుంది. పితృవర్గమునుండి కోరినసహాయము లేనందున గృహకలతలు ఏర్పడుతవి. 20, 21, 22 తేదీలలో శ్రమతోకూడిన ప్రయాణము. ఆర్థికదుస్థితి. 25, 26 తేదీలలో కొంత ఊరట.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము మీరు ఎంత ప్రయత్నించినను కార్యములు విఫలమగుచూ, శత్రువులనుకున్నవారి సహాయమువల్ల సఫలతను పొందుతారు. అనుకోని ప్రయాణము చేయుటలో కొన్ని చిక్కులలో పడతారు. కుటుంబములో కొందరికి జబ్బుచేయుటచే మనోవ్యధను పొందుతారు. వర్తకులకు మంచి కాలము కాదు. 20, 21, 22 తేదీలలో లాభములేని ప్రయాణము, శ్రమ, అమిత ఖర్చులు. 25, 26 తేదీలలో కార్యాలాభము, శాంతి.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈ వారము ఆశించిన సహాయము కలుగక అనుకున్న పనులు నెరవేరక గృహకలతలచే అశాంతిగా వున్నప్పటికీ ఓర్పువల్లను మీలోవున్న దైవచింతవల్లను నిగ్రహించుకుంటారు. వైజ్ఞానికవిషయములు తెలుసుకొనుటచే కొంత శాంతి లభిస్తుంది. ఉద్యోగస్తులకు ఒత్తిడి ఎక్కువ. 20, 21, 22 తేదీలలో త్రిప్పట, శ్రమ. 23, 24 పుణ్యకార్య చింతన, మిత్రులను కలుసుకొనుటవల్ల స్వల్పలాభము. వారాంతమందు గృహమందుండువారికి ఆరోగ్యభంగము.

### * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈ వారము మీకు అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. కార్యభారము అధికమగుటచేత శ్రమ, అశాంతి. యత్నకార్యములు కొన్ని వెనుకపడినను కోర్టువ్యవహారములలో కొంత అనుకూలత ఉంటుంది. 20, 21, 22 తేదీలలో స్త్రీలతో వివాదమువల్ల మనోవ్యథ. 23, 24 తేదీలలో వర్తకులకు లాభము లేని ప్రయాణము. విద్యార్థులకు చదువు సాగదు.

### *విశాఖ [తీ, తూ, తే, తో]*

ఈ వారము మీ శక్తినంతటినీ ఉపయోగించినప్పటికీ కార్యానుకూలత వుండదు. అయినను నిరుత్సాహపడక ప్రయత్నించుటవల్ల క్రమేణా కష్టములు తగ్గి కార్యసాధన పొందవచ్చును. 20, 21, 22 తేదీలలో ఉద్యోగస్తులకు అధికారులవల్ల వ్యథ కలుగును. ప్రమాదమువల్ల దెబ్బలు తగిలే సూచనలున్నవి. వారాంతమున క్రొత్త వ్యక్తులను కలుసుకొని కొంత లాభము పొందుతారు. విద్యార్థులకు చదువుమీద అశ్రద్ధ.

### *అనూరాధ [నా, నీ, నూ, నే]*

ఈ వారము మీకు యోగదాయకముగా వుంటుంది. కొన్నాళ్ళనుండి మీకు బాధ కలుగచేసే చిక్కులు తగ్గుతాయి. ఆర్థిక స్థితిలో అభివృద్ధి కలుగుతుంది. కోర్టు వ్యవహారములో అనుకూలతీర్పులు ఉంటాయి. విద్యార్థులు క్రొత్త విషయాలను నేర్చుకుంటారు. పండితులకూ, కవులకూ, కళాకారులకూ మేలుకాలము. జ్ఞాతులవల్ల శుభకార్య

### ధరలు

నూలు, వస్త్రములు: మందముగా వుంటవి.

బెల్లము, పంచదార, చింతపండు:- నిలకడగా వుండును.

ఆహారధాన్యములు:-మందగించును.

పప్పుదినుసులు: మార్పు లేదు.

నూనెదినుసులు: మార్పు లేదు.

వెండి, బంగారము: నిలకడగా వుండును.

దక్షిణదేశములో బాగుగావర్షించును.

జన్మనక్షత్రమునుబట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారివారి పేర్లననుసరించి పేరు మొదటి అక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది. కృష్ణుడను పేరునకు మృగశిరానక్షత్రమును, వృష్ణుడను పేరునకు స్వాతిని, శ్రీధరుడను పేరునకు చిత్తను, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తను, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢను చూచుకొనునది.

నిశ్చయము జరుగుతుంది. 20, 21, 22 తేదీలలో కార్యభారమువల్ల ప్రయాసము. 23, 24 తేదీలలో కార్యలాభము; వర్తకులకు ప్రయాణమువల్ల లాభం.

***జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]***

ఈ వారము పదవిలోనున్న బంధువు సహాయమువల్ల ధనాదాయము పెరుగుతుంది. కోర్టు వ్యవహారములు అనుకూలముగా వుంటాయి. పిల్లలకు అభివృద్ధికలిగే ఉద్యమాన్ని ప్రారంభిస్తారు. పండితులకూ, న్యాయవాదులకూ మేలుకాలము. విద్యార్థులు ఉత్సాహముగా కొత్తసంగతులు నేర్చుకుంటారు. కళాకారులకు మంచికాలము. 20, 21, 22 తేదీలలో కార్యభారము, శ్రమ. 23, 24 తేదీలలో మిత్రదర్శనము, సహాయము, కార్యానుకూలత.

***మూల [యే, యో, బా, బీ]***

ఈ వారము బంధుమిత్రులను కూడి శుభకార్యములలో పాల్గొంటారు. ధనాదాయము బాగుంటుంది. విద్యార్థులు విజ్ఞానులవల్ల నూతన విషయాలను తెలుసుకుంటారు. గృహమందుండు వారి ఆరోగ్యము బాగుపడుతుంది. పండితవర్తకులకు లాభము. కవులకు, కళాకారులకు, గాయకులకు మేలుకలుగుతుంది. 20, 21, 22 తేదీలలో కార్యానుకూలత, శ్రమ. 23, 24 తేదీలలో మిత్రాగమనము, మృష్టాన్నభోజనము.

***పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢ]***

ఈ వారము మీ ఆర్థికస్థితి బాగుంటుంది. బంధుమిత్రులతో కూడి, గాయకులతోనూ, కళాకారులతోనూ ఉల్లాసముగా కాలక్షేపము చేస్తారు. వర్తకులు ఖరీదైన వస్తువుల క్రయ విక్రయాలలో లాభము పొందుతారు. విద్యార్థులు వినోదములలో పాల్గొన్ననూ నూతనాంశాలనూ నేర్చుకుంటారు. ఉద్యోగస్తులకు అశాంతి తొలగుతుంది. 20, 21, 22 తేదీలలో శ్రమ, అధికఖర్చులు. నటీనటులకూ కళాకారులకు, కవులకు, గాయకులకు యోగకాలము.

***ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]***

కిందటివారము కలిగిన రోగము క్రమముగా తగ్గుచుండుటచేతను ఈ వారము కార్యభారము, ఆందోళన. అకాలభోజనమువల్ల అనారోగ్యము కలిగేసూచనలు కనబడగానే శ్రద్ధ తీసుకోవాలి. పితృవర్గమునుండి వచ్చిన సహాయమువల్ల మీ అవసరములు తీరవు. గృహకలతలు కలుగుతాయి. 20, 21, 22 తేదీలలో ఉద్యోగస్తులకు శ్రమ అధికము, ఫలము తక్కువ; నిందలు. వర్తకులకు లాభములేని ప్రయాణము.

***శ్రవణము [జూ, జే, జో, ఖా]***

యత్నకార్యములు నెరవేరక నిరుత్సాహము కలిగిననూ స్నేహితులు ఆర్థికముగా సహాయపడుటచే తృప్తి చెందుతారు. అలో



తుంగభద్ర ప్రాజెక్టు; దాని సుందర పరిసరాలు

గ్యముగురించి శ్రద్ధ అవసరము. వర్తకులకూ, ఉద్యోగస్థులకూ మొదట్లో అసంతృప్తి, క్రమేణా లాభము వుంటుంది. 20, 21, 22 తేదీలలో ప్రతికూలత, శ్రమ, 23, 24 తేదీలలో మిత్రసహాయము, అనుకూలత.

## * ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

పుణ్యకార్యములపై ఆసక్తి ఎక్కువగుట చేతను, గృహావసరాలను సకాలములో తీర్చ నందున సంసారములో కలతలు రేగుతాయి. కుటుంబములో కొందరికి ఆరోగ్యము చెడు తుంది. విద్యార్థులకు చదువుపై అనాసక్తి కలిగినా, నూతన విషయాలు తెలుసుకుంటారు. 20, 21, 22 తేదీలలో ఆర్థికలోపముచే మనోవ్యథ. 23, 24 పెద్దల సాంగత్యము. ఊరట.

## *శతభిషం [గో, సా, సీ, సూ]*

ఈ వారము చాలా ప్రతికూలముగా వుంటుంది. అనుకున్న ధనసహాయము చినక పడుటచేత సక్రమముగా పనులు జరగవు. ఇచ్చిపుచ్చుకొనేపట్ల నీచులతోనూ, స్త్రీలతోనూ తగాదాలు వచ్చి మనోవ్యథ పొందుతారు. మీకుగాని, మిమ్మల ననుసరించియున్న వారికిగాని ఆరోగ్యము చెడవచ్చు. 20, 21, 22 తేదీలలో ప్రయాణముచే శ్రమ, అధికఖర్చులు. వారాంతమున ఆరోగ్యభంగము. విద్యార్థులకు చదువు సాగదు.

## *పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]*

సహోదరుని సహాయమువల్ల కొంత సర్దుబాటు అయినను మీ అవసరములు తీరవు. కార్యసాధనకు మీ శక్తిని ఉపయోగించి ప్రయత్నించినను శ్రమ ఎక్కువ, ఫలితము తక్కువ. పోటుమాటలచే వ్యథపడతారు. 20, 21, 22 తేదీలు ప్రమాదములవల్ల దెబ్బలు తగులుతాయి. 23, 24 తేదీలలో ఉద్యోగస్థులకు ఒత్తిడి, వర్తకులకు ఆందోళన.

## *ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా]*

ఈ వారము స్నేహితుల సహాయముతోనూ మీ స్వశక్తివల్లనూ కార్యసాధనఅయి తృప్తి పొందుతారు. ఉద్యోగస్థులకు అధికారుల దయ కలుగుతుంది. చిల్లరవర్తకులకు లాభము ఎక్కువ. విద్యార్థులు విజ్ఞానాభివృద్ధి చేసుకుంటారు. 20, 21, 22 తేదీలలో కార్యభారము వల్ల శ్రమ, కాయకష్టము. కవులకూ, కళాకారులకూ, పండితులకూ మంచికాలము.

## * రేవతి [దే, దో, చా, చీ] *

ఈ వారము మీకు యోగకాలము. ఆర్థికలోపాలు తీరుతాయి. వైజ్ఞానికవిషయాలు తెలుసుకొని సుఖము పొందుతారు. ఈశ్వరానుగ్రహము కలిగిన తృప్తిని పొందుతారు. ఉద్యోగస్థులకు హోదా, గౌరవము పెరుగుతవి. వ్యాపారస్థులకు లాభము. విద్యార్థులు కొత్తవిషయాలు నేర్చుకుంటారు. పండితులకు సన్మానము జరుగుతుంది. న్యాయవాదులకు యోగము. 20, 21, 22 తేదీలలో కార్యభారమువల్ల త్రిప్పట, శ్రమ. 23, 24 తేదీలలో కళాకారులకు మేలు. వారాంతమున శుభయోగము. ★



# ప్రేక్షకుల ఆదరాభిమానాలను అపారంగా చూరగొన్న ★ సాటిలేని మేటినటుడు

# శ్రీ సిం

# నాగభూష

★ రచన: కనుపర్తి



‘...వేలుపోరంగ విచ్చితివి...’
—ప్రతాపరుద్రీయంలో యుగంధరుడు.

“పంతులుగారూ ఎంతాకా ప్రయాణం?”

“పేటపాలెం వెళ్ళి రావాలయ్యా.”

‘మళ్ళా యివ్వాళే వస్తారా?’

‘ఆహా.’

‘అయితే యింత ఆలస్యంగా బయలుదేరారేం?’

‘ఏదో స్టూడెంట్లకు పాఠాలన్నీ చెప్పి బయలుదేరే టప్పటికి ఆలస్యమైంది.’

‘అక్కడేం పనండీ?’

‘నాటకం రిహార్సల్ ఒకటున్నది.’

‘నాటకాలంటే తమరికెంత అపేక్షండీ! రిహార్సలకు మీరుగూడా వెళ్ళి వస్తున్నారు! అయితే తమకు జనతా అందదే. రాత్రి ప్యాసింజరుకే. అది రాత్రి ఏ పది గంటలకో పదకొండు గంటలకో వస్తుంది.’

‘అంతే. దాని చిత్తం మన భాగ్యం,’ అంటూ చిరునవ్వు నవ్వేరు నాగభూషణ రావుగారు.

రోజూ కాకపోయినా వారానికి రెండు మూడుమారులైనా నాగభూషణ రావుగారికి ప్రయాణం తప్పదు.

పూర్వపుణ్య విశేషంవల్ల ఒక్కొక్కరు ఒక్కొక్క విద్యయందు ఒక్కొక్క కళయందు ప్రావీణ్యత కలిగి ఉండటం సర్వసాధారణం. కాని ఒకే వ్యక్తి బహువిధ పాండితీవిభవుడూ, బహువిధ కళాప్రవీణుడూ కావడంమాత్రం సామాన్యమైన విషయం కాదు. కాని అట్టి బహువిధ ప్రజ్ఞాధురీణుడు శ్రీ సింగరాజు నాగభూషణరావు. ఆయనకు సంగీతమూ, సాహిత్యమూ, చిత్రలేఖనము, నాట్యము, నటనమూ — అన్నీ వచ్చును. నేర్పడమూ వచ్చును, నేర్చుకోవడమూ వచ్చును; నవ్వడమూ వచ్చును; నవ్వించడమూ వచ్చును. నవరసాలు పోషించడంలో ఆయన సాటిలేని మేటినటుడు. ఈ సర్వతోముఖ నైపుణ్యమే ఆయన జీవితాన్ని కమనీయమైనదిగా తీర్చిదిద్దినది.

శ్రీ నాగభూషణరావు 1896వ సంవత్సరము నవంబరు మూడవ తేదీని బాపట్లలో జన్మించారు. తండ్రి సింగరాజు మల్లికార్జునుడుగారు. తల్లి భ్రమరాంబ గారు. ఈ పూజ్యదంపతులకు నాగభూషణరావు ఏకైక పుత్రుడు కాగా, అతని బాల్యం అత్యంత గోముగా జరిగిపోయింది.

ఒంటినిండా నగలు పెట్టి ఎత్తుకొని బడికి తీసుకొని పొయ్యేవారు అతని తలిదండ్రులు. కుమారుడు హైస్కూల్లో చదివే రోజుల్లో



‘ఆఁ! అంతవరకు వస్తాడంటారా?’
‘తెరలో తెర’లో సుందరరామయ్య.

కూడా తల్లి భ్రమరాంబగారు పుట్టినరోజు పండుగ పేరంటం చేస్తూ ఉండేది. మేనమామలు చీరాల కృష్ణయ్యగారు, నరసింహంగారు కూడా అతన్ని ఎంతో గారాబంగా చూచేవారు.

విద్యార్థి అయినవానికి విద్యార్థి దశలో ఉత్తముడు సమర్థుడూ అయిన ఉపాధ్యాయుడు లభించడం విద్యార్థి అదృష్టమనే చెప్పాలి. అదృష్టవశమున శ్రీ నాగభూషణ



‘...వీని ప్రభావ మెట్టిదో!’
—ప్రహ్లాదలో హిరణ్యకశిపుడు.

# అసంఖ్యాక ఆంధ్రవిద్యార్థులు ఆరాధ్యదైవంగా భావించే ఆదర్శ ఉపాధ్యాయుడు

# గరాజు ణరావు



'...పట్టాకపోతాన్ !...'
—ప్రతాపరుద్రీయంలో పిచ్చివాడు.

వరలక్ష్మమ్మ ★

రావుకు హైస్కూలులోను, కాలేజీలోనూ కూడా అట్టి ప్రధానోపాధ్యాయులే లభించారు. అప్పట్లో బాపట్ల హైస్కూలు హెడ్మాష్టరు శ్రీపంచాపకేశయ్యరుగారు ఇంగ్లీషులో దిట్ట. పిల్లలను క్రమశిక్షణలో ఉంచడంలో సమర్థుడు. ఇక కాలేజీ చదువులో కాకినాడలో శ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడు గారు ప్రిన్సిపాల్. ఆ రోజుల్లో శ్రీ నాయుడుగారు విద్యార్థులకు పేలబంటిగా ఉండి వారి నెట్టి ఆదర్శప్రాయులుగ తీర్చినది యెల్లరకు విదితమే.

శ్రీ నాయుడుగారి ఋజువర్తనం సమదర్శకత్వము, సేవా పరాయణత్వము సంఘసంస్కరణ పతితజనోద్ధరణము మొదలైన సద్గుణ పుంజములు ఆనాటి విద్యార్థులకు మార్గదర్శకములుగా నుండి వారి నిప్పటికిని వెలుగుబాటలలో నడిపించుచున్నవనడంలో సందేహంలేదు. ఆదర్శ ప్రాయులైన అట్టి గురువుల సన్నిధిని విద్యాభ్యాసం చేసిన శ్రీ నాగభూషణరావు తన జీవితమును వారి అడుగుజాడల్లో నడిపించి పునీతం చేసుకున్నారు.

బి ఏ శ్రీ నాగభూషణరావు ఘనుడ పాసై టెక్కలిలో ప్రెసిడెన్సీలో ద్వితీయస్థానము సంపాదించుకున్నాడు. పిమ్మట యల్. టి. పాసై గుంటూరుజిల్లా బోర్డులో సహాయోపాధ్యాయుడుగాను, ప్రధానోపాధ్యాయుడుగాను ఉద్యోగముచేసి ఉత్తమ ఉపాధ్యాయుడుగా అధికారులచేతను విద్యార్థులచేతను మన్ననలందుకున్నారు. తన పైఉద్యోగులచేతను తనక్రింది ఉద్యోగులచేతను తన విద్యార్థులచేతను వ్రేలెత్తి చూపరానిది శ్రీ నాగభూషణరావు ఉద్యోగ జీవితము. విద్యార్థులలో అవిధేయత పెచ్చు మీరి గురుధిక్కారము సర్వసామాన్యమైన యీ రోజుల్లో శ్రీ నాగభూషణరావు విద్యార్థుల సమ్మెలు ప్రాయోపవేశాలు మొదలైన అలజడులు లేకుండా తన ప్రధానోపాధ్యాయ పదవిని నిర్వహించారంటే వారి ఉద్యోగ జీవితమెంత ఉదాత్తంగా గడిచిందో తెలుసుకోవచ్చును. విద్యార్థులంటే నాగభూషణరావు గారికి అమిత వాత్సల్యము. నాగభూషణరావుగారంటే విద్యార్థులకు అమితగౌరవము. ఈపరస్పర సుహృద్భావమునకు కారణము వారి మంచితనము సామర్థ్యమే కాకుండా వారి కళా ప్రియత్వము కూడా హేతువై ఉండవచ్చును.

శ్రీ నాగభూషణరావుకు చిన్నతనము నుండీ నాటక కళంటే ఎనలేని ప్రీతి. ఈ కళాభిరుచి ఆయనకు ఆయన తండ్రిగారి నుండి సంక్రమించినది. నాగభూషణ రావు గారి తండ్రి మలయ్యగారు వేణీసంహారము, గయోపాఖ్యానము, పీష్వ నారాయణరావు వధ మున్నగు నాటకముల్లో వేషములు ధరిస్తూ ఉండేవారు. తండ్రిలో ఉన్న ఆ నాటక కళాభిమానము శ్రీ నాగభూషణరావులో ఇతోధికంగా ప్రదీప్తమైంది. నాగభూషణరావు హైస్కూల్ ఫైనల్ చదువుతూ ఉండగానే



'ఛీ-ఈ దురభిమానపు బ్రతుకేల?'
ఉత్తరగోగ్రహణ విజయాలలో భీముడు.



గంభీరమూర్తి
శ్రీ నాగభూషణరావు

# ★ శ్రీ సింగరాజు నాగభూషణరావు ★

తమ స్కూలు వార్షికోత్సవాలు మొదలయిన సందర్భాల్లో వేషధారణ చేయడం ప్రారంభించారు. ప్రప్రథమమున ఆయన పాల్గొన్న నాటకము గయోపాఖ్యానము. ఆనాటి నుండి కళాశాలలో చదువుతున్నప్పుడుగాని, ఉద్యోగము చేస్తున్నప్పుడు గాని, నేడు ఉద్యోగమునుండి విరమించిన తరువాతగాని ఆయన నాటక కళా లక్ష్మిని విస్మరించినది లేదు.

ఆయనకు హైస్కూలులోను కాలేజీలోను ఉత్తమ విద్యాబోధనము చేయగల అధ్యాపకులు లభ్యమైనట్టు గానే నాటక కళ నేర్పుటకు కూడా టి. జె. మూర్తి దొరగారి అంతేవాసిత్వము లభించడము దైవఘటనే అనాలి. మూర్తి దొరగారు రాజమహేంద్రవరము కాలేజీ ప్రిన్సిపాల్‌గా ఉండి అనేకమంది కళాకారులను తన ప్రబోధ ప్రోత్సాహములచే తయారు చేసిన కళా శక్తి. నాగభూషణరావుకు బి. ఏ. చదువు దినములలో శ్రీ మూర్తి దొరగారు విద్యా గురువే గాదు కళా గురువు కూడ అయినారు.

శ్రీ నాగభూషణరావుకు తెలుగు, ఇంగ్లీషు నాటకములలో కూడ పాత్రధారణ చేయగల నేర్పు గలదు. ఒథెల్లో, జూలియస్ సీజర్ మున్నగు షేక్స్పియర్ నాటకాలలో అతను ప్రముఖ పాత్రను ధరిస్తూ ఉంటాడు. ఇక తెలుగులో ఆయన ధరించిన భూమికలకు లెక్క లేదు. చారిత్రకము సాంఘికము, పౌరాణికము అన్నిరకములయిన నాటకములలోను ఆయన నైపుణ్యంతో నటించగలడు. ఏ నాటకములోనైనను ఆయన ధరించేవన్ని ప్రధాన పాత్రలే. సహజంగా గంభీరవిగ్రహుడు, మేఘ గంభీర నిస్వనుడు కావడంచేత ఆయన ధరించే పాత్రలు కూడా దానికనుగుణంగా ఉంటూ ఉంటాయి. రసపుత్ర విజయంలో దుర్గాదాసు, ప్రసన్న యాదవంలో నరకాసురుడు, హరిశ్చంద్రలో విశ్వామిత్రుడు, కృష్ణరాయబారంలో భీముడు, కర్ణుడు, ప్రతాప రుద్రీయములో యుగంధరుడు, పిచ్చివాడు, పూర్ణిమలో సోమనాథ దేవుడు, తళ్లికోట యుద్ధములో పఠాను, కంఠాభరణంలో రామశాస్త్రి, సోహ్రాబు రుస్తుంలో రుస్తుం, బొబ్బిలి యుద్ధములో పాపారాయుడు, వాల్మీకిలో వాల్మీకి, ఉద్యోగ విజయాల్లో భీముడు, భీష్ముడు, పద్మవ్యూహంలో కర్ణుడు, సునందినీ పరిణయంలో సుమతి, చాణక్యలో వసంతకుడు, ప్రహ్లాదలో హిరణ్యకశిపుడు, విప్లవములో వార్డెను, అపరాధిలో అపరాధి రామయ్య, ఇట్లా పూర్వపు గద్య పద్యాత్మక నాటకాలు మొదలు యీనాటి వచన నాటక నాటికలవరకు ఆయన ధరించిన వేషములకు లెక్క లేదు. 1955 సంవత్సరం నాట్యకళాపరిషత్తువారి నాటక పోటీలలో బాపట్ల కళావనివారు ప్రదర్శించిన "కమల" నాటకంలో భద్రయ్యగా నటించి పరిషత్తువారి బహుమానం పొందారు. కళావనివారి 'తెరలో తెర' లో సుందరరామయ్యగా నటించి రాజమహేంద్రవరంలో ఉత్తమ నటుడుగా బహుమానంపొందారు. విజయనగరంలో యీ నాటకానికే ఉత్తమ ప్రదర్శనకుగాను 'షీల్డు' వచ్చింది. లింగమూర్తిగారి 'వెంకన్న కాపురం'లో వెంకన్నగాను, 'చిన్నయ్య చెరువు'లో కాంతయ్యగాను నటించి ఎంతో మెప్పుపొందారు. ఈ నాటికకే మంగళగిరిలో ఉత్తమ నటుడిగా బహుమానం లభించింది. 'సింహగఢ'లో తానాజీగా మంచి ప్రశంసలందుకున్నారు. ఈ విధంగా పూర్వపు పౌరాణికాది నాటకాలు మొదలుకొని నేటి 'మా వూరు' మొదలైన ప్రచారక నాటకాలవరకు, శ్రీ నాగభూషణరావు పాల్గొన్న నాటకాలకు లెక్క లేదు.

నాటక ప్రదర్శనములందేగాక ప్రహ్లాద మొదలైన హరికథా గానంలోను, బుద్ధుడు మొదలైన బుర్రకథలు చెప్పడంలోను ప్రతాపరుద్రీయము, బల్లహుడు మొదలైన వాని ఏకపాత్రాభినయంలోను నాగభూషణరావు ప్రజ్ఞ అసాధారణమైనది. ఇటీవల రేడియో నాటికా ప్రదర్శనంలోగూడా నాగభూషణరావుగారు తరుచు పాల్గొనడం రేడియో శ్రోతలకు విదితమే అనుకుంటాను. ఇన్ని విధముల నటనాభిరుచిగల నాగభూషణరావు నాటకకళకు కేంద్రమైన సినిమాలలోను పాల్గొనక విడువలేదు. ఆయన పాల్గొన్న సినిమాలు [illegible]నారాయణ, వీరాభిమన్యు.

ఈ నాటకకళకాయన చేసిన అపారసేవను గుర్తించియే గుంటూరు ఆంధ్రసంసత్ వారు హరిప్రసాదరాయ వర్థంతి సందర్భమున హరిశ్చంద్రలో కాటిసీనులో హరిశ్చంద్రుడుగా ఆయన ప్రదర్శించిచూపిన నైపుణ్యానికి మెచ్చి 'అభినవప్రసాదరాయ' బిరుదును, బాపట్ల స్త్రీహితైషిణీ మండలివారు 'కళాతపస్వి' బిరుదమును ఇచ్చి సత్కరించి ఉన్నారు. ప్రజలు వీరి కళా ప్రావీణ్యతను గుర్తించి గౌరవించడం ధర్మమే అయినప్పటికి, నిజానికి శ్రీ నాగభూషణరావు కళాసేవ పరిమితమైన బిరుదుల కతీతమైనది; అనంతమైనది. శ్రీ నాగభూషణరావు తన జీవితాన్ని నాటకాది కళలకు తానే అంకితము చేసుకున్నాడో లేక భగవంతుడే అంకితము చేసి పుట్టించినాడో చెప్పలేము. అది ద్రవ్యాపేక్షతో చేస్తున్నది కాదు; కీర్త్యపేక్షతో చేస్తున్నదీ కాదు; అదొక వ్యసనంగా ఏర్పడి చేస్తున్నదీ కాదు; సహజ సిద్ధమైనది. అది ఆయనకొక దైవారాధనవంటిది. నాటక కళను కేవలము పాత్రధారణచేతనే గాక సర్వవిధముల పెంపొందించవలెననేదే ఆయన ఆకాంక్ష.

బాపట్లలో ఇటీవలి వరకు చక్కని నాటకశాల లేదు. ఏ తాటాకుల పెండాలులోనో కళా పిపాసువులు నాటకాలు ప్రదర్శించి తమ కుతూహలం తీర్చుకుంటూ ఉండేవారు. ఆయన అహర్నిశలు పాటుబడి, ఎంతో కృషి చేసి పురప్రముఖులను కూడగట్టుకొని షేర్లు వేయించి చక్కని చిత్రకళా మందిరము నిర్మింపజేశారు. నిజంగా ఆకళామందిరం శ్రీ నాగభూషణరావు వ్యయప్రయాసలకు బృహద్రూపం. సినిమా ప్రదర్శన లెక్కువై ఊరూర రోజుకు రెండూ మూడూ ఆటలు ఆడుతున్న ఈ రోజుల్లో నాటక సమాజాలేర్పడడమే కష్టమైన విషయం. ఒకవేళ ఏ నాటకకళాభిమానులైనా ఏ నటకబృందమునో కూడగట్టుకొని నాటకమాడినా అది నష్టంతో ముగింపు కావలసిందేగాని మరొకటి కాదు. నాటకాపేక్షతో నాగభూషణరావు ఆడిన ఇటువంటి చేతిచమురు భాగవతాలకు లెక్క లేదు! ఆ నాటి నాటకాల నష్టమే గాక ఆపరిచయాన్ని పురస్కరించుకొని ఎందరో నటకులు ఆయనవద్ద ధనసహాయం పొంది వెళ్ళుతూ ఉంటారు. అది అప్పుగా పుచ్చుకున్నా ఉచితం క్రిందే లెక్క. ఈ నటమిత్రుల్లో ఎవరికే ఇబ్బంది వచ్చినా వారు నాగభూషణరావుగారిని అర్థించడం, ఆయన సహాయంచేయడం సర్వసాధారణంగా జరుగుతూ ఉంటుంది. నటమిత్రులేగాదు ఎవరే సహాయం కోరినా లేదనడం, కాదనడం ఆయన జీవితంలో నే లేదు.

నాటకకళకు తనసర్వస్వం ధారపోస్తూఉన్న శ్రీ నాగభూషణరావుకు ఇతరవిషయాలలో ఏజోక్యం లేదుఅనడానికివీలు లేదు. బాపట్లలో సంస్థలపట్లనకాని, ప్రత్యేకంగా కాని ఏసభ జరిగినా ఏఉత్సవం జరిగినా, అదివిద్యార్థులకు సంబంధించిందే కానీయండి, ఉద్యోగులకు సంబంధించినదే కానీయండి, స్త్రీలకు సంబంధించినదే కానీయండి, బిడ్డలకు సంబంధించినదే కానీయండి, ఆయనకు సంబంధము లేకుండా ఉండదు. చందాపట్టిక చేతికైనా పడ్డదంటే, మొదటిపద్దు ఆయనదే. ఆయనను మించిన ఉద్యోగులూ, షాహుకార్లూ, ధనాఢ్యులూ ఊరిలో చాలమంది ఉంటారు. కాని చందాపట్టిక మీద మాత్రం మొదటి పద్దు ఆయనదై ఉండటం మామూలు. చందాకే గాదు. ఆయనవల్ల ఏ రూపమైన సహాయం కోరి నిరాకృతులైనవారంటూ కనిపించరు. ఎవరేసహాయం కోరితే ఆ సహాయం చేయడానికి ఆయన హృదయం సిద్ధంగా

ఉంటుంది. ఆయన సహాయానికి ధనిక దరిద్ర తారతమ్యం గాని, గొప్ప కొద్ది తారతమ్యంగాని ఐహికంపారమార్థికం అనే వ్యత్యాసం గాని లేదు. ఆయనకు అందరూ ఒకటే; అన్నీ ఒకటే. ఆయన తన ప్రియమైన కళాక్షేత్రానికి ఎట్లా అధ్యక్షుడో అట్లాగే భక్త సమాజానికీ, హిందీ ప్రేమీమండలికీ ఇంకా ఎన్నిటికో అధ్యక్షుడు. ఎన్నో కార్యవర్గాల్లో సభ్యుడు. ఏ సంస్థలోను బాధ్యతగల స్థానమునందు ఆయనకు స్థానం లేకుండా ఉండదు. ఆయనకు పక్షభేదాలు లేవు. కాంగ్రెసుకూ, కమ్యూనిష్టులకూ, సోషలిస్టులకూ అందరికీ ఆయన ఇష్టుడే, గౌరవపాత్రుడే. ఊరిలోకి పండితులూ, కవులూ, గాయకులూ, నటకులూ మొదలైన వారెవరొచ్చినా నాగభూషణరావుగారి సహాయం కోరడం, ఆయన చేయడం నిత్యం జరిగే పని. కళాసేవలోనే కాకుండా విద్యాబోధనలో కూడా శ్రీ నాగభూషణరావుగారి సేవ అనన్యసామాన్యమైనది. ఆయన విద్యార్థి కల్పతరువని చెప్పితే అతిశయోక్తి కాదు. వారి మీద ఒక ట్యుటోరియల్ కాలేజీ. ఆ కళాశాలకాయన ఏకై[illegible]ాధ్యాయుడు. యస్. యస్. యల్. సి., మెట్రిక్, ఇంటరు, బి. యే, అన్ని తరగతుల వాళ్ళు అక్కడ విద్యార్థులే. ఉదయం ఎనిమిది గంటల నుండి రాత్రి తొమ్మిదీ, పదీ గంటల వరకు విద్యార్థులు జట్లుజట్లుగా చదువుకొని వెళ్లుతూ ఉంటారు. విద్యాపిపాసువులైన ఆ విద్యార్థినీవిద్యార్థులకు చదువు చెప్పవలెననేదే లక్ష్యం కాని, దానివల్ల ఆర్జన చేయవలెనని ఆకాంక్ష ఆయనకు లేదు. ప్రతిఫలము ఇచ్చిన వారిస్తారు, ఇవ్వని వారివ్వరు. దాని ఒత్తిడి ఏ మాత్రం లేదు. విద్యాబోధనం అందరికీ ఒకటే. ముఖ్యంగా స్కూల్ ఫైనల్ ప్యాసై పొరుగూరువెళ్లి ఇంటరు చదివే అవకాశము లేని బాలికలు, ప్రైవేటుగా యింటివద్ద చదివి మెట్రిక్ కు వెళ్ళదలచినవారు - హయ్యరు గ్రేడు ఉపాధ్యాయినులుగావుండి ప్రైవేటుగా స్కూల్ ఫైనల్ పరీక్షకుగాని, ఆంధ్ర మెట్రిక్ కుగాని వెళ్ళదలచినవారు, సెకండరీ గ్రేడు ట్రైనింగై ప్రైవేటుగా ఇంటరు పరీక్షకు వెళ్ళదలచిన ఉపాధ్యాయినులు, తెలుగు పండిట్ గావుండి మెట్రిక్ చదువదలచినవారు ఒకరేమిటి ఉన్నతవిద్యాభ్యాసము చేయదలచిన బాలికలకు, ఉపాధ్యాయినులకు నాగభూషణరావుగారు చేస్తున్న సహాయం ఇంతా అంతా గాదు. వారివారి అవకాశమైన వేళలో వారికి పాఠములు చెప్పి పంపుతూవుంటారు. వాళ్ళేగాదు కాలేజీలో చదువుతూ సెలవులలో ఇంటికివచ్చిన విద్యార్థినులు ఆ కొద్ది రోజులే లెక్కలు, ఇంగ్లీషు ఆయనవద్ద నేర్చుకొని వెళ్లుతూవుంటారు. ఈవిధంగా ఎవరే విధమైన విద్య కోరినా విరామంలేకుండా చెప్పుతూవుంటారు. ఈవిధంగా స్త్రీల విద్యాభివృద్ధికి ఆయన చేస్తున్న సహాయం వెలకట్టరానిది. స్త్రీల సంఘములంటే నాగభూషణరావుగారికెంతో అభిమానం; వారేసహాయము కోరినా ఆయన కాదనరు.

శ్రీ నాగభూషణరావుకు దైవభక్తి మెండు. ప్రతి ఆదివారము ఆంజనేయస్వామివారి ఆలయంలో ఆయన భజనకు హాజరై భక్తబృందముతో కలిసి భజనలు చేయడమేకాక అప్పుడప్పుడు ప్రహ్లాదాదిభక్తుల చరిత్రములు కథాసంకీర్తనము చేస్తూవుంటారు. భక్తిపారవశ్యముతో ఆయనచేసే కథాసంకీర్తనము ఎంతో ఆకర్షకంగా వుంటుంది.

శ్రీ నాగభూషణరావుకు క్రిందటి వత్సరమే షష్టిపూర్తయింది. ఆయన వున్న స్థితిలో మరొకరైతే కాలుపై కాలు వేసుకుని కూర్చుండి సుఖం అనుభవిస్తూవుందురు. కాని ఆయనకట్టిజీవితం ఇష్టంలేదు. ఉదయంనుండి రాత్రి పదిపదకొండుగంటలవరకు విద్యాబోధనలోను, కళారాధనలోను కాలం గడపడంలోనే ఆయన ఆనందం అనుభవిస్తూ ఉంటారు. వారి దైనికచర్య మాస్తే అద్భుతంగా వుంటుంది. ఆయన జట్లుజట్లుగావచ్చే విద్యార్థిబృందానికి పాఠాలు చెప్పతూనే వుంటారు; నాటకం పోర్షనులు వల్లెవేస్తూనే వుంటారు. పొరుగూళ్లకుగూడా రిహార్సలుకు వెళ్లివస్తూనేవుంటారు. నాటక ప్రదర్శనాలు చేస్తూనేవుంటారు. ఈలోగా స్థానికంగా జరిగే సభలలో అధ్యక్షతవహించమని కోరినచోట అధ్యక్షత, ఉపన్యాసంచేయమనికోరినచోట ఉపన్యాసము, ఆటలు మొదలైన సందర్భాలలో జడ్జీగా ఉండమని కోరినచోట జడ్జీగాను, ఏకపాత్రాభినయం చేయమని కోరినచోట ఏకపాత్రాభినయము, బుర్రకథ చెప్పమని కోరినచోట బుర్రకథ, కథాసంకీర్తనము కోరినచోట కథాసంకీర్తనముచేసి వస్తూనే ఉంటాడు. అదేమి చిత్రమో, ఎప్పుడు ఎవరెట్టి సహాయంకోరుతారా, ఎవరికేవిధంగా సహాయంచేదామా అని ఆయనహృదయం కుతూహల పడుతూ ఉంటుంది. ప్రతివారికి ఆయన అతిసులభుడు. పది పన్నెండేండ్లు నిండీనిండని కుర్రవాళ్లు ఎవరింట్లోనో బాలసంఘము పెట్టుకొని మేష్టరుగారూ మేము బాలసంఘం స్థాపించుకుంటున్నాము మీరు ప్రెసిడెంటుగా రావాలంటే ఆయనవెళ్ళి వాళ్ళను ఆశీర్వదించి ప్రోత్సహించివచ్చినసందర్భాలెన్నో ఉన్నాయి. మేష్టరుగారూ మేము ప్రెసిడెంటుగా ఎన్నుకున్నాము ఆయన రాలేదు మీరు అధ్యక్షత వహించవలెనంటే వెంటనే అధ్యక్షత వహించిన సందర్భాలు, మా వార్షికోత్సవానికి మీరేదైనా హాస్యప్రదర్శనం ఇచ్చి మాకు సహాయం చేయవలెనంటే తక్షణం ఏ పేరిగాడి వేషమో, ఏకపాత్రాభినయమో చేసి సభవారిని కలకలా నవ్వించిన సందర్భాలు అనేకంగా ఉన్నాయి.

కవులకు అష్టావధానాలు శతావధానాలు, ఎప్పుడో ఒకప్పుడు మాత్రమే. కాని ఈ బహువిధకార్యకలాపాలవల్ల శ్రీ నాగభూషణరావు అనుదిన జీవితమంతా అవధానమే. ప్రతిఫల విరహితమైన ఈయన కృషికి వెలకట్టడందుర్లభం. శ్రీ నాగభూషణరావు తమ విద్యాబోధనవల్లను, కళారాధనవల్లను, సేవాపరాయణత్వంవల్లను వితరణశీలతవల్లను పరోపకార పరత్వమువల్లను, ఎనలేని కీర్తిని సముపార్జించుకొంటున్నారు. ఈయన బాపట్లనగరమునకు భూషణమని చెప్పవచ్చును.

ఇటీవల నాగభూషణరావుగారికి బాపట్ల పూర్వ విద్యార్థిసంఘము వారును, కేట

(48 వ పేజీ చూడండి)

# భయం

తెల్లవారుజాము మూడుగంటలవుతుందేమో పట్టణం అంతా ప్రశాంతంగా వున్నది. మునిసిపాలిటీవారి ఎలెక్ట్రిక్కులైట్లు గ్రుడ్డివెలుతురును వీధులమీద ప్రసరింప చేస్తున్నాయి. జనసంచారము ఏమీ లేదు.

ఆ సమయంలో ఆ మెయినురోడ్డులో ఇద్దరు వ్యక్తులు మందంగా నడుస్తున్నారు. వారిలో ఒకడు ఇలా అన్నాడు:

"హాయిగా అందరూ వళ్లుమర్చిపోయి నిద్రపోతూంటే మనకీఖర్మ మేమిటిరా, పిచ్చయ్యా?"

"ఏం చేస్తాం. ఉద్యోగానికి శరీరం అమ్ముకొన్న తర్వాత ఏ పనికైనా వేళా పాళా లేకుండా తయారుకావలసిందే" అన్నాడు పిచ్చయ్య తనతోటి జవానైన బుచ్చయ్యతో.

"ఉద్యోగ మయితేమటుకు దానికి కొంచెము మంచీ, చెడ్డా లేకపోతే ఎలా? అయినా మన ఇన్‌స్పెక్టరుగారికన్నా కొంచెం తెలియద్దూ?" అన్నాడు బుచ్చయ్య.

"ఆయనమాత్ర మేం చేస్తాడు పాపం! మన ప్రాణానికి ఆ రెవెన్యూబోర్డు మెంబరుగారు ఈ రాత్రే పట్టణానికి క్యాంపు చేసుకున్నారు. వెంటనే తాసీల్దారుగారు ఇనస్పెక్టరుగారికి ఈ పని వప్పగించారు. ఇనస్పెక్టరుగారు దాన్ని మనకు జారీచేశారు" అన్నాడు పిచ్చయ్య.

"ఇంకా తెల్లవారకుండానే మనకి, పాలూ, రొట్టె ఎక్కడ దొరుకుతై?"

"బోర్డు మెంబరుగారికి అయిదుగంటలకల్లా రొట్టె, పాలు తీసుకోవటం అలవాటుట. ఆ టైముకి అవి తయారుగా వుండకపోతే ఆయన చిర్రుబుర్రు మంటారు."

"మనం మాటల్లోపడి వచ్చినపని ఆలస్యం చేస్తే తరువాత చివాట్లు తినాలి. అయితే ఈ రొట్టెలసాయిబు ఇల్లు ఎక్కడో ఎలా తెలుస్తుంది?" అన్నాడు పిచ్చయ్య.

వాళ్లిద్దరూ అట్లా మెయినురోడ్డువైపు కొంతదూరం వెళ్ళి ఓ షాపుముందు ఆగారు. ఆ షాపు ముందు "సలాం రొట్టెల బేకరీ" అని బోర్డు కట్టివుంది. ఆ షాపు స్వంతదారు ఇలు ఎక్కడో కనుక్కోటం ఓ సమస్య అయింది. వాళ్ళిద్దరూ ఆకొట్టుకు కొంత దూరం అటూ ఇటూ చూశారు. ఆ షాపుకు కొంతదూరంలో ఒక షాపు ముందర ఎవరో నిద్రపోతున్నారు.

పిచ్చయ్య వెళ్ళి అతనిని గట్టిగా వీపు తట్టాడు. ఆ వ్యక్తి మంచినిద్రలో వున్నాడు

"బాబోయి. నేను దొంగను కాదు. నన్నొదిలెయ్యండి" అంటూ కలవరించాడు.

"పాపం మనల్ని పోలీసులు అనుకున్నాడేమో?" అన్నాడు పిచ్చయ్య చిన్నగా నవ్వుతూ.

"ఏమయ్యోయి. నిన్నే. లే లే" అన్నాడు బుచ్చయ్య. ఆ వ్యక్తి ఆ కేకలకు కళ్లు నులుపుకొంటూ లేచి హడావిడి పడ్డాడు.

"ఏం భయం లేదులే. మేం పోలీసులం కాదులే" అన్నాడు బుచ్చయ్య ఆ వ్యక్తిని చూచి.

శ్రీరాగి

ఆ మాటలు విని "అమ్మయ్యా!" అనుకొన్నాడు ఆ వ్యక్తి. అతను ఎక్కడో చిన్న దొంగతనం చేసి ఆ షాపు ముందర నిద్రపోతున్నాడన్న సంగతి పిచ్చయ్య, బుచ్చయ్యల కెలా తెలుస్తుంది?

"ఏమిటయ్యా అర్ధరాత్రివేళ నిద్రపోతూవుంటే లేపుతారు?", అన్నాడు ధైర్యం తెచ్చుకొని వీళ్ళు పోలీసులు కాదు అని తెలుసుకొన్న తర్వాత.

"ఇదిగో చూశావా ఆరొట్టెలషాపు. దాని స్వంతదారు ఇల్లు'ఎక్కడో కొంచెం తెలుస్తే చెబుతావా?" అన్నాడు పిచ్చయ్య.

"అర్ధరాత్రి పూట రొట్టె కావలసి వచ్చిందా మీకు?" అన్నాడా వ్యక్తి.

"ఆ గొడవ నీకెందుకులే! ఆ రొట్టెల సాయిబు ఇల్లు ఎక్కడ? తెలిస్తే చెప్పు." అన్నాడు బుచ్చయ్య.

"రొట్టెల సాయిబు ఇల్లు తెలీని వాళ్ళు ఎవరుంటారు ఈ వూళ్ళో. పాలిపేటలో బికారివీధిలో చివరగా ఉంటుంది వెళ్లండి" అన్నాడు ఆ వ్యక్తి.

"పాపం, నిద్రపో. నీ నిద్రచెడగొట్టాము" అంటూ పిచ్చయ్య, బుచ్చయ్యలు ఆ రొట్టెల సాయిబు ఇంటి అన్వేషణార్ధం బయలుదేరారు. ఆ వ్యక్తి మళ్ళీ నిద్ర కుపక్రమించాడు.

అక్కడికి పాలిపేట ఓ మైలుంటుంది. నానా అవస్థపడి బికారివీధి చేరుకున్నారు. ఆ వీధిలో చివర ఇంటికి వెళ్ళి నిలబడ్డారు. అదో పూరిగుడిసె. లోపలనుంచి ఎవరివో మాటలు వినపడుతున్నాయి.

"ఏరోజు మిగిలిన డబ్బులు ఆ రోజు ఇలా త్రాగేసి తందనాలు తొక్కుతుంటే సంసారము ఎట్లా గడుస్తుంది?" అంటున్నదో మగ కంఠం.

"నా సంపాదన తింటాను. త్రాగుతాను. నీకేం?" అంటున్నది రెండో మగకంఠం.

పిచ్చయ్య గుడిసెతలుపు మెల్లగా తట్టాడు. గుడిసెలో మాటలు తక్కున ఆగిపోయినై. కొంచెంసేపు నిశ్శబ్దం. పిచ్చయ్య మళ్ళీ ఇంకొంచెం గట్టిగా తలుపుతట్టాడు.

లోపలనుంచి మాటలు అతి మెల్లగా వినిపించినై.

"పోలీసోళ్ళు కాదుగదా" అన్నదో కంఠం.

"ఏమో!" అన్నది ఇంకో కంఠం.

"లోపల ఎవరు? రొట్టెలసాయిబున్నాడా?" అన్నాడు పిచ్చయ్య గట్టిగా.

తలుపు కొద్దిగా తెరచి చూశాడు అందులో ఒకడు. "ఎవరు? ఏం కావాలి?" అన్నాడు.

"సలాමున్నాడా? రొట్టె అర్జంటుగా కావాలి" అన్నాడు పిచ్చయ్య.

పోలీసులు కాదు అని తెలుసుకొన్న తర్వాత గుడిసెలో ఉన్నవాళ్ళకి ప్రాణాలు లేచి వచ్చినై.

సలాము లోపలనుంచి తూలుతూ బయటికి వచ్చాడు. నోరు కంపు కొడుతున్నది. ఆవాసనను భరించలేక దూరంగా నిలబడ్డారు పిచ్చయ్య బుచ్చయ్యలు.

"ఇంతరాత్రిప్పుడురొట్టేమిటి?" అన్నాడు సలామూ.

"కలెకరుగారికి అర్జంటుగా కావల్సి వచ్చింది" అన్నాడు పిచ్చయ్య.

"కలెక్టరుగారిమాట వినగానే రొట్టెల సాయిబు చల్లబడి తన తమ్ముడు ఖాదరుకు షాపుతాళం చేతులుఇచ్చి వాళ్లకు కావాల్సిన రొట్టె ఇయ్యమని హుకుము జారీచేశాడు.

ఖాదరు పిచ్చయ్య బుచ్చయ్యతో వచ్చి

పావు తెరిచి మంచి తాజాసరుకు ఓ రెండు పాన రొట్టెలిచ్చాడు. ఆ రొట్టె తీసుకొని వాళ్లు బయలుదేరారు.

"ఒక గండం గడిచింది. ఇంక ఆవుపాల సంగతి చూడాలి" అన్నాడు పిచ్చయ్య.

"నువ్వు బంగళా దగ్గరకుపోయి అక్కడ బసచేసిన రెవిన్యూబోర్డు మెంబరుగారి వంటవాడికి ఆరొట్టె ఇచ్చెయ్యి. నేను ఆ పుల్లమ్మ ఇంటికిపోయి ఆవుపాలు తీసుకువస్తాను" అన్నాడు బుచ్చయ్య.

"మరి వెన్న సంగతో" అన్నాడు పిచ్చయ్య.

"సుబ్బయ్య ఇంటికివెళ్లి కొట్టు తెరిపించి కొద్దిగావెన్న పట్టుకెళ్లు" అన్నాడు బుచ్చయ్య.

"సరే నేవెళ్తున్నాగాని పాలు తీసుకొని నువ్వు త్వరగా రావాలి" అన్నాడు పిచ్చయ్య.

తరువాత పిచ్చయ్య బంగళాకు, బుచ్చయ్య ఆవుపాలకోసమూ బయలుదేరారు.

బుచ్చయ్య గొల్లపాలెంలోని పుల్లమ్మ ఇంటికెళ్ళి కేక పెట్టాడు.

"ఎవరది? ఇంకా తెల్లారకుండానే తయారయ్యారు" అన్నది పుల్లమ్మ విసుక్కుంటూ లోపలనుంచి.

"నేనే! బుచ్చయ్యను. ఒక్కసారి బయటికి రా" అన్నాడు బుచ్చయ్య.

"నువ్వా బుచ్చయ్యా! ఏమిటేది ఎప్పుడూ లేనిది ఇంత ప్రొద్దుండగా వచ్చావు" అన్నది పుల్లమ్మ తలుపుతీసుకొని బయటకువచ్చి.

"నేనే పుల్లమ్మా. పెద్దదొరగారు ఈవూరు క్యాంపు కొచ్చారు. వారు అయిదుగంటలకే పాలు త్రాగుతారట. అందుకోసం తాసీల్దారుగారు పాలు తెమ్మని పురమాయించారు." అన్నాడు బుచ్చయ్య.

"ఏమాత్రం కావాలేమిటి పాలు?" అన్నది పుల్లమ్మ.

"శేరన్నా లేకపోతే ఎట్లా?" అన్నాడు బుచ్చయ్య.

"సరే. వుండు దూడను విడుస్తున్నాను". అంటూపుల్లమ్మ ఆపనిలో నిమగ్నురాలైంది.

కొంత సేపటికి చెంబుతీసుకొని పాలు తియ్యటానికి సిద్ధమై ఆవు పొదుగు దగ్గర కూర్చుంది పుల్లమ్మ. కాని ఆవుకు అంత చీకటిలోనే పాలు తియ్యటం ఇష్టంలేదేమో పుల్లమ్మను తిన్నగా పాలు పితకనియ్యలేదు. బుచ్చయ్య ఇదిచూసి పుల్లమ్మ కోరికమీద ఆవు వెనక కాళ్ళు రెండూ పట్టుకున్నాడు. కొత్తమనిషిని చూచి ఆవు ఇంకా కొంచెం బెదిరి, బుచ్చయ్యను రెండుకాళ్ళూ ఎత్తి తన్నింది. బుచ్చయ్య కొంచెంలో తప్పుకొన్నాడు గానీ, లేకపోతే మంచిదెబ్బ తగిలేది. ఆవుగిట్టలు కన్ను దగ్గర గీసుకొని పోయి గాయమై కొద్దిగా నెత్తురువచ్చింది. తనకా దురవస్థ కలిగించిన జమాను ఉద్యోగాన్ని బుచ్చయ్య తిట్టుకోకుండా వుండలేక పోయ్యాడు.

నానా యాతనపడి ఆవుపాలు తీసుకొని బుచ్చయ్య ఉసూరుమంటూ బంగళా చేరుకొన్నాడు.

ఇనస్పెక్టరుగారు, తాసీల్దారుగారు అప్పుడే అక్కడ ప్రత్యక్షమైనారు. అప్పుడే చీకటితెరలు కొద్దికొద్దిగా తొలిగిపోతున్నాయి. ఇంకా పాలు రాలేదేమని చిర్రుబుర్రు మంటున్నారు తాసీల్దారుగారు.

ఇనస్పెక్టరు బుచ్చయ్యను ఓ ప్రక్కగా పిలిచి "ఏమిటి ఇంత సేపు చేశావు?" అన్నాడు.

"ఏంచెయ్యమంటారు బాబూ. ఆవుపాలు ఇయ్యక నానా తిప్పలు పెట్టింది. నన్ను తన్నసుగూడా తన్నింది" అంటూ కంటిమీద దెబ్బ చూపించాడు.

"ఇంకా నయ్యం కన్ను పోలేదు" అంటూ ఇనస్పెక్టరు కొంచెం సానుభూతి చూపించాడు.

షుమారు ఆరుగంటలు కావస్తున్నది. మెంబరుగారి అల్పాహారానికి కావలసిన పదార్థాలన్నీ మెంబరుగారి స్వంతబట్లరుకి అందచేయబడినై.

రొట్టె, పాలూ, వెన్నా, ఇంకా అనేక రకములైన బిస్కట్లు దొరగారి అల్పాహారం కోసం తయారై వారికోసం ఎదురు చూస్తున్నై.

ఏడుగంటలు కావచ్చింది. దొరగారు లేచే సూచనలు ఏమీ లేవు. ఇన్‌స్పెక్టరు తాసీల్దారు బంగళావరండాలో దొరగారి కోసం ఎదురు చూస్తున్నారు.

ఇంతలో దొరగారిబంట్రోతు తాసీల్దారుగారికి కబురు తెచ్చాడు.

"దొరగారికి సుస్తీగావుంది. ఇప్పుడేమి ఫలహారం తీసుకోరుట. ఇంకో అరగంట వుండి కాఫీ తెప్పించమన్నారు," అన్నాడు.

తాసీల్దారు దొరగారి దర్శనం చేసుకొని ఇనస్పెక్టరుకు మంచి కాఫీ తెప్పించమని ఆర్డరుచేసి గృహోన్ముఖులైనారు. పిచ్చయ్య దొరగారి ఫ్లాస్కుకోసం బట్లరును అడగటానికి వెనుకవైపునవున్న వంటగదిలోనికి వెళ్ళాడు.

అక్కడ దొరగారి బట్లరు తీరికగా కూర్చొని రొట్టె, వెన్న, పాలూ ముందర పెట్టుకొని, తీరికగా అల్పాహారం చేస్తున్నాడు. ఫ్లాస్కుకోసం వచ్చిన పిచ్చయ్యనుచూసి మందహాసం చేశాడు.

తాము ఇంత యాతనపడి తెచ్చిన రొట్టె, పాలు దొరగారి బట్లరు ఫలహారం చేస్తుండటం చూసి పిచ్చయ్యకి బట్లరుని మింగేటంత కోపం వచ్చింది. అతని నెత్తిమీద ఒక్కటి మొట్టాలనిపించింది. కాని అట్లా చేస్తే ఇంకా ఏమన్నా వుందా? దొరగారి బట్లరుని మొట్టితే తన వుద్యోగం క్షణంలో వూడదూ."

పిచ్చయ్యను చూసి బట్లరు "తెచ్చేవాడివి కొద్ది వెన్నే తెచ్చావేం? ఇంకా కొంచెం తెస్తే నీసొమ్మేం పోయింది?" అన్నాడు నవ్వుతూ.








# దొరగారి అల్పాహారం

"నీ బాబుసొమ్ము ఇక్కడకూడ పెట్టావు?" అనుకొన్నాడు పిచ్చయ్య మనసులోనే. పైకి మాత్రం నవ్వి వూరుకొన్నాడు.

తర్వాత దొరగారి ఫ్లాస్కు తీసుకొని కాఫీ తీసుకురావటానికి బయలుదేరాడు పిచ్చయ్య. పిచ్చయ్య కాఫీ తీసుకొచ్చి దొరగారి వంటవాడికి అందించాడు. పిచ్చయ్యకు బంగళా డ్యూటీ వదిలి ఇంటికి పోయేటప్పటికి మధ్యాహ్నం ఒంటిగంటయింది. ఇంటికి వెళ్ళగానే భార్య అంది:

"అమ్మాయికి రాత్రినుంచి ఒకటే జ్వరం. నిన్న రాత్రినుంచి నువ్వు ఇవు లేకుండాపోతే మందూ, మాకూ ఎట్లాగనుకొన్నావు?"

"ఏం చెయ్యమంటావు? రాత్రి నుంచి బంగాళాదగ్గర డ్యూటీ సరిపోయింది నాకు. దొరగారి భోజనం ఇప్పుడే అయింది. ఇప్పుడే నాకు ఆటవిడుపు దొరికింది" అన్నాడు పిచ్చయ్య.

"బాగానే వుంది ఉద్యోగం. రెండు మెతుకులు కొరికి ఆ ఆచార్యులగారిదగ్గర ఏ మందో పట్టుకురా" అన్నది భార్య.

"సరేలే" అంటూ పిచ్చయ్య భోజనానికి కూర్చున్నాడు. రాత్రినుంచి జ్వరం తగులుతున్నా కూతురికి మందూ మాకూ తీసుకొచ్చుకోలేని తన అసమర్థతకు తనను నిందించుకొన్నాడు.

పిచ్చయ్య బంగళానుంచి ఇంటికి ఒంటిగంటకి వెళ్లాడు. కడుపులో ప్రేగులు అరుస్తున్నాయి. ఏదో ఇంత కూడు తిని నేలమీద ఒరుగుదామనుకొన్నాడు కొంచెంసేపు. కాని ఇంటికి పోయేసరికి అన్నం వండిన లక్షణాలు ఏమీ కనిపించలేదు.

"ఏమిటే ఇంకా అన్నం వండినట్లు లేదు" అన్నాడు భార్యను.

"ఏం పెట్టి వండమంటావు. రాత్రి నీవు బంగాళాకు పొయ్యేటప్పుడు బియ్యపుగింజలు లేవని చెప్పానుగా. ఇంత ప్రొద్దు పోయిస్తే ఎలాగనుకొన్నావు" అన్నది భార్య.

పిచ్చయ్యకు ఏడుపొచ్చింది. దొరగారి కొలువు గొడవలో ఇంటి సంగతి మర్చిపోయ్యాడు. జేబులో డబ్బులు కూడా లేవు. తన ఉద్యోగాన్ని తిట్టుకొంటూ బియ్యం అప్పుకోసం పిచ్చయ్య కొట్టుకు బయలుదేరాడు మిట్టమధ్యాహ్నం రెండు గంటల వేళ.



# వనితా లోకం

చేతిపనులు పొట్టగడవటానికి కొందరు చేస్తుంటే, కాలం గడపటానికి మరి కొందరు చేస్తారు. పొట్టగడవటానికి చేసే వారు కేవలం వ్యాపారదృష్టితోనే వీనిని చేస్తుంటే, కాలం గడపటానికి చేసేవారు కేవలం కాలాన్ని గడపటానికే కాక, పని ఫలితంలో ఒక ఆనందం ఉంటుందని ప్రయత్నిస్తారు. అయితే ఇచ్చటి చేతి పనులు రెండవ తెగలో వారికి సంబంధించినవే. సామాన్యంగా వీరు, దొడ్లో మొక్కలు పెంచటం, అల్లిక కుట్టుపనులు చేయటం, డ్రాయింగులు గీసి గోడలు అలంకరించటం, ఇంకా అనేక అలంకారాలు చేస్తుంటారు.

సామాన్యంగా పురుషులకు తీరిక సమయాలు బహు తక్కువ. ఎప్పుడైనా ఏమైన ఉన్నా వానిని భార్యాబిడ్డలతో సుఖంగా గడపటానికో, లేక ఇంటి వ్యవహారాలకో వినియోగిస్తారు. స్త్రీలకే తీరిక సమయాలెక్కువ. వీనిని గడపటానికి పద్ధతులు అన్వేషిస్తారు. సునాయాసమైనవీ, తక్కువ డబ్బు ఖర్చు కాగలవి, పైగా ఇంకే విధంగానైనా సహాయపడే పనుల్ని చేయ అభిలషిస్తారు.

వీటిమీద ఆసక్తి స్త్రీలకు సామాన్యంగా పుట్టుకతోనే ప్రారంభమవుతుంది. ఒక్కొక్క అభిలాషతో ఒక్కొక్క పనిలో ఒక్కొక్క మమతని ఇముడ్చటానికి స్త్రీ ప్రయత్నిస్తుంది. బొమ్మరిల్లు కడుతుంది చినపాప. లోపల, పైన, సున్నంగా అలికి ముగ్గులెట్టి, ముగ్గుల మధ్య చక్కగా ముస్తాబుచేసిన కొటాయి బొమ్మల్ని పెట్టి "వాటికి పెళ్ళి" అంటుంది. పెళ్ళికి పెద్దల్ని పోగుచేస్తుంది. వీధిలో "కోతి కొమ్మచ్చి" ఆడుతూన్న చిట్టన్నయ్యని కూడా పిలిచి. "చూడరా అన్నాయ్యా నా బొమ్మరిల్లెంత చక్కగా ఉందో" అంటుంది. చిలిపన్నయ్య అలోదల వక్రంగా నడచి, బొమ్మరింటిని పెగకూలుస్తుంది. తను అంచక్కా కట్టిన బొమ్మరింటిని చిట్టన్నగాడు ఎందుకు పడగొట్టాలో తెలియక తికమక పడుతుంది పాపం చినపాప.

## పాప సందేహాలు

సంక్రాంతి పండుగ వస్తుంది. ఎడాపెడా పది బొమ్మల్ని బల్లమీదుంచి "నైవేద్యం పెట్టవే పాపా" అంటుంది బొమ్మ "ఇదేంటి కిష్టుడెక్కడుంటే ఆవు నా చివర పెట్టింది.. వీడేమో అన్నగదా...మరి ఇదేమో చెల్లాయి ఇద్దరు కలిసి బడికెళ్తుంటే వీళ్ళమధ్య ఈ సింహాం బొమ్మెందుకు? ఏంటో...బొమ్మకేం తెలీవు బొత్తిగా" అనుకుంటూ బిడ్డ చేతుల్తో సర్దడం మొదలెడుతుంది చినపాప.

చేతిపనులు



కానూరి కమల కుమారి
(భట్ల పెనుమర్రు)

"చాల్లేవే. నీ సర్దుడూ నువ్వూను. అది కాస్తా చేజారి కిందపడితే అవుతుంది" అంటూ వెనకనుంచి కూకలేస్తుంది అమ్మ. వీళ్లంతా ఒకటే. తన్నెందుకలా అంటారో అర్థంకాదు పాపకి. పక్కింటి సుశీల బొమ్మల్ని తనే సర్దుకుంటుందట. తన బొమ్మల్ని ఈ తీరున చూచి నవ్వదూ అని మధనపడుతుంది చినపాప"

ఇలాగే చిన్నప్పటినుంచి అభిరుచులు ప్రతిపనిలోను పెంపొందుతుంటాయి. అంతో యింతో పరిస్థితుల్నిబట్టి ఈ అభిరుచులే స్త్రీకి అపేక్ష, అభిమానం కలిగించి పెంచుతాయి.

చిన్న చిన్న బొమ్మగిన్నెల్లో బియ్యం పోసి చాటుమాటున వండి నాన్నకి వడ్డిస్తే బాగుండుననుకుంటుంది చినపాప. చివరికి రుచి చూచేవాళ్లే దొరక్క తనే తిని ఊకేస్తుంది. పెద్దయ్యాక వంటపని తన విధాతుంది. పండక్కి "వారు" వచ్చారు. "అమ్మా ఈ ఒక్కపూట నేనే వంట చేస్తానే" అంటుంది సిగ్గు సిగ్గుగా—పెద్దదైన చినపాప. వంటచేస్తుంది. మృదువైన వేళ్ళ వయ్యారపు కదలికల్తో వడ్డిస్తుంది. "వారికి" వారి ప్రక్క తాతయ్యకి. వడ్డించి వెనుకనుంచి ఓరకన్నుల్తో చూస్తుంది వారు కలిపి తిన బోతుంటే ఎదురుగా ముసలాయన ఉన్నందువల్ల "ఎంత బాగా ఉంది పారూ" అని పైకి అనలేక కన్నుల్లోనే భావాన్ని వ్యక్తపరుస్తారువారు. ఇక ఈ పెదపాప ఉబ్బితబ్బిబ్బై పోతుంది. ఈ తాతమాత్రం ఎప్పుడూ అంతే. తేతేమంటాడే గాని తెచ్చిం తర్వాత ఒక్కసారి నోరిప్పి "ఇంత బాగా చేశావు. ఇలా అయితే మా మనమడు రేపే తీసుక్కపోతాడు" అనడు. తేతేమని బుట్టెడు గారెలు తిన్నాక 'ఆ చేదు గారెలు' అంటాడు. పాపకి కోపం వచ్చేస్తుంది.

మమతతో కూడిన ఇటువంటి పనులే అనేకమందిని కూడదీసి జన్మజన్మాంతరాల వరకూ కలిపి కట్టివేశాయి. పురుషుడీ స్త్రీ పనుల్లో ఒకవిధమైన ఆనందానుభూతిని పొందుతాడు. కాఫీ ఎంత చేదుగానైనా ఉండనీ "నేనే కాచానండి. తాగి ఎలా ఉందో చెప్పాలి" అని సతీమణి నోటంట వచ్చేసరికి ఒక్క గుక్కలో తాగేసి భేషుగ్గా ఉన్నాయంటాడు. వారు తాగి వెళ్లిన తరువాత తనారగించబోతే ఘటిక చేదు. మరి వారి కంత రుచిగా ఎందుకున్నాయో తెలిసికోలేదు భర్త మమతెరుగని భార్య.



చేతిపనులసంస్థ నెలకొల్పిన నాలుగు నమూనా తయారీ కేంద్రాలలో (ఢిల్లీ, బొంబాయి, కలకత్తా, బెంగుళూరు) ఢిల్లీ కేంద్రంలో లోహంతో చేస్తున్న పాత్రలు, పళ్లాలు, దీపపు కుందులు, డబ్బీలు వగైరా

# ★ చేతిపనులు ★

మా బంధువుల్లో ఒకాయ నున్నాడు. బజారునుంచి గుడ్డ తెచ్చి, చేతిరుమాళ్లు కుట్టమని భార్యకిస్తాడు. చేతి రుమాళ్లు కుట్టి వాటిమీద రంగు విచ్చుల్తో "స్వీట్ హోమ్" అనో లేక "హాపీడే" అనో కూడ కుడుతుంది. దానిని వాడితే గాని ఆయనకు మనసులో మనసుండదట. రంగు రంగుల కుట్లు రుమాళ్లను ఆయన బజార్లోను, ఆఫీసులోను, వాడటం చూచి ప్రక్క ప్రక్కవారు అప్పుడప్పుడు చాటు మాటుగా నవ్వుకుంటారు. అయితేనేం ఆ మమత అటువంటిది. "స్వీట్ హార్ట్" అనో "స్వీట్ హోమ్" అనో మా వదిన చేత కుట్టబడిన కవరు వెయ్యని దిండు మీద మా అన్నయ్యకి అసలు నిద్రే పట్టదు. ఇలా అనేక విధాల భార్యాభర్తల మధ్య



భారత చేతిపరిశ్రమలమండలి అధ్యక్షురాలు శ్రీమతి కమలాదేవి

మమతల్ని పెంపొందిస్తాయి. చేతిపనులు. భార్య అలంకరించిన డ్రాయింగురూములో కూర్చొనగా మనస్సు ఆనందంతో పరవళ్లు త్రొక్కుతూంటే ఆ పరవళ్ళ వరవడిలోనే అనేక అద్భుతమైన గ్రంథాల్ని సర్ వాల్టర్ స్కాట్ అనే ప్రఖ్యాత ఇంగ్లీషు నవలాకర్త సృష్టించి ప్రపంచానికి అందజేశాడట.

భర్త తనని, తన పని విధానాన్ని చూచి ఆనందిస్తే అంతకన్నా కావలసింది ఏముంది కనుక భార్యకి!

తమ తమ అభిరుచుల్తో స్త్రీలు ఒక పనిని మమతలు గూర్చి పూరిస్తారు. దాని ద్వారా ఆనందాన్ని ఆశిస్తారు. ఇందుకు సరైన పనిని ఎరుకోవటములోనే స్త్రీ చాకచక్యం ఇమిడియున్నది. వంటపనా, కుట్టుపనా, అల్లికపనా, అలంకరణలా, ఇంకా ఏదికి ఎవరికి దేనిమీద అభిరుచుంటే దానిని కాలయాపనకి వినియోగించుకోవాలి. ★



ఫరీదాబాదు (ఢిల్లీపక్కన)లో కాందిశీకులు, ముఖ్యంగా స్త్రీలు చేత్తో తయారుచేస్తున్న బుట్టలు వగైరా గృహోపకరణాలు. చేతిపనులసంస్థ నెలకొల్పిన నాలుగు కేంద్రాల తయారు చేసే వస్తువుల నమూనాలు.

# ప్రసిద్ధకావ్యాలలో ★ ★ అజ్ఞాత నాయికలు

"ప్రాచీన కాలంనుంచీ - ప్రస్తుతం వరకూ సాహిత్యాన్ని జాగ్రత్తగాపరిశీలిస్తే, కవులు ఆయా గ్రంథాలలో స్త్రీ పాత్రలకు ఎంత ప్రాధాన్యం ఇచ్చారో తెలుస్తుంది. అందులోనూ ప్రధాన నాయికకోసం చెలికత్తెలు ఎంతటి నైపుణ్యాన్నీ - కార్య నిర్వహణ సామర్థ్యాన్నీ ప్రదర్శించారో మనం గమనించ గలుగుతాం. ధీవిశేషంగల మంత్రి ఉన్నప్పుడు రాజు ప్రతిభ రాణించినట్లు చెలికత్తెల ప్రతిభమూలంగా ప్రధాననాయికలు తళుకు బెళుకులతో ధగధగమంటూఉంటారు.

సర్వసాధారణంగా సాహిత్యగ్రంథాలలో కథాంశం ఇలాగ ఉంటుంది. ఒక ప్రధాన నాయకుడు - నాయిక వీరి ఉ యులకు చెలికాడు - చెలికత్తె. ప్రధాన నాయికా నాయకులు ఏ ఉద్యానవనంలోనో ఏ మధ్యవర్తుల మూలంగానో, ఏ స్వాప్నికావస్థలోనో చిత్రపట సందర్శనాలవల్లనో పరస్పరావలోకనాదులు...ఆపైన శృంగార రస పుష్టికి వలయువర్ణనలు. విప్రలంభశృంగారము గూడ కొంత అవసరమని మధ్య మధ్య ఈ ఉభయులకీ ఏవో కొన్ని అంతరాయాలు, ఆపైని చెలికత్తెల బుద్ధిబలంచేత కార్య సాఫల్యం. ఈ చెలికత్తెల పాత్రలలో ప్రాణము లొడ్డుటకైనా వెనుకాడని మిత్రభావమూ - పరస సంభాషణ చాతురీ విశేషములూ - శైత్యోపచారములు చేయుటలోగల సేవా దక్షతా - మొదలగు సద్గుణ పరంపరలు పాఠకులకు మిక్కిలి ముదావహములు.

జర్మన్ దేశపు మహా విద్వాంసుడు గటీ కాళిదాసు, శకుంతల నాటకాన్ని చదివి - సీతమ్మను చూచిన హనుమంతుడులాగ కుప్పి గంతులువేసి నాట్యం చేశాడట! నిజమే! మన కాళిదాసాది కవుల కావ్యములలో అంతటి ప్రాశస్త్యం ఉన్నది.

## ప్రియంవద

శకుంతల చెలికత్తెలు అనసూయ, ప్రియంవద. అసూయ లేనిదగుటచేత ఆమె అనసూయ పేరు సార్థకం. అలాగానే ప్రియమైనమాటలు మాటాడేది గనుక ప్రియంవద మాట సార్థక నామరే. ప్రథమాంకంలో సాయం సమయాన మొక్కలకు నీళ్లు పోస్తూవున్న శకుంతలనూ, ఆమె చెలికత్తెలనూ వృక్షాల చాటుననుండి చూశాడు దుష్యంతుడు. కేసర వృక్షానికి నీళ్లుపోస్తున్న శకుంతలను చూచి ప్రియంవద "హలా శకుంతలే! అత్రైవ తావన్ముహూర్తం తిష్ఠ యావత్ త్వయా ఉపగతయా లతా సనాథ యివ అయం కేసర వృక్షకః ప్రతిభాతి" అంటే "ఈ కేసర వృక్షము నీతినూలతచే సనాధవలె శోభిస్తున్నది" అనగా శకుంతలకు యుక్తవయస్సు వచ్చినది; తగిన వరునితో నున్న బాగుండునని ధ్వని.

చిల్లరిగె స్వరాజ్యలక్ష్మి

ఆ అర్థాన్ని గ్రహించి శకుంతల "అతఃఖలు ప్రియంవదా" అందుచేతనే కదా నీకు ప్రియంవద పేరు సార్థకం అన్నది.

దుష్యంత సందర్శనా నంతరం—మారుని బాణహతిచేత—మనస్తాపంతో ఖిన్నురాలై—శోభావిహీనరాలైన శకుంతల హృదయ పద్మాన్ని — మాటలనే మధురజలాలతో సేవదీర్చగలిగిన ధీర స్వాంత—ప్రియంవద.

మూడవ అంకంలో శకుంతలకు అనసూయా ప్రియం వదలు—శైత్యోప చారాలు చేస్తూవుండగా మహారాజు మతి చెడి మధ్యాహ్న సమయంలో వారున్న లతా మండపంలో ప్రవేశించి మాటున దాగివుండి వారి సంభాషణాదులు వింటున్నాడు. అనసూయా ప్రియంవదలకు విషయం అర్థం అయినా, ఆమె నోటనే వినాలనే కుతూహలంతో సంభాషణ సాగించారు. సార్వభౌముని హృదయం శకుంతల ఏమి చెపుతుందా! అని జంకుతో తామరాకు మీద నీటిబొట్టు లాగ తహతహలాడింది ఎలాగ అయితేనేం? ప్రత్యక్షంగా చెలికత్తెలూ—పరోక్షంగా మహారాజూ—ఆమెనోట, వినవలసిన మాటలు విన్నారు.

"కామాతురాణాం నభయం నలజ్జా" అన్నట్లు, శకుంతల తెగించి—తన హృదయగత భావాల్ని నిరర్గళంగా చెప్పింది. చెప్పటమే కాదు—శ్రుంగరిని మీద తన్ను చేర్పినచే తప్ప—జీవితానికి లేదన్నది, దానితో చెలికత్తెలు-అలోచనా సముద్రంలో పడి కొట్టుకోవలసి వచ్చినది.

సమయం వస్తేగాని-సామర్థ్యం బయట పడదు. ప్రియంవద ఆలోచించి, ఇట్లా సలహా ఇచ్చింది. శకుంతలా! నీ అభిప్రాయాన్ని — లిఖిత పూర్వకంగా ఇవ్వు. ప్రసాదం ఇచ్చే మిషతో దుష్యంతుడికి అందచేస్తాం" అన్నది

శకుంతల: "నీసలహాకి - చాలా సంతోషించాను. ఏలాగో ఆలోచించి వ్రాస్తానులే! ఎలాగ వ్రాయను?

ప్రియం—"వ్రాయవలసిన విషయం నువ్వు ఆలోచించు-వ్రాయడానికి ఉపకరణ సాధనం నేనాలోచిస్తాను" అన్నది.

ఆ సాధనం ఏమిటా అంటే లేతతామరాకుపై నఖాగ్రాలతో లిఖించవే సఖి అన్నది ప్రియంవద, ఎంత చక్కటి సమయస్ఫూర్తి!

## సాగరిక

శ్రీ హర్షవి రచితమైన రత్నావళి నాటకంలో, సాగరిక చెలికత్తె అయిన-సుసంగత కూడా మంచి సమర్థతగల పాత్ర. వత్సరాజు రత్నావళిని పెండ్లాడినట్లయితే - "అఖిల జలధి వేలావలయవలయిత వసుమతి"కి ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏల గలుగుతాడని-జ్యోతిష్కులు చెప్పారు.

అందుచేత మంత్రి యౌగంధరాయణుడు రత్నావళికోసం ఆమె తల్లిదండ్రులకు కబురు చేశాడు. ఇలా ఉండగా వారందరూ సముద్రముపై విహారానికి బయలు దేరారు. పెద్దగాలివాన వచ్చుటచేత, వారెక్కిన నావ ఒకరాతికి తగిలి ముక్కలైనది అందరూ చెల్లా చెదరైనారు "తన్నితే బూరెలగంపలో పడినట్లు" రత్నావళి వత్సరాజు రాజ్యం చేరుకున్నది. మంత్రి ఆమెను గుర్తుపట్టి వాసవదత్త దగ్గరనే ఉంచాడు.

వసంతోత్సవ సందర్భంలో వాసవదత్త వత్సరాజును, పూజిస్తూ ఉన్నవేళ సాగరిక పొదలమాటుననుండి ఆతనిని చూచి, నిజంగా మన్మథుడనే భ్రమపడినది.

ఒకనాడు ఉద్యానవనంలో సాగరిక ఒంటరిగా కూర్చొని, తాను చూచిన మన్మథుని ఒక చిత్రఫలకంమీద చిత్రిస్తూ, ఆధ్యానలో మెల్లగా తనప్రక్క చేరిన సుసంగతను - చూడలేదు. "సఖీ! సాగరికా! ఏమి చిత్రిస్తున్నావు?" అని ఆమె ప్రశ్నింపగా "మకరందోద్యానంలో నేను చూచిన మన్మథుని చిత్రిస్తున్నాను" అని ఆమె

# 'ప్రసిద్ధకావ్యాలలో అజ్ఞాతనాయికలు'

సమాధానము చెప్పినది. సుసంగత ఆ ఫలకముసు ఆమెవద్దనుంచి పుచ్చుకొని వత్సరాజు ప్రక్కనున్న సాగరికను జీవకళ ఉట్టిపడేటట్టు చక్కగా చిత్రించింది. "నన్నెందుకు అక్కడ లిఖిస్తున్నావు?" అని ఆమె కోపంగా అడిగినది. అంటే: "నువ్వు మన్మథుని - ఎలాంటి వానిని వ్రాశావో - ఆ మన్మథునికి సరిపడిన - రతిని చేసు వ్రాశాను." అని సమాధానం చెప్పింది. 'రత్నావళి' నాటికలో యీ సుసంగత పాత్రను కవి బహు సొగసుగా సృష్టించాడు.

## చిత్రరేఖ

పోతన ప్రణీతమైన భాగవతంలోనూ, శంభుదాసకృత హరివంశంలోనూ, సాహిత్య రసపోషణసంవిధాన చక్రవర్తి - నాచన సోముడు రచించిన ఉత్తర హరివంశము లోనూ, కథావస్తువు - ఒక్కటే:— అయినా, ఆయాకవుల ప్రతిభలు - వేరు వేరని - తెలుస్తుంది - అందరిలో అందవేసిన చెయ్యి సోమునిదే. అతిప్రతిభావంతంగానూ సౌమ్యంగానూ, భావగాంభీర్యాన్ని పోషిస్తూ, నారీపాత్రలను సుకుమార పదాలతో, రమణీయంగానూ, రసవత్తరంగానూ, సృష్టించి సాహిత్య సంవిధాన చక్రవర్తి బిరుదాన్ని - అక్షరాలా - సార్థకం చేసుకున్నాడు - నాచన సోమనాథుడు.

పాత్రలకు - పేర్లు పెట్టడంలో మన కవులు వాటికి సార్థకమైనపేర్లే పెడతారు.

ఉష బాణాసురుని ముద్దుల కూతురు. ఆమె చెలికత్తె చిత్రరేఖ - వారుభయులూ నివసించేది, పోరుటీగ అయినా చొరుటకు వీలులేని శుద్ధాంతము.

ఇట్లుండగా పార్వతి ఉషకు ప్రత్యక్షమైంది:

"కడగి వైశాఖ శుక్లపక్షంబునందు
ద్వాదశి దినాంత వేళ సౌధంబు మీద
మదనకేళికి కలలోన గదియు నిన్ను
నెవ్వ డాతండు మగడు నీకిందువదన.",

అని తెలిపి అంతర్ధానమైనది.

పార్వతీదేవి చెప్పిన చొప్పున ఉష ఒకప్రియుని కూడినది; మేలుకొన్నది; మిక్కిలి పరితపించినది. ఇలాగ ఆ బాణపుత్రిక, అపరిమిత తాపంతో బాధపడుతుండగా ఆమె శరీరం అంతా—పాండుర వర్ణంగా మారిపోయింది. ఆబాలిక శరీరంలో ఈమార్పు ఎందుకు దాడచూపిందో! ఎన్నివిధాల ఎంతమంది ఆలోచించినా ఎవరూ ఏమీ గ్రహించలేకపోయారు. స్వప్నంలో శ్రీకృష్ణ పౌత్రుడు, అనిరుద్ధుణ్ణి చూచినది మొదలు ఆవిడ అదోలాగు అయినది:—

"తుడుపదు కన్నులన్ వెడలు తోయ
కణంబులు—కొప్పుచక్కగా
ముడుపదు—ముచ్చటకుం జనదు—
అన్నమేమియున్
కుడుపదు—" అన్న రుక్మిణి పరిస్థితిలోనే ఉన్నది—ఉషాకన్య.

ఆమె స్థితిగతులన్నీ, చెలికత్తె చిత్రరేఖ ఇట్టేకనిపెట్టేసింది. ఆమెతో ఇట్లన్నది.

"వనితా! ముల్లజగంబులన్ నటులన్
వ్రాయంగనేర్తున్ సుప
ర్వనరాహి ప్రముఖ స్వరూపములు
చిత్రపాటిమై చూపెదన్!
గని నీకున్ కలలోన కన్పడిన
యాకళ్యాణ రత్నాకరున్!
మనవాడంచు నెఱింగిపట్టి మదిలో
మన్నించినన్ మెచ్చనే!"

"ఏడుదినంబులలో నీ
వేడు జగంబులను వ్రాసియిత్తు పటము నీ
వేడుకకు తగిన వానిన్
జాడుమతని తెత్తు-నన్ను చూడు లలితాంగీ!"

అని ఆమెకెంతో ధైర్యము చెప్పి—ఏడు రోజుల్లో యావన్మంది రాజకుమారుల చిత్రాలన్నీ చిత్రించి తెస్తాను"అని వెళ్ళినది చిత్రరేఖ.

తక్కిన చెలికత్తెలంతా:

"శూలి విలోకనానలము సోక
రతీశు డెరుంగుగాన యు
ష్మాల ముఖంబులో విరహపావక
దాహము నోర్చినన్న శ
ష్పీల బాసంగ! దేహము దహించిన
యంతటితో మనోజ్ఞుడై
గాలియ చిక్కగాన—చెడగాలదుగా
కిటుకంటి మంటలన్—"

అని మనోజాలంబున మునుగుచున్న మను వనుగని ఎన్ని శైత్యోపచారాలు చేసినా లాభంలేక పోవడంచేత, పాలిపోయినముఖాలతో ఏమిచెయ్యాలో ఏమీతోచక, పనీ పాటా ఏమీచేపట్టక, కాలుగాలిన పిల్లుల లాగ, ఊరికే అటూ యిటూ తిరుగుతూ ఈవిడకు ఆరోగ్యం—ఎలాగకుదట పడుతుందాఅని బెంగతో అల్లాడుతూ, ఆర్త మూర్తులై ఉన్నారు చెలికత్తెలు.

ఇంతలో—చిత్రపటములతోసహా—అతి త్వరగా చిత్రరేఖ ప్రవేశించింది. ఆమెను చూచి—చెలికత్తెలు—

"ముల్లోకంబుల మూర్తులన్ పటమునన్
ముద్రించి చేర్పెల్లరా
జిల్లన్ మెల్లన చిత్రరేఖ చనుదెంచెన్
నిండు ప్రాణంబునం।
దిల్లన్ బాణతనూజకున్ దెలుపకన్
దిక్కెవ్వరున్ లేరు—నా
తల్లీ! వచ్చితె! యంచు నెచ్చెలులు
మోదం బంద డెందంబునన్"

ఇందులో "నాతల్లీవచ్చితె" అన్న మాటలో; "మాపాలిటి భాగ్యదేవతా! కల్పవృక్షమా! కామధేనువా! కన్నతల్లీ! దుఃఖ సాగరంలో మునుగుతూన్న మాకందరికీ తెప్పవై—ఒడ్డుచేర్చు" అంటూ ఉప్పొంగిన వారి మనస్సులోని తహతహా సంతటినీ— ఈ "తల్లీ" అన్నమాటలో ఇమిడ్చినాడు— నాచనసోమన. చిత్రరేఖ, ముల్లోకాలలోని రాజకుమారులను ఒక్కొక్కపటమునే తీసి చూపించింది. కాని, ఉషకన్నులలో ఆశా భావం ఏమీ కనబడడంలేదు.

- భరత ఖండంలో-ఉన్నన్న దేశాధీశుల్ని క్రమంగా చూపుతున్నది. చిత్రరేఖ; ఉష ఆ పటములను అలాగే చూస్తున్నది. మహారాష్ట్ర పశ్చిమోత్తర భూమిని, యదువుల నాయకులను ఒక్కొక్కరినే చూపుతూ, ఆ వరసలో సీరిని, కమలనాభుని, సాత్యకిని ప్రద్యుమ్నుని చూచి, ఆ వరసనే ఉన్న— అనిరుద్ధుని చూచేసరికి,—మైజాదుకొన్న పులకలతో—మెల్లగా జారే చెమటతో— "నా మనము ముచ్చిలిచొచ్చిన మత్తకాడు వీడు—వీడే—కొమ్మని—చేసాచి వెలది చూపె."

"తన కలచిత్రంలో హత్తుకొన్నది— అనిరుద్ధుని రూపమని—చిత్రరేఖకు స్పష్టం అయింది అయితే—చిత్రరూపంలో చూపించిన మానవుణ్ణి—ఉషాకన్య అంతఃపురంలోకి తెచ్చి ప్రవేశపెట్టడం—ఎలాగ? వాడితో నాతెన్నా తెలుసుకోవడం! ఎట్లా? అని తెంబేలుపడక, చిత్రరేఖ ఉషను హుషారుగా ఉండమని—హెచ్చరించి—" ఆరు గడియలలో అతనిని నీ గదిలో ప్రవేశపెడతానని—అతి ధైర్యంతో వాగ్దానం చేసి వెళ్ళింది.

మార్గమధ్యంలో నారదుడు కనబడ్డాడు. అతనికి భయభక్తులతో నమస్కారం చేసి, చిత్రరేఖ సంగతి యావత్తూ విశదం చేసింది. ద్వారకలో అనిరుద్ధుని పడకగదిని నారదుడు ఆమెకు చూపించాడు. సంతోషించినా, జంకుతో, "ఋషివర్యా! మాయచేసి, అనిరుద్ధుని నేను మా ఉషాకన్య వద్దకు తీసుకెళ్లితే, కృష్ణ భగవానుడు నన్ను శపించడు కదా?" అని అడిగింది. "మరేం భయంలేదు. అన్నిటికీ—నేనున్నాను—" అని నారదుడు భరవసా ఇచ్చాడు.

రాత్రి అయింది. గంధర్వ శక్తిచేత చిత్రరేఖ, అనిరుద్ధుని ఆకాశమార్గాన ఆరు గడియలలోగానే ఉష అంతఃపురంలో చేర్చింది.

ఒక దేశంలో ఉండే మనుష్యులే— కట్టూ—బొట్టూ—ఒక రకంగా ఉండక— భేదంగా ఉంటవి. ఇన్ని లోకాలలో— ఇన్నిన్ని దేశాలలో ఉండే—రాజుల్ని— వారి పుత్రపౌత్రగణాల్ని—ఏమీ తీసిపోకుండా—చిత్రించి తెచ్చింది చిత్రరేఖ —అంటే-ఆమెకు ఎంతటి చిత్రకళా నైపుణ్యం ఉండేదోగదా! అని ఆశ్చర్యం కలుగక మానదు. ఆ కావ్యం చదివిన తరువాత— ఆమెను శ్లాఘించి మెచ్చనివారు—ఉండరు.

మన కావ్యములనే సువర్ణాలంకారములలో—ఈ—అజ్ఞాత నాయికలు—మహారత్నాలలాగున—మహోజ్జ్వలంగా ప్రకాశిస్తున్నారు. 

ఇంటిశుభ్రత-(2)

# బద్ధకానికి హడావుడి తోడైతే....

బాబాయిగారింట్లో అడుగుపెడితే చాలు ఓ సముద్రంలో పడిపోయినట్టే! మధ్యలో తిమింగలాలూ, మొసళ్లూ, నానారకాలైన చెత్తాచెదారం మనకాళ్ళకు చుట్టుకుపోతుంది. ఓ వేపు అనిలేదు. హాల్లో మధ్యలో మాసినగుడ్డలు పడేసుంటాయ్. అవి దాటిపోతే కింద కుప్పగా బాబాయి, పుత్రరత్నాలూ, ఆఫీసుకూ, కాలేజీలకూ వేసుకెళ్ళాల్సిన పేంట్లూ, షర్టులూ చాపచుట్టల్లా పడుంటాయ్! అవి అధిగమించిపోతే ఇక తడిపిపారేసిన టవల్సు, తుడుచుకుని మాసేంతవరకూ తొక్కనవసరంలేకున్నా వగైరా! వగైరా! ఇవన్నీ ఒక ఎత్తు...వంటఇల్లు ఒక ఎత్తు! రకరకాల వస్తుసముదాయాన్ని, చిన్నవాడు వాడుకునే పలకా బలపం దగ్గరనుంచి, బాబాయి షేవింగ్ సెట్టువరకూ (వంటసామానులూ అవ్వకాక) మనం తిలకించవచ్చు. ఒకటిరెండుమాట్లు అలా తుక్కుగా పడేసున్న ట్రౌజరు జేబులోంచి రేకెత్తించి బాబాయిని హెచ్చరించినా, బాబాయి మాత్రం దాన్నేమీ ఖాతరుచెయ్యలేదు.

దీని కారణం ఏమిటి? అనుకుంటే రెండు సమాధానాలు తోస్తాయి, ఒకటి బద్ధకం, రెండు నిర్లక్ష్యం. ఈ బద్ధకం వుంది చూచారూ, దానంత చెడ్డగుణం మరోటి లేదు. పోనీ ఏదో చిన్న చిన్న పనికిమాలిన విషయాలు ఎప్పుడైనా బద్ధకించినా ఫర్వాలేదు గానీ, నిత్యజీవితంలో అడుగడుగు ప్రతిపనిలో—మనం వేసుకునే బట్టలదగ్గర్నుంచీ, ఇల్లు సర్దుకునే దగ్గర్నుంచీ బద్ధకిస్తే ఎలా వుంటుంది? బద్ధకంవల్ల పుట్టేదే నిర్లక్ష్యం ప్రతిపనినీ నిర్లక్ష్యం చేస్తే అసహ్యంగా వుంటుంది ఆ ఇల్లు.

బద్ధకస్తుల్లో ఆడ, మగ, అని విచక్షణ, ప్రత్యేకతలేదు. వాళ్ళూ, వీళ్ళూ ఇద్దరూ వున్నారు. ఇంటిని శుభ్రంగా, ఉన్నంతలో చేతయినంతవరకు శుభ్రంగా వుంచడం ఇల్లాలివిధి. అలా అని నానా భీభత్సం మగాళ్ళుచెయ్యక్కరలేదు వాళ్ళూ కాస్త ఆ పరిశుభ్రతకు తోడ్పడితే ఇంకా బాగుంటుంది. వంటగదిలో వంటసామాన్లు పొందికగా అమర్చుకోవచ్చు... మిగతా బట్టలూ అలాటివి హాల్లో అయినా ఓ పక్కగా వితరణగా అమర్చుకుంటే చూడ్డానికి ఎంతో బావుంటుంది "ఇల్లు నీటుగా వుండాలంటే అన్ని సామాన్లూ సర్దుకోటానికి పెద్దదిగా వుండొద్దా?" అంటూ అనవసరప్రశ్న ఒకటివేస్తారు కొందరు. కావ ఓ పెద్దదేవాలయంలా ఇల్లుండి ఎక్కడికక్కడ చిందరవందరగా వస్తువులు పడుంటే అదేం అందగించదు...ఎంత చిన్న ఇల్లైనా, పొందికగా సర్దుకోడంలోవుంది తెలివితేటలు!

## 'లా' పాయింట్లు

కొందరిళ్లల్లో ఇల్లాళ్ళు మరీ బద్ధకించి ఎక్కడికక్కడ పిల్లల బట్టలూ, తమ జాకెట్లూ, ఇలాటివేకాకుండా పాత్రలూ అన్నీ పారేస్తుంటారు. దానివల్ల కేవలం అవి మాయడం అలాటివేకాకుండా దిక్కులేకుండాపోవడంకూడా జరుగుతుంది. పోనీ పని తొందరనుకుందాం! ఆఫీసులకెళ్ళే వాళ్ళూ, స్కూలుకువెళ్ళే పిల్లలూ వాళ్ళు వెళ్ళింతర్వాతయినా బద్ధకించకుండా పని తొందరలో మూలమూలల పారేసిన వస్తువుల్ని మళ్ళీ తిన్నగా సర్దుకోవచ్చు. అలా

పవని నిర్మలప్రభావతి

సర్దుకోటానికి ఎంతో సేపుకూడాపట్టదు... ఇంటికి ఇల్లూ శుభ్రంగావుంటుంది, వస్తువులకు వస్తువులూ బాగుంటాయ్. ఎవరైనా చటుక్కున ఇంట్లోకివచ్చినా కాస్త చూడానికి దానికి శుభ్రంగావుంటే బావుంటుంది. ఇకపోతే మొగవాళ్ళు కొందరు ఆఫీసునుంచి వస్తారా, లేకపోతే ఏ కాలేజీనుంచో వస్తారా? వచ్చీరాంగానే ఆ ట్రౌజర్ తీసేసి ఓ వేపు గిరవాటుకొట్టి చేతికందిన టవల్ ఓటి చుట్టుకు బయల్దేరుతారు స్నానానికి.. ఇక ఆ గిరాటువేసిన ట్రౌజరు మళ్ళీ ఇస్త్రీకి వేస్తేగానీ రెండోసారి వేసుకోటానికి పనికిరాదనే సంగతి రెండోరోజు ఆఫీసు టైంఅయినప్పుడుగాని గుర్తుకురాదు. ఇక ఆ టవల్తో ఒళ్ళు తుడుచుకుని ఝామ్మని ఓమూల వుడ్చి పెట్టేస్తారు. అంతే అది అంతటితో ఖతమ్ అయిపోతుంది. చాకలికి వేసేసరికి, ఎలికలు కొట్టెయ్యడమో చిమ్మెటలు కొట్టెయ్యడమో నానా రసభగా తయారవుతుంది! అదేమంటే "ఇంట్లో ఆడవాళ్లు ఎందుకు చూడకూడదు?" అంటూ ఓ లాపాయింటు విసురుతారు. ఉదయం లేచింది మొదలు రాత్రి పడుకోబోయేదాకా పనిలో, పిల్లలతో సతమతమౌతూండే ఆడవాళ్లు మళ్ళీ వీళ్ళు పారేసే టవల్సవెతికి, ట్రౌజర్లూ, షర్టూ మడతలువేస్తూ (అదీ ఏమన్నా, వీలవుతాయా) చూచోడానికి ఎంతకష్టంగా వుంటుందో ఆలోచించండి! ఇలా రాశానని అందరు మొగవాళ్ళూ, అందరు ఆడవాళ్ళూ అలా వుంటారనికాదు నా వుద్దేశ్యం. అలా వుండేవాళ్ళ మాటే నే చెబుతూంట!

## హడావుడి రాయుళ్ళు

వీళ్ళల్లో హడావుడి రాయుళ్లు కొందరు! ఉతికిన చీరెలూ జాకెట్లూ తోలేడన్ని ఇవతల వుంటాయ్...అవి సర్దుకోటానికి, చూచుకోటానికి బద్ధకమూ, హడావుడీ రెండూ తోడించి ఎలాఅయితేనేం మళ్ళీ ఓ కొత్తది పెట్లోదిలాక్కొస్తారు. మళ్ళీ ఇవతల చూస్తే ఓ పేలు పడేసుంటాయ్. వృథాగా అలా వాడేస్తే త్వరగా పాడయిపోవడంతప్ప మరేమీ ఆదాయం వుండదు. అల్లాగే టవల్సుకూడా వాడేస్తుంటారు కొందరు మొగవాళ్ళు. పైన ఓ టవల్ వేసుకొని వుంటారు, చేతులో ఓటుంటుంది...మళ్ళీ ఇవతల రెండోమూడో వుంటాయ్... అన్నీ ఒక్కసారిదేనికి, చాకలికి అన్నీ వేస్తే తర్వాత టవల్సు ఎలా? అనే ఆలోచనను దరిదాపులకూడా రానివ్వరు.

ఈ హడావుడి మనుషులో పెద్ద తంటా. తమ ప్రాణం తీసుకుని, ఎదుటివాళ్ళ ప్రాణాలు తోడేస్తారు. బద్ధకానికితోడు హడావుడితోడయితే మరివేరే చెప్పక్కర్లేదు. ఒకచోట వెయ్యాల్సిన బట్టలు, వస్తువులూ బద్ధకించి హడావుడిగా మరోచోట వేస్తే వచ్చేఇబ్బందులు అన్నీ ఇన్నీకావు. మాకు తెలిసిన ప్లీడరుగారొకరున్నారు. వాళ్ళింట్లో అంతా పైనచెప్పిన బాపతు మనుషులే! పెద్దబ్బాయి గడ్డంగీచుకుని షేవింగ్ సెట్ వంటింట్లోపారేస్తే, పెద్దమ్మాయి స్కూలుకెళ్ళే తొందర్లో చీర, జాకెట్, ఆఫీస్రూంలో పడేస్తుంది. ఇలా వాళ్ళింట్లో ఓ సారి ఓ గమ్మత్తు జరిగింది. వాళ్లమ్మాయి ఉదయం ఎక్కడికో బయటికి వెళ్ళివచ్చి రాగానే చీరమార్చి, అంతకుముందు కట్టుకున్న నల్లబార్డరు తెల్లచీర పక్కనుంచే వాళ్ల నాన్నగారి కోట్ స్టేండ్ మీద వేసిపోయింది! ఇంకేముందీ వాళ్లనాన్నగారు స్నానంచేసివస్తూ రావడమే వాకిట్లో క్లయింట్సు కాచుకున్నారనే తొందరలో, అది పంచెనా, చీరెనా అనేమాపుగాని, ఆలోచనగాని లేకుండా మడతేసి అది చుట్టుకు బయటికివచ్చాడు. ఆ అవతారం చూస్తున్న క్లయింట్సు అసలు వచ్చినపని మరచిపోయారు!

వీళ్లల్లోనే మరోరకం వున్నారు. ముఖం కాళ్ళూ చేతులూ కడుక్కుని ఇంట్లోకి వచ్చినవాళ్లు తిన్నగా టవల్ తీసుకోవచ్చు తుడుచుకోటానికి, లేదా ఏదైనా ఓ శుభ్ర

(42-వ పేజీ చూడండి)